





శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః

# వ్యాస మాలిక



వరదరాజ స్వామి, కాంచీపురం



'పండితరత్న'
డా॥ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్వార్ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు



భగవద్రామనుజులు, శ్రీపెరుంబుదూర్



శ్రీ మనవాళమామునులు

## విషయ సూచిక

# అద్భుతాలలో పరమాద్భుతం

పద్మాసనంలో వెయ్యేళ్లుగా నిలచి ఉన్న రూపం. అది ఆధునిక సైన్సుకు కూడా అంతుపట్టని పరమాద్భుతం. అది ఒళ్ళు గగుర్పొడిచే నిగూఢ రహస్యం. ఒక ఏడా! రెండేళ్లా! కాదు, కాదు. వెయ్యేళ్ళకు పైగా కంటి ముందు కనిపిస్తున్నప్పటికీ, అంతు పట్టని ఆధ్యాత్మిక మిస్టరీ అది. ప్రకృతి ధర్మాలను తలదన్నిన నిలువెత్తు నిగూఢ రహస్యం. వైజ్ఞానిక రంగానికి అది ఒక పెను సవాల్. 1000 సంవత్సరాలుగా ఒక సవాల్. వందల సంవత్సరాలుగా జీవించిన మహాయోగులు, అవధూతలు, అఘోరాలు, సిద్ధపురుషులు తమ ఉనికిలోని విలక్షణతను చాటుకోవడం ప్రసిద్ధమే. కానీ, 1000 సంవత్సరాలుగా ఒక పార్థివ దేహం చెక్కుచెదరకండా, ఒక గాలి వెలుతురు ప్రసరించే ఒక ఆలయంలో నిలచి ఉండడం అందరికీ ప్రత్యక్షంగా ఈనాటికీ గోచరిస్తున్నది. ఈ పార్థివ దేహం ఎవరిదో కాదు, భగవద్రామానుజాచార్యులవారిది.

ఈ అద్భుతమైన విషయం చాలా కొద్ది మందికి మాత్రమే తెలుసు. చాలా మంది, ఇది ఏదో ఒక రాతితో చెక్కిన విగ్రహం—అని భావిస్తున్నారు. ఆ విగ్రహం ఒక శిలాకృతి రూపంలో ఉన్నదని, అదేదో అచేతనమైన రాతి విగ్రహం అని చాలామంది అనుకుంటున్నారు. కానీ, ఆ పార్థివదేహం జీవించి ఉండే ఒక మనిషి దేహంవలె మెత్తగా ఉంటుంది.

కనుపాపలు, కనుబొమలు, కాలివేల గోళ్ళు చాలా స్పష్టంగా జీవించి ఉండే ఒక మనిషికి ఉండే వాటివలె గోచరిస్తాయి. మానవమేధస్సుకు అంతు పట్టని విధంగా నిలచి ఉండే ఆ పార్థివదేహం ఎక్కడ ఉన్నదో, ఈ అద్భుతానికి ఏది వేదిక అయినదో తెలుసుకునే ముందు, ఆ రామానుజాచార్యులవారి జీవిత చరిత్రలో సంభవించిన అనేక అద్భుత సంఘటనలలో ఒక సంఘటనను ఇప్పుడు తెలుసుకుందాం.

తిరుమలలో వెలసిన వేంకటేశ్వరస్వామివారి విగ్రహం విష్ణువా? శివుడా? అని ఆనాడు శైవ వైష్ణవులు వాదించుకొనే సమయంలో, ఈ సమస్యను భగవద్రామానుజులే పరిష్కరించారు శ్రీవేంకటేశ్వర స్వామి గర్భాలయంలో శంఖచక్రాలను ఉంచి, ఆలయం తలుపులను మూయించారు. తాళాలు వేశారు మరుసటి దినం ఉదయం గర్భాలయం తలుపులను తెరిచి చూడగా, అక్కడ పెట్టిన శంఖచక్రాలు శ్రీ వేంకటేశ్వరస్వామి చేతులను అలంకరిస్తూ గోచరించాయి. ఇంతటితో ఆ సమస్య పరిష్కారం అయినది.

ఇంకొక పరమాద్భుత లీలను చూద్దాం. ఆనాడు రామానుజుల వారు వేంకటేశ్వరస్వామివారికి జరిగే సేవలను, ఆరాధనలోని విధివిధానాలను చక్కగా సంస్కరించి, వాటిని ప్రవేశపెట్టి, తాము దగ్గర ఉండి అవి సరిగా జరిగేటట్లు నిర్వహించేవారు. ఈనాటికీ వారి అజ్ఞానుసారంగానే శ్రీవేంకటేశ్వర స్వామి సేవలు జరుగుతున్నాయి. ఆ

కాలంలో తిరుమల వెంకన్న ప్రసాదాలు తయారుచేయడానికి కావలసి వచ్చే పాలను ఆ తిరుమలలో ఉండే లక్ష్మమ్మ అనే గొల్లవనిత అందించేది. రామానుజులవారు ఆ పాలకు తగిన ధనాన్ని ఆమెకు ఇవ్వబోగా, ఆమె ఆ ధనాన్ని తీసుకునేది కాదు. "నాకు అవసరమైనప్పుడు, అవసరమైన దానిని అడుగుతానులే స్వామి" అని బదులు పలికేది. ఈ విధంగా చాలా కాలం జరిగింది. ఒకనాడు ముక్కోటి ఏకాదశి. ఆనాడు గొల్లవనిత లక్ష్మమ్మ పాలను యథాపూర్వంగా తెచ్చి ఇచ్చింది. తిరిగి వెళ్ళిపోకుండా అక్కడే నిలబడింది. అప్పుడు రామానుజులవారు "లక్ష్మమ్మా! ఈ రోజైనా పాల డబ్బులను తీసుకో!" అని అన్నారు. కానీ, లక్ష్మమ్మ ఇంతకు ముందువలెనే "వద్దు" అని అన్నది. కానీ ఆమె తిరిగి వెళ్ళిపోకుండా అక్కడే ఆ విధంగానే నిలబడి ఉండడాన్ని గమనించిన రామానుజులు, "లక్ష్మమ్మా! నన్ను ఏదో అడగాలని అనుకుంటున్నట్లున్నావే! ఏమి అడగాలని అనుకుంటున్నావు? చెప్పు. ఏ సందేహం లేకుండా అడుగు" అని అన్నారు. అప్పుడు లక్ష్మమ్మ ", స్వామీ! మీతో వేంకటేశ్వరస్వామి ప్రతి దినం మాట్లాడుతుంటాడనే విషయం నాకే కాదు నీ తిరుమలలో ఉండే అందరికీ తెలుసు కదా. ఈనాడు ముక్కోటి ఏకాదశి కదా గుడిలో ఉండే వెంకన్నకు నన్ను ఈనాడు వైకుంఠానికి తీసుకొని వెళ్లమని ఒక లేఖ వ్రాయండి నాకు మీరు ఒక లేఖను రాసి ఇవ్వండి" అని అంటూ ప్రాధేయపడింది. రామానుజులు ఆమెను నచ్చజెప్పడానికి ఎన్నో విధాలుగా ప్రయత్నం చేశారు. కానీ, ఆమె అంగీకరించలేదు. పట్టిన పట్టు విడవలేదు. చివరకు చేసేది లేక, రామానుజులవారు ఆమె కోరిన

విధంగానే శ్రీ వేంకటేశ్వరస్వామిని ఉద్దేశిస్తూ ఆమెకు పరమపదాన్ని ఇవ్వవలసినదిగా ఒక లేఖను వ్రాశారు. ఒక తాళపత్రాన్ని తీసుకొని గంటంతో ఆ తాళపత్రం పై "స్వామీ! ఈమె కోరిక నీకు తెలుసు కదా. ఆపై నీ దయ" అని రాసి, ఆ పత్రాన్ని ఆ గొల్లవనిత చేతికి ఇచ్చారు. ఆ పత్రాన్ని ఆమె అందుకోగానే, అక్కడే ఆమె కుప్ప కూలిపోయింది. ఆమె ప్రాణాలు విడచింది. అక్కడ అందరూ చూస్తూ ఉండగానే ఆమె పార్థివదేహంనుండి ఒక దివ్యకాంతి బయటకు వచ్చి శ్రీవేంకటేశ్వర స్వామి గర్భాలయంలోకి వెళ్ళి అదృశ్యమైనది. అందరూ ఆ దృశ్యాన్ని చూసి చాలా ఆశ్చర్యపడ్డారు. శ్రీ రామానుజులవారు ఆమెకు మొత్తం ఇవ్వవలసిన పాల డబ్బులను లెక్క కట్టి, దానికి మరి కొంచెం సొమ్మును కలిపి ఆ సొమ్ముతో ఆలయానికి నాలుగు వైపులా నాలుగు మంటపాలను కట్టించారు. ఇప్పటికీ శ్రీ వేంకటేశ్వరస్వామి బ్రహ్మోత్సవాలలో ఈ మంటపాల వద్ద కొంతసేపు ఆగి, ఆ గొల్లవనిత విషయంలో తనకు గల ఆదరాన్ని వ్యక్తం చేస్తున్నాడు.

వీడని మిస్టరీగా, కళ్ళ ముందు గోచరించే నమ్మలేని నిజంగా, ప్రపంచంలోని వింతలలో అతి విచిత్రమైన వింతగా, పరమాద్భుతంగా మానవాతీతమైన శక్తికి ప్రతీకగా సుమారు వేయి సంవత్సరాలుగా ఏమాత్రం శిథిలం కాకుండా ఉండే శ్రీరామానుజులవారి పార్థివదేహం ఎక్కడ ఉనన్నదో ఇప్పుడు తెలుసుకుందాం.

చెన్నై నగరానికి 5 కిలోమీటర్ల దూరంలో ఉన్న శ్రీపెరుంబూదూరులో వేయి సంవత్సరాలకు ముందు క్రీస్తుశకం 1017వ

సంవత్సరంలో శ్రీరామానుజులవారు అవతరించారు. ఆరడుగుల 11 అంగుళాల పొడగరి, వారు. విశిష్టాద్వైత మత వైభవాన్ని ప్రపంచమంతా తెలిసేటట్లు చేసి, 120 సంవత్సరాలు పాటు భారతావనిలో అంతటా సంచరించినవారు, వారు. వారు ఎక్కువ భాగం తమిళనాడులోని శ్రీరంగం కాంచీపుర క్షేత్రాలలో నివసించారు ఆంధ్రప్రదేశ లోని కలియుగ వైకుంఠమైన తిరుమలలోను, కర్ణాటక రాష్ట్రంలోని మేల్కోటైలోనుకూడా కొంతకాలం గడిపారు.

ఉభయ కావేరీ నదుల మధ్యలో ఉన్నది, శ్రీరంగ క్షేత్రం. ప్రసిద్ధమైన శ్రీవైష్ణవ దివ్యక్షేత్రాలలో ఈ శ్రీరంగం చాలా ప్రధానమైనది. ఇక్కడే శ్రీమన్నారాయణుడు శ్రీరంగనాథుని రూపంలో మనకు సాక్షాత్కరిస్తున్నాడు. అపరూప శిల్పకళాచాతుర్యానికి, అసాధారణమైన శిల్పసంపదకు నిర్మాణచాతురికి ఈ క్షేత్రం నిలయం. ఇక్కడ ఉండే భారీ ఆలయాల సముదాయం భక్తులను మంత్రముగ్ధులను చేస్తుంది.

ఆలయానికి 7 ప్రకారాలు ఉన్నాయి. ఈ ప్రాకారాలలో నాలుగవ ప్రాకారంలో ఒక ఆలయంలో భగవద్రామానుజుల పార్థివ దేహం ఉన్నది. తాము తమ శిష్యులకు ఇక్కడ శ్రీరామానుజులవారు పద్మాసనంలో కూర్చుని ఉండి, ఆధ్యాత్మిక ప్రవచనాన్ని చేసేవారు. వారి పార్థివ దేహం ఇప్పటికీ చెక్కుచెదరకండా ఉంది. అయితే, ఆ ఆకారం ఇపుడు కొద్దిగా కుంచించుకుపోయింది. కనుబొమలు, కంటిపాపలు, కాలి వేళ్ళ గోళ్ళు జీవించి ఉండే ఒక వ్యక్తికి ఉన్నట్లుగానే మనకు గోచరిస్తాయి. జీవించి ఉండే ఒక వ్యక్తి శరీరంవలెనే శ్రీరామానుజులవారి శరీరం కూడా చాలా మెత్తగా

ఉంటుంది. సంవత్సరంలో రెండు పర్యాయాలు ఆ విగ్రహానికి కర్పూర కుంకుమ లేపనాన్ని పూస్తారు. ఆ శరీరం ఈ నాటికీ ఉదయించే సూర్యబింబంవలె గొప్పగా కాంతులను ప్రసరిస్తూ ఉంటుంది. ఈ అద్భుతం ఎంత మాత్రం మానవమేధస్సుకు అందనిది. అలౌకికమైన అద్భుత శక్తికి ప్రత్యక్ష నిదర్శనంగా నిలచి ఉన్నది, భగవద్రామానుజుల ఈ పార్థివ దేహం.

# పల్లవరాణి సామవై

సుమారు 1500 సంవత్సరాల క్రితం శ్రీవేంకటేశ్వర స్వామి భక్తురాలు పల్లవ రాణి సామవై తిరుమలలో శ్రీవారి ఆలయంలో ఆనంద నిలయ జీర్ణోద్ధారణను చేసి, అనేక కైంకర్యాలను చేసింది. శ్రీవారికి అనేక ఆభరణాలను సమర్పించి అనేక ఉత్సవాలను చేయించి, తిరుమల చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయింది.

అది క్రీస్తుశకం ఏడవ శతాబ్దం. 614వ సంవత్సరం. రాణి సామవై తిరుమలకు వచ్చింది. వేలాది సైనికులతో వందలాది అశ్వాలతో, మధ్యలో ఏనుగులతో, పట్టపుటేనుగు పైన అంబారీపై కూర్చుండి గొప్ప సంరంభంతో చీనిచీనాంబరాలను ధరించి, విలువైన వజ్ర వైఢూర్యాలతో చేసిన ఆభరణాలను అలంకరించుకొని, నవరత్న ఖచితమైన కిరీటాన్ని ధరించి, దేదీప్యమానంగా వెలిగిపోతూ ఆమె తిరుమలకు వచ్చింది. ఆమెతో పాటు చెలికత్తెలు, పరివారజనం పెద్ద ఎత్తున వచ్చారు. అలిపిరి దగ్గరకు అందరూ వచ్చారు. సామవై పట్టపుటేనుగుపైనుండి కిందకు దిగి, అడిపడి, అంటే, అలిపిరిలోని మొట్టమొదటి మెట్టును భక్తితో తాకింది. "అమ్మా! మనం ఇక్కడనుండి పల్లకిపై తిరుమలకు చేరుకోవాలి" అని ఆమెతో ఒక మంత్రి అన్నాడు. అప్పుడు రాణి సామవై అతనితో "నేను పల్లకిలో రాను. మనం తిరుమలలో ప్రతిష్ఠించడం కోసం తీసుకొని వచ్చిన భోగ శ్రీనివాసమూర్తి విగ్రహాన్ని ఈ పల్లకిలో ఉంచండి. నేను కూడా పల్లకి మోస్తూ కొండను ఎక్కి వస్తాను" అని అన్నది.

ఆమె ఆజ్ఞానుసారం పల్లకిలో భోగ శ్రీనివాసమూర్తి వెండి విగ్రహాన్ని పడుకోపెట్టారు. ముందు పల్లవరాణి సామవై ఆ పల్లకిని మోస్తూ ఉండగా, మిగిలినవారు తాము కూడా పల్లకి మోస్తూ, ఆమెతో వెళ్లారు. ఆమె పనివారు కూడా కొండను ఎక్కి వచ్చింది. "అమ్మా! ఇది చిట్టెక్కుడు ఇది పెద్దెక్కుడు. ఇది సువాసనలు వెదజల్లే కర్పూర కాలువ. ఇది ముగ్గు బాగుంది ఇది అప్పాచారి కోన, ఇది మోకాళ్ళ పర్వతం ఇది వేంకటాచలం. ఇది తిరుమలేశుని ఆలయం" అని అక్కడ ఉండే విశేషాలను అన్నిటిని రాణికి చెబుతూ పరివారం అనుసరించింది.

రాణి సామవై అప్పుడు శ్రీవారికి సమర్పించిన ఆభరణాలు ఎంతో విలువైనవి. శ్రీవారి శిరస్సును అలంకరించడం కోసం తిరుముడి అని పిలువబడే కిరీటాన్ని సమర్పించింది. ఆ కిరీటంలో 23 వజ్రాలు, 16 పెద్ద ముత్యాలు, కిరీటం మధ్యలో పొదిగిన రెండు పెద్ద రూబీలు, మూడు కట్ రుబీలు ఉండేవి మెడ అలంకరణకు పైయల్ అని పిలువబడే నాలుగు వృత్తాకారంలో ఉండే కంఠాభరణాలను, నాలుగు పోగుల మాలను సమర్పించింది ఈ మాలలో 14 వజ్రాలు, మూడు రూబీలు, 11 ముత్యాలు, ఎన్నో చిన్న రకం ఎరుపు ముత్యాలు పొదగబడి ఉన్నాయి. శ్రీవారి చెవుల అలంకరణకు మకరాకారంలో ఉండే రెండు ఆభరణాలను, ఉదరాలంకరణకు ఒక బంగారుతో చేయబడిన ఉదర బంధాన్ని సమర్పించింది. తివారి పట్టిక అని పిలువబడే మొలతాడును బహూకరించింది ఇందులో నాలుగు రూబీలు పొదగబడి ఉండేవి చేతులకు బాహువలయం అనబడే రెండు వలయాకారంలో ఉండే

ఆభరణాలను బహూకరించింది. చేతి మణికట్టు అలంకరణకు తిరుచ్చందం అనబడే నాలుగు ఆభరణాలను సమర్పించింది. వీటిలో రెండు కట్రూబీల వంతున పొదగబడి ఉండేవి. కాలి మడమ అలంకరణకు కట్టై అని పిలువబడే రెండు ఘనమైన ఆభరణాలను ఇచ్చింది. వీటిలో ఎంతో విలువైన రాళ్లు, వజ్రాలు 52 మణులు పొదగబడ్డాయి. ఇవే కాకుండా, ఇంకో రెండు ఆభరణాలను కూడా కాలి మడమ అలంకరణ కోసం సమర్పించింది. ఈ ఆభరణాలను అన్నిటిని తయారు చేయడానికి 47 కలంజుల బంగారాన్ని వాడడం జరిగింది. శ్రీనివాసునకు అభిషేకం జరిపించి, ఈ నగలను క్రీస్తు శకం 614 వ సంవత్సరంలో పల్లవ రాణి సామవై సమర్పించింది.

ఇంతే కాకుండా, సామవై శ్రీ వేంకటేశ్వర స్వామికి అనేక విలువైన భూములను సమర్పించింది. చరిత్రలో చిరస్థాయిగా నిలచి పోయింది తిరుచానూరులో తిరుమల తిరుపతి ఆలయాలను నిర్వహించే సభైయార్ దగ్గర నుండి కొన్ని భూములను, ఆ విధంగానే తిరుచానూరు ఆలయానికి సంబంధించిన కొన్ని భూములను రాణి సామవై డబ్బులను చెల్లించి కొన్నది. ఆ తరువాత సభైయార్ ద్వారా ఆ భూములకు పన్నుల మినహాయింపు పొందిన తరువాత, వాటిని తిరుమల వేంకటేశ్వర స్వామికి సామవై సమర్పించింది. తిరుమల శ్రీవారికి ఆర్థికపుష్టి, ప్రతిష్ఠ పెరగడం కోసం రాణి సామవై అనేక శాశ్వతమైన ఏర్పాట్లను చేసింది. శ్రీవారి నిత్యానుగ్రహం కోసం నిత్యనిముడం ప్రవేశపెట్టింది అందులో భాగంగా తిరువాముడు అని పిలవబడే భాగంగా నాలుగు అన్నప్రసాద

నైవేద్యాలు నిత్యం జరిగేటట్లు మొట్టమొదటగా ఏర్పాటు చేసింది. ఆలయంలో నిర్విఘ్నంగా వెలిగించబడే నందా విళక్కు దీపాన్ని ఏర్పాటు చేసింది. తిరుమంజనం అని సంప్రదాయంలో పిలువబడే అభిషేక కార్యక్రమాన్ని ఏర్పాటు చేసింది ఈ తిరుమంజనాన్ని రెండు అయన సంక్రాంతులు, రెండు విషువత్తులు సమయాలలో జరిపేటట్లు ఏర్పాటు చేసింది ఆ విధంగానే, పురట్టాసి మాసంలో జరిగే ఉత్సవ కార్యక్రమాలను కూడా ప్రవేశపెట్టింది. ఈ ఉత్సవాలే తరువాత బ్రహ్మోత్సవాలుగా మారాయి.

ద్వాదశకి ముందు రెండు రోజులు రెండు పూటలా ఉత్సవ కార్యక్రమాలను జరిపి, ఆ తరువాత ఏడు రోజులు, లేదా, తొమ్మిది రోజులు ప్రధాన పురట్టాసి బ్రహ్మోత్సవాలు జరిపేటట్లు ఏర్పాటు చేసింది. ధ్వజారోహణలో ధ్వజస్తంభానికి గరుడ పతాకాన్ని ఆవిష్కరణ జరిగేటట్లు చేసింది. ఆ విధంగానే, నవధాన్యాలతో అంకురారోపణ కార్యక్రమంతో పురట్టాసి ఉత్సవ కార్యక్రమం ఆరంభం అయ్యేటట్లు కూడా ఏర్పాటు చేసింది.

పల్లవ రాణి సామవై గురించి ఎంత చెప్పినాప్పటికీ తక్కువే. ఆమె హయాంలోనే తిరుమల వేంకటేశ్వర స్వామి ఆలయం ఆర్థికమైన పుష్టిని కలిగినదిగా పేరుపొందింది. అందుకు కారణం పల్లవ రాణి సామవై ఆనాడు శ్రీవారికి సమర్పించిన తొలి భూదానాలు, ఎంతో విలువైన సొమ్ములే. అంతేకాదు సామవై చేపట్టిన తొలి బ్రహ్మోత్సవం, తొలి అంకురార్పణ, తొలి గరుడోత్సవం, అంటే, ధ్వజారోహణం, తొలి ఆర్భాట మెరవణాలు, అంటే

ఊరేగింపులు, పూజలు, తొలి నిత్యప్రసాద నైవేద్యాలు, తొలి వెండి భోగ శ్రీనివాసమూర్తి ప్రతిమ ప్రతిష్ఠాపన, తొలి శాసనం ఆలయంలో చెక్కించడం, తొలి మండప నిర్మాణం, తిరువిలాన్ కోయిల్ అనబడే స్నపన మంటపాల నిర్మాణం వంటి కార్యక్రమాలు తిరుమలేశుని ప్రతిష్ఠను ఇనుమడింప చేశాయి అంతే కాదు, సామవై తరువాత చోళ, పాండ్య, యాదవ విజయనగర పాలకులు, ఇంకా ఇతరుల కాలాలలో ఇవ్వబడిన అనేక దానాలు ఆలయానికి ఆర్థిక పుష్టిని, ప్రతిష్టను ఇంకా ఇంకా పెంచాయి. అందుకే తిరుమల ఆలయంలోని సంపదను దోచుకోవడం కోసం 15వ శతాబ్దంలో 1443 వ సంవత్సరంలో పోర్చుగీసువారు పెద్ద సంఖ్యలో వచ్చారు. గోవానుండి సముద్రమార్గం ద్వారా వచ్చారు. అయితే, ప్రకృతి వైపరీత్యాల కారణంగా మద్రాసు ప్రాంతంనుండే వారు తిరుగు ముఖాన్ని పట్టారు.

పల్లవ రాణి సామవైకు మరొక పేరు కూడా ఉన్నది. ఆమెను కడవన్ పెరుందేవి అని కూడా అంటారు. తిరుమలలో నిన్న మొన్నటివరకు పెరుందేవి తోటగా పిలువబడే ప్రాంతం ఒకటి ఉండేది. కానీ, అది ఈనాడు కనుమరుగైపోయింది ఈ తోట వరాహ స్వామికి ఉత్తరంగా పాపవినాశ తీర్థం కాలినడకదారి పక్కన ఉండేది. నీటి కొలను పక్కన పెద్ద పూలతోట. గోచి కట్టుకొని ఉండే ఉత్తరభారతదేశానికి చెందిన ఒక బైరాగి దానిని రక్షించేవాడు. చుట్టూ నీళ్ల కందకంమధ్యలో ఆ తోట అంతటా ఎల్లప్పుడూ పూల మొక్కలతో కళకళలాడుతూ ఉండేది. కానీ,

ఆ తోట ఇప్పుడు కాలగర్భంలో కలిసిపోయింది కాంక్రీట్ తోట అయింది అక్కడ అనేక సిమెంటు కట్టడాలు వెలిశాయి.

రాణి సామవైకు తిరుమల చరిత్రలోనే కాదు, ప్రపంచ చరిత్రలోనే ఇంత పేరు రావడానికి గల కారణం ఆమె తిరుమల శ్రీవారికి సమర్పించిన కానుకలు కావు, భోగ శ్రీనివాసమూర్తి అని పిలువబడే మణవాళ ప్పెరుమాళ్ విగ్రహం కాదు. మరి ఏమి కారణం? అంటే, శాసనంలో ఆమె వాడిన మాటలే. అవి నిజంగా ఇంతవరకు ఎవరూ చెప్పనివి. ఆమె ఈ శాసనం ద్వారా ఎంతో ప్రేమమూర్తి అని, భక్తి మూర్తీభవించినది అని తెలుస్తుంది. అటువంటి ఆమె సుమారు 1500 సంవత్సరాలకు ముందు ఆచంద్రతారార్కంగా వ్రాయించిన శిలాశాసనంలో ఏమని అన్నదంటే, " నేను సమర్పించిన దానాలను రక్షించి కాపాడేవారి పాదాలు నాకు శిరోధార్యాలు. శ్రీవైష్ణవులు రక్షించబడుదురు గాక. " అని శాసనంలో పేర్కొన్నది. ఇటువంటి వాక్యాలు ప్రపంచ దేశాలలో ఉండే ఏ శాసనంలోనూ మనకు కనిపించవు. అందువల్లనే రాణి సామవై తిరుమలలో వ్రాయించిన శాసనం అంతటి ప్రపంచ ప్రాధాన్యాన్ని పొందింది.

పల్లవ రాణి తిరుమల శ్రీవారిని సందర్శించిన దినాలలో తిరుమలేశుని అనేక పేర్లతో పిలిచేవారు. ఈమె తిరుమలేశుని శ శ్రీనివాసమూర్తిగా భావించింది అందుకే, ఆమె శ్రీవారి ఆలయ గర్భగుడిలో భోగ శ్రీనివాసమూర్తి వెండి విగ్రహాన్ని నెలకొల్పింది అప్పటినుండి తిరుమలేశుడు శ్రీనివాసునిగా బాగా ప్రచారంలోకి, వ్యవహారంలోకి వచ్చాడు. అంతవరకు తిరుమల శ్రీవారిని జైనుడని, బుద్ధుడని, శక్తి అని,

కుమారస్వామి అని, శివుడని అనేకులు అనేక విధాలుగా భావించేవారు. విచిత్రమేమంటే, ఇప్పటికీ కొంతమంది తిరుమలేశుని పేరువిధంగా భావించడమే. కానీ, అప్పటికి ఇప్పటికీ పోలిస్తే, ఇలా భావిస్తున్నవారి సంఖ్య బాగా తగ్గిపోయిందనే చెప్పాలి.

మరో విశేషం ఏమంటే, సామపై పల్లవరాణి అయినప్పటికీ, ఆమె స్వచ్ఛమైన తెలుగింటి ఆడపడుచు, అంటే, ఆమె 16 అణాల తెలుగు వనిత. సామపై అనే పేరుకు అర్థం ఏమంటే, సామ అంటే సామవేదమని, పై అంటే పదును అయినది అని అర్థం. అంటే సామవేదంలాంటి పదునైనది– అని అర్థం– అని అంటారు. అంతేకాకుండా, శాంతమైనది అని, సౌమ్యమైనది అని కూడా అర్థమని చెబుతారు రాణి సామపై ఒక సామంత దేశానికి రాణి అయినప్పటికీ, ఒక పెద్ద సామ్రాజ్యానికి రాణివలె తిరుమల శ్రీనివాసప్రభవుకు అనేక దానాలను చేసింది. తాను చిన్న రాణి అయినప్పటికీ, పెద్దపెద్ద మహారాణులు చేయని, చేయలేని సేవలను ఎన్నిటినో చేసింది. సామపై తాను కోరుకున్న సేవలన్నీ సూర్యచంద్రులు ఉన్నంతకాలం శ్రీవారికి జరిపించాలని కోరుకున్నది. సామపై కోరుకున్న విధంగానే ఈనాడు అన్ని సేవలు స్వామివారికి ఉన్నాయి. సామపై ఏర్పాటు చేసిన సేవలే కాదు, ఆమె కూడా సూర్యచంద్రులు ఉన్నంతకాలం తిరుమల చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోతుంది తిరుమల శ్రీనివాసునిలో ఐక్యమైన ఆమె ఆత్మ అంతర్లీనంగా తిరుమలలోనే ఉంటూ, శ్రీవారి జరిగే సేవలను చూస్తూ, ఆనందిస్తూ ఉంటుంది– అని అనడంలో సందేహం లేదు.

## ఉత్తర రామాయణం నిజమా? లేక, కల్పితమా?

శ్రీరామాయణం. మనకందరకు బాగా తెలిసిన కథ. కానీ, ఉత్తర రామాయణం. మనకు చాలామందికి తెలియని కథ. ఉత్తర రామాయణాన్ని గూర్చి మనలో చాలామందికి ఎన్నో విధాలైన వ్యక్తిగతాభిప్రాయాలు, అవగాహనలు, వాదాలు, వాదోపవాదాలు ఉన్నాయి. వీటి అన్నిటి మధ్య ఉత్తర రామాయణం అసలు సత్యం ఏమిటి? ఉత్తర రామాయణం అసలు జరిగిందా? నిజమేనా? లేక, కల్పిత గథా? ఒకవేళ జరిగి ఉంటే, దానిని వాల్మీకే రచించాడా? లేక, ప్రక్షిప్తమా? అని ఈ విధంగా ఎన్నో ప్రశ్నలు ఉన్నాయి. సుమారు ఒక సంవత్సరం పాటు పరిశోధన చేసి కేవలం అధికారికమైనటువంటి, ప్రామాణికమైనటువంటి నిజాలను మాత్రమే, ప్రామాణికమైనటువంటి నిజాలను మాత్రమే ఈ వ్యాసంలో ప్రస్తావించడం జరుగుతున్నది. ఉత్తర రామాయణాన్ని గూర్చి ఒక సమగ్రమైన, అధికారికమైన, ప్రామాణికమైన ఈ వ్యాసంలో "ఉత్తర రామాయణం నిజమా? లేక కల్పితమా? "అనే విషయం విచారించడం జరుగుతున్నది.

ప్రస్తుతం మన ముందు ఉన్నటువంటి ప్రధానమైన ప్రశ్న ఒకటే. ఉత్తర రామాయణం వాస్తవమేనా? లేక కల్పితమా? రామాయణం గురించి మనకు సమగ్రమైన అవగాహన రావాలంటే మనం నాలుగు విధాలైన అంశాలను విచారించవలసి ఉన్నది. అవే ఈ వ్యాసంలో ప్రస్తావించడం జరుగుతున్నది.

అందులో మొట్టమొదటి అంశం, బ్యాక్గ్రౌండ్ అండ్ కాంటెక్స్ట్ అఫ్ ఉత్తర రామాయణ. ఉత్తర రామాయణం అంటే ఏమిటి? అన్నది. దీనిని ముందు మనం తెలుసుకోవాలి. తర్వాత, చాప్టర్ నెంబర్ రెండ స్ట్రక్చర్ అండ్ స్టోరీ లైన్ ఆఫ్ శ్రీరామాయణమ్. ఉత్తర రామాయణం గురించి మనకు నిజానిజాలు తెలియాలంటే, ఒక విశ్లేషణాత్మకమైన దృష్టి కోణంతో, అంటే, ఒక ఎనలిటికల్ పరెక్సెసపెక్టివ్ తో చూచినపుడుమాత్రమే మనకు ఉత్తరామాయణం గురించి నిజా నిజాలు తెలుస్తాయి. అవి రెండవ చాప్టర్ లో చూద్దాం. ఇక మూడవ విషయం, ఏ క్రిటికల్ ఎనాలిసిస్ ఆన్ ఉత్తర రామాయణమ్. ఉత్తర రామాయణం గురించి ఒక విశ్లేషణాత్మకమైనటువంటి, మరియు పరిశోధనాత్మకమైనటువంటి దృష్టి కోణంతో ఉత్తర రామాయణం నిజమా? లేక, కల్పితమా? ప్రక్షిప్తమా? లేక, వాల్మీకి మహర్షి రచించినదా? ఈ ప్రశ్నలన్నిటినీ కూడా ఎంతో లోతుగా ఈ మూడవ చాప్టర్లో మనం చూద్దాం. ఆఖరిదీ నాల్గవది, కంక్లూషన్. ఉత్తర రామాయణం నిజమా? లేక, కల్పితమా? అన్న ఈ ప్రశ్నకు అసలు సమాధానం ఏమిటి? అన్న విషయాన్ని ఈ నాలుగవ చాప్టర్లో చూద్దాం.

ఉత్తర రామాయణం గురించి నిజానిజాలు మనకు తెలియాలంటే, అన్నింటికంటే ముఖ్యంగా, మనం ఒక నాస్తిక దృష్టి కోణంతో శ్రీరామాయణాన్ని పరిశీలించినప్పుడు మాత్రమే మనకు నిజం ఏమిటి? అనేది మనకు అర్థమవుతుంది. ఎందుకు? అని ఆశ్చర్యపోతున్నారా? కారణం చెబుతాను, వినండి. ఒక విషయాన్ని గురించి మనకు నిజానిజాలు తెలియాలంటే, ఒక తార్కికమైన దృష్టి కోణంతో, అంటే,

క్రిటికల్ అండ్ ఎనలిటికల్ పెరెక్స్పెక్టివ్ తో మనం పరిశోధించినప్పుడు మాత్రమే నిజం అంటే ఏమిటో తెలుస్తుంది. అయితే, భావోద్వేగం ఉన్నచోట తర్కం పనిచేయదు. భావోద్వేగం, తర్కం, లాజిక్ అండ్ ఎమోషన్ అనేవి రెండూ కలసి ఎప్పుడూ పనిచేయవు. భక్తి అనే ఎమోషన్ మనలను డామినేట్ చేసినప్పుడు, నిజానిజాలు ఏమిటి? అనే సంగతిని మనం తెలుసుకోవడం చాలా కష్టం. కాబట్టి, ఇకమీదట ఈ వ్యాసంలో శ్రీరామాయణం గురించి ఎటువంటి పక్షపాతం లేకుండా, ఎటువంటి భావోద్వేగం లేకుండా, కేవలం ఒక నాస్తిక దృష్టి కోణంతో మాత్రమే శ్రీరామాయణంలోని విషయాలను పరీక్షించి చూద్దాం. ఎందుకంటే, అప్పుడు మాత్రమే మనకు నిజానిజాలు తెలుస్తాయి. మళ్ళీ చెప్తున్నాను. భావోద్వేగం ఉన్నచోట తర్కం పని చేయదు. తార్కికంగా ఆలోచిస్తే తప్ప, నిజం ఏమిటో మనకు తెలియదు.

నాలుగింటిలో, మొట్టమొదటి చాప్టర్– బ్యాక్ గ్రౌండ్ అండ్ కాంటెక్స్ట్ అఫ్ ఉత్తర రామాయణం. ఉత్తరరామాయణం అంటే ఏమి?

ఉత్తర రామాయణం అంటే ఏమిటి? అది నిజమా? లేక, కల్పితమా? అన్న ప్రశ్నకు వెళ్లే ముందు, ఒక నాస్తిక దృష్టి కోణంలో చూసినప్పుడు, ముందుగా మనల్ని మనం అడగవలసిన ప్రశ్న ఏమంటే, అసలు శ్రీరామాయణం నిజమా? లేక, కల్పితమా? శ్రీరామాయణం నిజంగా జరిగిందా? లేక, ఒక కాల్పనికమైనటువంటి రచనా? ఇదే మొట్టమొదట మనందరం తప్పకుండా మనల్ని మనం అడగవలసిన ప్రశ్న. ఒక్కసారి చూడండి. ఇది మన కంప్లీట్ వేదిక్ ఎడ్యుకేషన్ సిస్టం.

ఒక్క ఫ్రేమ్లో చూపించాలంటే, ఇలా ఉంటుంది. నాలుగు వేదాలు, 108 పైగా ఉపనిషత్తులు, ఆరు వేదంగాలు, నాలుగు ఉపవేదాలు –అనే ఇదంతా కలిపి వేద విద్య. వీటిలో కొన్ని వేల కొద్ది గ్రంథాలు. వీటన్నింటిలోనూ కొన్ని వేల కొద్దీ కథలు. అంతే కాదు, 18 పురాణాలు 18 ఉపపురాణాలు, 18 స్మృతులు, 213 ఆగమాలు, కొన్ని వేల కొద్ది సిద్ధాంతాలు. ఇవన్నీ కలిపితే, కొన్ని వేల, లేదా, లక్షల కథలు మనకు ఖచ్చితంగా దొరుకుతాయి. అయితే, ఇన్ని కథలు, ఇన్ని వందల వేల సంవత్సరాలుగా ఉన్నప్పటికీ, ఒకే ఒక్క కథ, శ్రీ రామాయణం అనే ఒకే ఒక్క కథ, భారత దేశంలో నాలుగు మూలలా, కేవలం భారతదేశంలోనే కాదు, మాయన్మార్, థాయిలాండ్, ఇండోనేషియా అని ఈ విధంగా సౌత్ ఈస్ట్ ఏషియా దేశాలన్నిటిలోనూకూడా ఈ శ్రీరామాయణ అనే ఈ కథను కొన్ని వందల వేల సంవత్సరాలుగా ప్రజలు ఎంతో ఆరాధిస్తూ వస్తున్నారు. ఒక నాస్తిక దృష్టి కోణంలో మనం అడగవలసిన ప్రశ్న ఏమంటే, ఇన్ని లక్షల కొద్ది, వేలకొద్దీ కథలు ఉన్నప్పుడు, కేవలం ఈ ఒక్క కథను మాత్రమే ఎందుకు ఇన్ని వందల వేల సంవత్సరాలుగా, ప్రజలు ఆరాధిస్తూ వస్తున్నారు? ఈ ప్రశ్నకు సమాధానం వెతికే దారిలో శ్రీరామాయణం అసలు నిజమా? లేక, కల్పితమా? అనే ప్రశ్నకు సరైన సమాధానం దొరుకుతుంది. ఎవరికైనా శ్రీరామాయణం నిజమా? లేక, కల్పితమా? అన్న ప్రశ్న వచ్చినప్పుడు, అన్నిటికంటే అతి ముఖ్యమైన ప్రశ్న ఇది. అసలు రామాయణాన్ని కొన్ని వందల వేల సంవత్సరాలుగా, కేవలం ఈ ఒక్క కథను మాత్రమే, ప్రజలు ఎందుకు ఆరాధిస్తూ

వస్తున్నారు? అన్న ఈ విషయాన్ని తార్కికంగా, విశ్లేషణాత్మకంగా ఆలోచించిన రోజున, అసలు శ్రీరామాయణం నిజమా? లేక, కల్పితమా? అన్న ప్రశ్నకు సమాధానం దొరుకుతుంది. సరే. మన అసలు విషయం ఉత్తర రామాయణం కాబట్టి, ఫర్ ద సేక్ అఫ్ కంప్లీట్ నెస్, ఇక్కడితో శ్రీరామాయణం గురించిన ఈ చిన్న విషయాన్ని లేదా ఈ చిన్న ప్రశ్న ను ముగించి, ముందుకు వెళదాం.

ఎన్నో భాషల్లో, ఎంతోమంది, ఎన్నో విధాలుగా, ఎన్నో భావనలతో శ్రీరామాయణాన్ని అనువదించారు. కానీ, అసలు శ్రీరామాయణాన్ని రచించింది వాల్మీకి మహర్షి. ఈ విషయం మనకందరకు తెలిసిన విషయమే. అయినా, దీనిని నేను ఇక్కడ ఎందుకు చెబుతున్నానంటే, శ్రీరామాయణాన్ని మనం విశ్లేషణాత్మకమైనటువంటి, లేదా, చారిత్రాత్మకమైనటువంటి దృష్టి కోణంతో పరిశీలించాలనుకున్నప్పుడు, కేవలం శ్రీవాల్మీకి మహర్షి రచించినటువంటి శ్రీరామాయణాన్ని మాత్రమే మనం పరిగణలోకి తీసుకోవాలి. అలా వాల్మీకి మహర్షి రచించిన శ్రీరామాయణాన్ని మనం చదివినప్పుడు, మనం ఎన్ని విధాలుగా శ్రీరామాయణాన్ని అపార్థం చేసుకున్నాం? ఎన్ని విధాలుగా మనం శ్రీరామాయణం గురించి తప్పుగా అర్థం చేసుకున్నాం? అన్న విషయాలు ఒక్కొక్కటిగా బయటపడతాయి.

ఇక్కడ ఇవి కొన్ని ఉదాహరణలు. మొట్టమొదటిది– అహల్యా శాపవిమోచనం. మనందరికీ తెలిసిన కథ ఏమంటే, అహల్య శాపవశాత్తు ఒక రాయి రూపంలో అడవిలో ఉన్నప్పుడు, శ్రీరాముడి పాదాలు తగిలి,

ఆ రాయి అహల్యగా, ఒక స్త్రీగా మారి, రాముడి పాదాలకు నమస్కారం చేసింది. కానీ, వాల్మీకి మహర్షి శ్రీరామాయణం ప్రకారం, ఇదంతా కూడా తప్పు. వాల్మీకి మహర్షి రచించిన శ్రీరామాయణం బాలకాండలో 49వ సర్గ. ఇక్కడ అహల్య శాప విమోచనం అనే ఘట్టం గురించి వాల్మీకి మహర్షి తెలియజేసినది ఏమంటే, వాల్మీకి మహర్షి ప్రకారం, అహల్య ధూళి రూపంలో గౌతమ మహర్షి ఆశ్రమ పరిసర ప్రాంతాల్లో శ్రీరాముడి రాక కోసం, తన శాప విమోచనం కోసం, ఎదురుచూస్తూ ఉంటుంది. శ్రీరాముడు ఆశ్రమ పరిసరాల్లోకి రాగానే, అహల్య శాప విమోచనమై, ఒక స్త్రీ స్వరూపంలో అహల్యాదేవి ప్రత్యక్షమైనప్పుడు, శ్రీరాముడు, లక్ష్మణుడు వెళ్లి అహల్యాదేవి పాదాలను పట్టుకుని, నమస్కరిస్తారు. మనం సినిమాల్లో నువ్వు లేదంటే, మరి ఎక్కడో చూసినట్టుగా అహల్యాదేవి రాముడి పాదాలకు నమస్కరించదు. రామలక్ష్మణులే తమ తల్లి వయస్సుతో సమానంగా ఉన్నటువంటి అహల్యాదేవి పాదాలను పట్టుకొని నమస్కరిస్తారు. తల్లి బిడ్డలను ఏ విధంగా అయితే చేరదీస్తుందో, అదేవిధంగా, అహల్యాదేవి రామలక్ష్మణులను చేరదీస్తుంది. అయితే, ఇక్కడ అతి ముఖ్యమైన విషయం ఏమంటే, చెప్పాను కదా, భావోద్వేగం ఉన్నచోట తర్కం పనిచేయదు. అత్యంత రామభక్తి ఉండడం మంచిదే. అది వ్యక్తిగతం. అది తప్పు అని నేను అనడం లేదు. కానీ, భావోద్వేగంతో అసలు రామాయణంలో ఉండే మంచి విషయాలను, అంటే, రాముడు ఎటువంటి సంస్కారాలు కలిగినటువంటి మనిషి, తన తల్లి వయసు స్త్రీ తన ఎదురుగా ఉన్నప్పుడు, ఆయన ఏ విధంగా ఆమె పాదాలకు ఏ

విధంగా నమస్కరించాడు? అనే మంచి విషయాన్ని మరుగుపరచి, "రామపాదం తగలగానే అహల్య మనిషి అయింది" అన్న ఒక భక్తి అనే భావనను మాత్రమే పైకి తెచ్చారు. అది మంచా,? చెడా? అన్నది పక్కన పెడితే, రాముడి యొక్క సుగుణాలు ఏవైతే రామాయణం మనకు చెబుదామనుకుంటుందో, అవన్నీ కూడా భక్తి అన్న ఈ ఎమోషన్ తొక్కి పెట్టేసింది. దానికి ఉదాహరణే రాముడు అహల్య పాదాలకు నమస్కరించాడు– అన్న విషయం మనలో చాలామందికి తెలియకపోవడం. ఇందుకే నేను చెప్పాను తార్కికంగా ఆలోచించాలనుకున్నప్పుడు, భావోద్వేగాన్ని పక్కన పెట్టాలి.

అలాగే, రెండవ ఉదాహరణ. రావణాసురుడు సీతాదేవి స్వయంవరానికి రావడం. ఇది కూడా వాల్మీకి మహర్షి శ్రీరామాయణం ప్రకారం తప్పు. సీతాదేవి స్వయంవరంలో రావణాసురుడు అసలు ఎక్కడా ఉండడు. అంతేకాదు, మనందరకూ తెలిసిన సీతారాముల కళ్యాణం, అంటే, రాముడు విల్లును విరగ్గొట్టగానే సీతాదేవి వచ్చి దండ వేసి, అక్కడి నుండి వాళ్ళ వివాహం జరగడం. ఇదంతా కూడా వాల్మీకి మహర్షి శ్రీరామాయణంలో ప్రకారం తప్పు. బాలకాండ 66 నుండి 73 సర్గల వరకు, వాల్మీకి మహర్షి అసలు సీతారాముల కళ్యాణం ఏ విధంగా జరిగింది? అన్నది వివరించారు. వాల్మీకి మహర్షి రచించిన సీతారాముల కళ్యాణాన్ని మనం చదివినప్పుడు, మనకు చెప్పలేనంత ఆశ్చర్యం కలుగుతుంది. ఉదాహరణకు, సీతారాముల కళ్యాణం సమయానికి సీతాదేవి వయస్సు ఆరు సంవత్సరాలు. రాముని వయస్సు 13 సంవత్సరాలు.

అరణ్యకాండలోని 47వ సర్గ చదివితే, ఈ విషయం మనకే అర్థమవుతుంది. సీతాదేవి తనంతట తాను రావణాసురుడికి చెబుతుంది. తన కల్యాణం సమయానికి తన వయస్సు 6 సంవత్సరాలు. తన భర్త అయిన రాముడి వయస్సు 13 సంవత్సరాలు– అని చెబుతుంది.

ఇలా చెప్పుకుంటూ పోతే, లక్ష్మణ రేఖ, వాల్మీకి మహర్షి శ్రీరామాయణంలో లేదు. శబరి, కొరికిన ఎంగిలి పండ్లను శ్రీరాముడికి ఇవ్వలేదు. ఉడత రాముడికి రామసేతు నిర్మాణంలో సహాయం చేయలేదు. అన్నిటికంటే ముఖ్యమైన విషయం, మనం తప్పుగా అర్థం చేసుకున్నది. సీతాదేవికి అగ్ని పరీక్ష జరగలేదు. అసలు ఏం జరిగిందో తర్వాత ఇదే వ్యాసంలో చూద్దాం. ఈ విధంగా ఎన్నో ఎన్నో విషయాలు శ్రీరామాయణం గురించి మనందరం తప్పుగా అర్థం చేసుకున్నాం. అసలు ఇవన్నీ ఎందుకు చెప్తున్నాను అంటే, ఉత్తర రామాయణం నిజమా? లేక, కల్పితమా? అన్న ప్రశ్నకు వెళ్లే ముందు, అసలు ప్రప్రథమంగా శ్రీరామాయణాన్ని సరైన పద్ధతిలో మనం అర్థం చేసుకున్నామా? లేదా? అన్నది ఎంతో ముఖ్యం.

ఇక్కడ నుండి ఈ వ్యాసాన్ని చాలా జాగ్రత్తగా, విచక్షణాత్మకంగా మరియు, విశ్లేషణాత్మకంగా చూడండి. అంటే, ఇక్కడనుండి లాజికల్ గా, ఎనలిటికల్ గా చూడండి. అసలు ఉత్తర రామాయణం అంటే ఏంటి? మనలో చాలామందికి తెలుసు. రామాయణం ఆరుకాండలు. బాలకాండ, అయోధ్యాకాండ, అరణ్యకాండ, కిష్కిందాకాండ, సుందరకాండ, మరియు

యుద్ధకాండ. ఆరవది అయిన యుద్ధకాండ చివరిలో రాముడు రావణాసురుని సంహరించడం, శ్రీ సీతారామ పట్టాభిషేకం జరగడం. ఇక్కడితో కథ ముగుస్తుంది. కానీ, రాముడు రాజు అయిన తరువాత జరిగిన కథ ఏంటి? అనేది చెప్పేదే ఉత్తరకాండ. అయితే, ఉత్తర రామాయణాన్ని గూర్చి ఎన్నో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. ఉదాహరణకు, మీరు ఎంతో మంది పెద్దలు శ్రీరామాయణాన్ని గూర్చి చేసిన ప్రసంగాలు ఉన్నాయి. వాటిని వింటే, వాళ్ళ ప్రసంగాలు కేవలం యుద్ధకాండతో ముగిసిపోతాయి. ఉత్తరకాండను సహజంగా ఎవరూ పారాయణం చేయరు. పెద్దగా ఎవరు ఉత్తరకాండను ప్రస్తావించరు. అలానే, చాలామంది ప్రక్షిప్తం అని కొట్టి పారేస్తారు. ఇది ఎందుకు అంటే, ముఖ్యంగా మూడు కారణాలు ఉన్నాయి. మొదటిది, సీతాపరిత్యాగం. శ్రీరాముడు మూడు సీతాదేవిని అడవులకు పంపడం. రెండవది, లక్ష్మణుడి మరణానికి శ్రీరాముడు కారణం కావడం. మూడవది, తపస్సు చేసుకుంటున్న శంబూకుడనే శూద్రుని శ్రీరాముడు సంహరించడం. ఈ మూడు సందర్భాలు కొంచెం క్లిష్టంగాను, అంతేకాకుండా శ్రీరాముడు వ్యక్తిత్వాన్ని తక్కువ చేసి తప్పుగా చూపించే విధంగానూ ఉంటాయి. ఇందుకుగాను ఉత్తరరామాయణాన్ని చాలామంది ప్రక్షిప్తం అని కొట్టి పారేస్తారు. చెప్పాను కదా. భావోద్వేగం ఉన్నచోట తర్కం పనిచేయదు. ఈ మూడు సందర్భాలలో, నిజంగా రాముడు తప్పు చేశాడా? లేక, మనం తప్పుగా అర్థం చేసుకున్నామా? అన్న విషయాలను ఈ వ్యాసంలో క్రమంగా చూద్దాం.

శ్రీరాముడి మీద ఎటువంటి పక్షపాతం లేకుండా, ఉత్తరకాండను మనం చదివిన రోజున మాత్రమే మనకు ఉత్తరకాండ నిజమా? లేక, కల్పితమా? అన్న విషయం అర్థం అవుతుంది.

ఇప్పటివరకు చాప్టర్ నెంబర్ వన్ లో ఉత్తర రామాయణం గురించి బ్యాగ్రౌండ్ అండ్డ్ కాంటెక్స్ట్ ను చూసాం కదా. ఈ సందర్భంలో, అసలు ఉత్తర రామాయణంలో ఉన్నది ఏమిటి? అది నిజమా? కల్పితమా? అన్నది తరువాత. అసలు ఉత్తర రామాయణంలో చెప్పబడిన కథ ఏంటి? అనేది చూద్దాం.

శ్రీరామాయణం స్టోరీ లైన్ మనం బాలకాండ నుండి ప్రారంభం చేస్తే, బాలకాండలో రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు ఏ విధంగా జన్మించారు? వాళ్లు ఏ విధంగా విద్యాభ్యాసం చేశారు? ఆ విధంగానే, సీతారాముల కళ్యాణం ఎలా జరిగింది అనే విషయాలు బాలకాండలో చెప్పబడ్డాయి. అలాగే, రెండవది అయిన అయోధ్యాకాండలో, సీతా రామలక్ష్మణులు ఎటువంటి పరిస్థితుల్లో వనవాసానికి వెళ్లవలసి వచ్చింది? అన్న ఘట్టాలన్నీ కూడా వర్ణించబడ్డాయి. అలానే, మూడవది అయిన అరణ్యకాండలో, రామ లక్ష్మణులు ఏ విధంగా వనవాసంలో ఖరదూషణాదులవంటి రాక్షసులను సంహరించారు? శూర్పణఖ ఏ విధంగా రామలక్ష్మణులపై దాడి చేసింది? అలాగే, రావణాసురుడు ఏ విధంగా సీతాదేవిని అపహరించాడు? అన్న ఈ విషయాలన్నీ కూడా అరణ్యకాండలో చెప్పబడ్డాయి. నాలుగవదైన కిష్కింధాకాండలో, ఏ విధంగా రామలక్ష్మణులు హనుమ సుగ్రీవులను కలిశారు? రాముడు వాలిని ఏ

విధంగా సంహరించాడు? అలానే, రామ సుగ్రీవుల స్నేహం, మరియు, వానరసేన ద్వారా సీతాన్వేషణ ప్రారంభం. ఈ విషయాలన్నీ కిష్కింధా కాండలో చెప్పబడ్డాయి. ఐదవది అయిన సుందరకాండలో, ఆంజనేయ స్వామి ఏవిధంగా సీతాదేవి కోసం సముద్రాన్ని దాటి, లంకంతా వెతకి, సీతాదేవి జాడను కనిపెట్టాడు. తిరిగివచ్చి రాముడికి సీతాదేవి యొక్క క్షేమాన్ని చెప్పడంవంటి ఈ విషయాలన్నీ కూడా సుందరకాండలో చెప్పబడ్డాయి. ఆరవది అయిన యుద్ధకాండలో, శ్రీరాముడు వానరసేనతో కలిసి రామసేతును ఏ విధంగా నిర్మించాడు? , రామ రావణ యుద్ధం, రావణ సంహారం, అలానే, సీతారామ పట్టాభిషేకం, ఈ విషయాలన్నీ యుద్ధకాండలో చెప్పబడ్డాయి.

విధంగా, ఇంతవరకు మనం ఆరు కాండల శ్రీరామాయణంలోని ఒక్కొక్క కాండలో కథ ఏ విధంగా నడిచింది? అని చూసాము కదా. ఇక్కడ నుండి, ఉత్తరకాండలో, కేవలం ఉత్తరకాండలో జరిగిన కథ యొక్క వివరం చూద్దాం. మిగిలిన ఆరుకాండలవలె ఉత్తరకాండలో కాండలో కూడా సర్గలు ఉంటాయి. సుమారుగా అవి 110 సర్గలు. ఉత్తరకాండ ప్రారంభమై, మొదటి సర్గ నుండి 34 వ సర్గ వరకు, రావణాసురుని చరిత్ర చెప్పబడింది. అంటే, 110 సర్గలు గల ఉత్తరకాండలో, సుమారుగా 30%, అంటే, 34 సర్గలు, అంటే 30%, ఉత్తరకాండ కేవలం రావణాసురుడు గురించే ఉంటుంది. తరువాత, ఉత్తరకాండలో 35, 36వ సర్గలలో, కేవలం రెండు సర్గలలో, ఆంజనేయ స్వామి యొక్క జీవిత చరిత్ర మొత్తం చెప్పబడింది. తర్వాత, ఉత్తరకాండలో 37వ సర్గ నుండి, 41 సర్గ వరకు

శ్రీరామరాజ్యం ఏ విధంగా ఉండేది? రాముని సభలో జరిగినటువంటి విశేషాలు, ఇవన్నీ చెప్పబడ్డాయి. తర్వాత 42వ సర్గ నుండి 52వ సర్గ వరకు సీతాదేవి గర్భవతి కావడం, ప్రజలు సీతాదేవి పై మోపిన నిందల వలన శ్రీరాముడు లక్ష్మణుడిని, గర్భవతిగా ఉన్న సీతాదేవిని అడవులలో వదిలేసి రమ్మని చెప్పడం, ఈ విధంగా సీతాపరిత్యాగం గురించి చెప్పబడింది. తరువాత 53 నుండి, 72వ సర్గ వరకు లవణాసురుడు అనేటువంటి ఒక రాక్షసుని రాముడి తమ్ముడైనటువంటి శత్రుఘ్నుడు ఏ విధంగా సంహరించాడు? అన్న విశేషాలు అన్నీ చెప్పబడి ఉంటాయి. తరువాత, ఉత్తరకాండలో, 73వ సర్గ నుండి 83వ సర్గ వరకు శంబూకుడు అనే శూద్రుణ్ణి రాముడు ఏ విధంగా సంహరించాడు? అనే శంబూకవధవృత్తాంతం చెప్పబడింది. తరువాత, ఉత్తరకాండలో 84వసర్గ నుండి, 94వ సర్గ వరకు శ్రీరాముడు చేసినటువంటి అశ్వమేధ యాగం యొక్క కథ మొత్తం చెప్పబడి ఉంటుంది. తరువాత, ఉత్తరకాండలో 95వ సర్గ నుండి, 99వ సర్గవరకు శ్రీరాముడు తన కుమారులైనటువంటి లవకుశులను కలుసుకోవడం, అలానే, సీతాదేవి తన అవతార పరిసమాప్తి చేయడం, ఈ విశేషాలు అన్నీ కూడా 95 నుండి 99 సర్గలవరకు ఉత్తరకాండలో చెప్పబడింది. తర్వాత, ఉత్తరకాండలో, నూరవ సర్గ నుండి, 102వ సర్గ వరకు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులయొక్క పిల్లలకు పట్టాభిషేకం చేయడం, రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల పిల్లలకు భారతదేశంలో పలు చోట్ల పలు రాజ్యాలను స్థాపించి, వాళ్లను ఆ రాజ్యాలకు రాజులుగా నియమించడం, ఈ విశేషాలన్నీ ఉత్తరకాండ

నూరవ సర్గ నుండి, 102వ సర్గ వరకు చెప్పబడింది. చివరగా, ఉత్తరకాండలో 103వ సర్గం నుండి, 111వ సర్గవరకు శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు నలుగురు కూడా వాళ్ల యొక్క అవతారాలను ఏ విధంగా సమాప్తి చేశారు? అన్న విషయాలన్నీ కూడా ఉత్తరకాండలో చెప్పబడి ఉన్నాయి. ఇది సంగ్రహంగా ఉత్తరకాండలో ఏముంది? అనే చిన్న వివరణ.

ఇక, అత్యంత ముఖ్యమైనటువంటి విషయం. అసలు, ఈ ఉత్తరకాండ అంతా కూడా నిజమా? లేక, కల్పితమా? అన్న ఆ ప్రశ్నకు సమాధానం వెతికే ప్రయత్నం చేద్దాం.

చాప్టర్ 3 క్రిటికల్ అనాలసిస్ అఫ్ ఉత్తర రామాయణం. ఉత్తర రామాయణం నిజమా? లేక, కల్పితమా? అన్న ఈ విషయాన్ని ఒక పరిశోధనాత్మకమైన విధంగా అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాం. ఉత్తరకాండ గురించి నేను చేసిన రిసోర్చ్ లోకి వెళ్లే ముందర, మరొకసారి చెప్పిన విషయమే మళ్లీ చెప్తున్నా. రాముడు సీతాదేవిని అడవులకు పంపాడు అని, శంబూకుడనే ఒక శూద్రుణ్ణి సంహరించాడని, లక్ష్మణుని యొక్క మరణానికి శ్రీరాముడు కారణమయ్యాడని, ఇలా కొన్ని అభ్యంతరకరమైనటువంటి సందర్భాలవలన ఉత్తర రామాయణాన్ని ఇట్టే కల్పితమని, ప్రక్షిప్తమని అంటూ ఉంటారు. అసలు, నిజంగా ఉత్తరకాండ చదివితే, ఈ మూడు సందర్భాలు కూడా అభ్యంతరకరంగా ఉంటాయా? లేక, అవి అర్థం చేసుకోవడంలో మన లోపం ఏమైనా ఉందా? "కేవలం నాకు అర్థం కాలేదు కాబట్టి, ఉత్తర రామాయణంలో పలానా సందర్భంలో

రాముడు ఇలా చేసి ఉండి ఉండడు. ఉత్తర రామాయణం కల్పితం, లేదా, ప్రక్షిప్తం" అనేయడం మూర్ఖత్వం అవుతుంది. , అయితే, ఎటువంటి వ్యక్తిగత అభిప్రాయాలకు చోటు లేకుండా, కేవలం అన్ డిస్ ప్యూటబుల్ ఎవిడెన్స్, అత్యంత అధికారికమైనటువంటి వాస్తవాలను ఆధారంగా చేసుకుని, ఉత్తర రామాయణం నిజమా? లేక, కల్పితమా? అన్న ఈ ప్రశ్నకు సమాధానం వెదకుదాం, రండి.

వాల్మీకి మహర్షి శ్రీరాముడి గురించి రచించినటువంటి శ్రీరామాయణం కేవలం ఆరు కాండలా? లేక, ఏడవది అయినటువంటి ఉత్తరకాండ కూడా శ్రీ వాల్మీకి మహర్షి రచించినదేనా? అన్న ఈ ప్రశ్నకు సుమారు ఒక సంవత్సరం పాటు నేను చేసినటువంటి రీసెర్చ్ లో పది అతి ముఖ్యమైన విషయాలు ఇవే. వీటిని ఒక్కొక్కటిగా చూద్దాం. అయితే, ఇందులో అతి ముఖ్యమైనటువంటిది పదవ విషయం. "ది బిగ్ ఓపెన్ సీక్రెట్". అందరికీ తెలిసినటువంటి ఒక రహస్యం. అందరికీ తెలిస్తే, అది రహస్యం ఎలా అవుతుంది? అనుకుంటున్నారా? అదే విచిత్రం. ఈ 9 విషయాలు ఒక ఎత్తు అయితే, పదవ విషయం ఒక్కటే ఒక ఎత్తు. ఈ పది విషయాలను ఒక్కొక్కటిగా చూద్దాం.

ఉత్తరకాండ గురించి చేసినటువంటి నా రీసెర్చ్ లో మొట్టమొదటి విషయం, రామాయణానికి వాల్మీకి మహర్షి పెట్టినటువంటి పేరు. " కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాః చరితం మహత్, పౌలస్త్య వధమిత్యేవం చకార చరితవ్రతః". అని. ఈ శ్లోకం బాలకాండ నాలుగవ సర్గ ఏడవ శ్లోకం. ఈ శ్లోకంలో వాల్మీకి మహర్షి శ్రీరామాయణానికి మూడు పేర్లు పెట్టారు.

మొదటిది మనందరికి తెలిసినటువంటి పేరు, రామాయణం. అంటే, ది జర్నీ ఆఫ్ రామ. రాముడు అనేటువంటి ఒక వ్యక్తి జీవిత పయనం. అది దాని అర్థం. రెండవది, "సీతయాః చరితమ్" సీత అనే పేరు కలిగిన ఒక స్త్రీ యొక్క జీవిత చరిత్ర. అది ఆ పేరుకు అర్థం. "సీతాయాః చరితమ్". మూడవది పౌలస్త్యవధం. పౌలస్త్యుడు అనే ఒక వ్యక్తి యొక్క మరణం. ఇక్కడ పౌలస్తుడు అంటే, రావణాసురుడు. పులస్త్య బ్రహ్మ యొక్క సంతానంగా వచ్చాడు కాబట్టి, రావణాసురుడికి పౌలస్త్యుడు అని కూడా ఒక పేరు. "రామాయణం, సీతాయా శ్చరితం, పౌలస్త్యవధ"– అనే ఈ మూడు పేర్లను వాల్మీకి మహర్షి ఈ గ్రంథానికి పెట్టడం జరిగింది.

వాల్మీకి మహర్షి ఈ గ్రంథానికి పెట్టినటువంటి పౌలస్త్యవధ– అనే పేరును కొంచెం లోతుగా పరిశీలిస్తే, మనకు కొన్ని ఆసక్తికరమైన విషయాలు అర్థమవుతుంది. ఏదైనా, ఒక గ్రంథానికి మనం ఏ విధంగా పేరు పెడతాం? . ఆ గ్రంథం యొక్క మూలం మొత్తం కూడా ఆ పేరులో వచ్చే విధంగా మనం ఆ గ్రంథానికి పేరును పెట్టడం జరుగుతుంది. కాబట్టి, పౌలస్త్యవధ అనే ఈ గ్రంథంలో రావణాసురుడు చిట్టచివర మరణించడంతో సరిగ్గా ఈ పేరు సరిపోతుంది. అదే చిట్టచివరి ప్రయోజనం కూడా. అందుచేత, ఆరు కాండలు కలిగినటువంటి రామాయణంలో చివరికాండ యుద్ధకాండలో పౌలస్త్యుడు మరణించడంతో పౌలస్త్యవధ అనే పేరు సరిగా సరిపోతుంది. కనుక, ఏడవదైన ఉత్తరకాండ రచించవలసిన అవసరమే లేదు. పౌలస్త్యవధ అన్న పేరు గల ఈ గ్రంథానికి చిట్ట చివర పౌలస్త్యుడు వధింపబడ్డాడు. అంతటితో ఆ కథ సుఖాంతం అయిపోయింది. అందుచేత,

ఉత్తరకాండ అనే. మరొక భాగానికి ఆస్కారమే లేదు. కాబట్టి, ఉత్తరకాండ మొత్తం ప్రక్షిప్తం, లేదా, కల్పితం. వాల్మీకి మహర్షి రచించినది కాదు. అయితే, ఇది ఒక విధమైన వాదన.

దీనికి ప్రతివాదనగా, అంటే, కౌంటర్ ఆర్గుమెంట్ గా, రామాయణంలో చదివినప్పుడు, శ్రీరాముడు రావణాసురుని సంహరించాడు –అన్న ఆ ఘట్టంలో అన్ని లోకాలలో ఉన్నటువంటి దేవతలు మనుషులు, వానరులు అందరూ ఎంతగానో సంతోషిస్తారు. రావణాసురుడు అనే ఒక రాక్షసునియొక్క మరణం ఎందుకు అంత సంతోషకారకమైంది? బాలకాండ నుండి యుద్ధకాండ వరకు, మీరు, రావణాసురుడి గురించి మాత్రమే రామాయణంలో చదివితే కనుక, సీతాదేవిని అపహరించడం, రామునితో వైరం పెట్టుకోవడం అనేవి రావణాసురుడు చేసినటువంటి అతి పెద్ద తప్పులు. ఈ రెండిటి కారణంగా రావణాసురుడు చనిపోయాడు. అయితే, రాముడికి, రావణుడికి ఏర్పడినటువంటి ఒక వ్యక్తిగత వైరంతో రావణాసురుడు అనేటువంటి ఒక వ్యక్తి చనిపోతే, అన్ని లోకాల్లో అందరూ సంతోషించవలసిన అవసరం ఏంటి? ఇది ఒక సింపుల్, లాజికల్ అండ్ కామన్ సెన్సికల్ క్వశ్చన్. అయితే, ఈ ప్రశ్నకు సమాధానం 6కాండల రామాయణంలో, బాలకాండ నుండి మొదలుకొని, యుద్ధకాండ వరకు మీరు వెతికితే కనుక, ఈ ప్రశ్నకు సమాధానం దొరకదు. ఈ ప్రశ్నకు సమాధానం కేవలం ఉత్తరకాండలో మాత్రమే ఉంటుంది. ఇంతకుముందే చెప్పడం జరిగింది కదా. ఉత్తరకాండలో కేవలం 30 శాతం కేవలం రావణాసురుడి గురించే

ఉంటుంది. మొదటి 35 సర్గలలో రావణాసురుడు అన్ని లోకాలలో అందరిని ఎంత హింసించాడు? అన్న విషయాలన్నీ కూడా రచించబడి ఉంటాయి. పౌలస్త్యవధ అని ఒక గ్రంథానికి అంత పెద్ద పేరు పెట్టాలంటే, ముందు అసలు, పౌలస్త్యుడు అనేటువంటివాడిని ఎందుకు వధించాలి? అన్న విషయం కూడా ఖచ్చితంగా వాల్మీకి మహర్షి చెప్పాలనుకునే ఉండుంటాడు. అయితే, ఈ పౌలస్త్యుడు అనేటువంటివాడిని ఎందుకు వధించాలి? అనేటటువంటి కారణాలన్నీ కూడా, ఆరుకాండలో కాకుండా, ఏడవదైన ఉత్తరకాండలో మాత్రమే చెప్పబడి ఉన్నాయి. ఈ ఏడవ కాండ కూడా ఈ ఆరింటికి కలిపితే మాత్రమే, పౌలస్త్య వధ అనేటటువంటి ఒక పూర్తి పేరు ఈ గ్రంథానికి పెట్టడానికి సరిగ్గా సరిపోతుంది. కాబట్టి, ఉత్తరకాండ కూడా వాల్మీకి మహర్షి రచించిందే. రామాయణంలో అంతర్భాగమే.

అలానే, వాల్మీకి మహర్షి ఈ గ్రంథానికి పెట్టినటువంటి మూడవ పేరు సీతా చరితం. అంటే, సీత అనేటువంటి ఒక స్త్రీ యొక్క చరిత్ర. బాలకాండ మొదలుకొని యుద్ధకాండ వరకు కనుక, మీరు కేవలం సీతాదేవి గురించి మాత్రమే రామాయణాన్ని చదివితే కనుక, సీతాదేవి ఏ విధంగా పుట్టింది? సీతారాముల కళ్యాణం ఏ విధంగా జరిగింది? సీతాదేవి పడ్డ కష్టాలు, చివరకు సీతారాములు ఏ విధంగా కలుసుకున్నారు? శ్రీ సీతారామ పట్టాభిషేకం. ఇక్కడితో కథ సుఖాంతం అయిపోతుంది. అయితే, మళ్లీ, సీతా చరితం అనే ఒక గ్రంథానికి పేరు పెట్టాలి అన్నప్పుడు, ఒక మనిషి చరిత్ర అని ఎప్పుడు చెబుతారు? ఆ వ్యక్తి యొక్క జీవిత

పయనం మొత్తం కనుక ఆ గ్రంథంలో చెప్పబడితే, అప్పుడు, అది ఆ వ్యక్తి యొక్క చరిత్ర అని చెబుతారు. ఇక్కడ స్త్రీ అయినటువంటి సీతాదేవి జీవితంలో జరిగినటువంటి మూడు అత్యంత ముఖ్యమైనటువంటి విషయాలు. మొదటి విషయం, సీతారామ పట్టాభిషేకం జరిగింది తరువాత, రాముడు, సీత ఏ విధంగా రాజ్యాన్ని పరిపాలించారు? అనేది. రెండవ విషయం, ఒక స్త్రీ జీవితంలో అత్యంత ఉత్కృష్టమైనటువంటి విషయం మాతృత్వం. సీతాదేవి లవకుశులకు ఈ విధంగా జన్మనిచ్చింది? అన్నది ఈ రెండవ విషయం. మూడవది, సీతాదేవి యొక్క అవతార పరిసమాప్తి ఏ విధంగా జరిగింది? అనేది. ఈ మూడు విషయాలు కూడా సీతాదేవియొక్క జీవిత చరిత్రలో అత్యంత ముఖ్యమైనటువంటి సంఘటనలు, లేదా విషయాలు. కానీ, ఈ మూడు కూడా ఆరు కాండల రామాయణంలో మనకు కనిపించవు. కేవలం ఉత్తరకాండలో మాత్రమే ఉంటాయి. ఒక గ్రంథానికి సీతా చరితమ్ అని పేరు పెట్టాలంటే, సీతాదేవి ఎలా పుట్టింది? ఎలా వివాహం చేసుకుంది? ఎన్ని కష్టాలను అనుభవించింది? తన భర్త అయిన శ్రీరాముని దగ్గరకు మళ్ళీ ఏ విధంగా చేరింది? ఏ విధంగా సీతారాముల పట్టాభిషేకం జరిగింది? పట్టాభిషేకం అనంతరం రామరాజ్యం ఏ విధంగా ఉంది? ఆ తరువాత సీతాదేవి ఒక తల్లిగా లవకుశులకు ఏ విధంగా జన్మనిచ్చింది? చిట్ట చివరకు, సీతాదేవి తన అవతార ఏవిధంగా పూర్తి చేసింది? అన్న ఈ విషయాలన్నీ కలిపితేనే ఒక గ్రంథానికి సీతా చరితమ్ అని పేరు పెట్టగలుగుతాం. కాబట్టి, వాల్మీకి మహర్షి ఆరు కాండల

రామాయణంతోపాటు, 7 వ కాండ అయినటువంటి ఉత్తరకాండను కూడా రచించి, ఈ ఏడుకాండలలో కూడా సీతాదేవి ఒక్క జీవిత చరిత్ర మొత్తాన్ని చెప్పడం వలన, ఆయన ఈ కావ్యానికి సీతా చరితమ్ అని పేరు పెట్టడం జరిగింది. కాబట్టి ఉత్తర కాండ కూడా వాల్మీకి మహర్షి రచించినదే.

ఉత్తరకాండను ఏడవ భాగంగా, వాల్మీకి మహర్షి శ్రీరామాయణంలో అంతర్భాగంగా రచించాడా? లేదా? అన్న ఈ విషయానికి ఆర్గ్యుమెంట్స్, అండ్ కౌంటర్ ఆర్గ్యు మెంట్స్.

ఫస్ట్ పాయింట్. ఆఫ్ ఎనాలసిస్. నేమ్ అఫ్ శ్రీరామాయణంలో ఇప్పటివరకు మీతో చెప్పడం జరిగింది.

అయితే, ఇక్కడ నేను వాల్మీకి మహర్షి రచించారా? లేదా? అని నేను ఎటువంటి ధ్రువీకరణ చేయడం లేదు. నేను ఎటువంటి కంక్లూషన్ చేయడం లేదు. ఇక్కడ ఉన్న విషయాన్ని కేవలం అనలిటికల్ గా ఆర్గ్యుమెంట్, అండ్ కౌంటర్ ఆర్గుమెంట్స్ మాత్రమే నేను ఇక్కడ చెప్పడం జరుగుతుంది. ముందే చెప్పాను కదా. వ్యక్తిగత అభిప్రాయాలకు తావు లేకుండా, కేవలం ఆధికారికమైనటువంటి విషయాలను మాత్రమే డాక్యుమెంటరీలో చెప్పడం జరుగుతుంది. "ది నేమ్ అఫ్ శ్రీరామాయణం" అనే ఈ ఫస్ట్ పాయింట్ లో మనం చూస్తే, కనుక, శ్రీ రామాయణంలో వాల్మీకి మహర్షి ఉత్తరకాండను రచించారు అనేటువంటి ఆర్గ్యుమెంట్సే చాలా బలంగా నిలబడతాయి.

ఇక, నా రెండవ పాయింట్ ఆఫ్ రీసెర్చ్, రైటింగ్ స్టైల్ ఆఫ్ రామాయణమ్. అంటే, రామాయణం యొక్క రచనా శైలి ఏ విధంగా

ఉంది? అనే దృష్టి కోణంలో పరిశీలించడం. రామాయణం ఆరు కాండలు. అది అందరికీ తెలిసిందే. అయితే, అసలు కథ ఎక్కడి నుంచి ప్రారంభం అవుతుంది? వాల్మీకి మహర్షిని నారద మహర్షి కలుస్తారు. మొత్తం రామాయణాన్ని వాల్మీకి మహర్షికి ఒక నూరు శ్లోకాలలో మొత్తం రామాయణాన్ని ముందుగా బోధించి, ఈ నూరు శ్లోకాల సంక్షిప్త రామాయణాన్ని కొన్ని వేల శ్లోకాలను కల ఈ రామాయణ కావ్యంగా రచించు– అని నారద మహర్షి వాల్మీకి మహర్షికి చెప్తారు. ఈ సంభాషణ అంతా కూడా బాలకాండలో మొదటి సర్గలో ఉంటుంది. ఈ సంగ్రహ రామాయణంలో నూరు శ్లోకాలు ఉన్నాయి దీనినే సంక్షిప్త రామాయణం అని కూడా అంటారు. ఈ నూరు శ్లోకాలనే వాల్మీకి మహర్షి ఆధారంగా చేసుకుని, కొన్ని వేల శ్లోకాలు గల శ్రీరామా యణకావ్యంగా రచించారు. ఈ నూరు శ్లోకాలు సంక్షేప రామాయణాన్ని ఆధారంగా చేసుకుని కనుక మనం, ఈ ఉత్తర రామాయణం నిజమా? లేక, కల్పితమా? అన్న ఆ ప్రశ్నకు సమాధానం వెదికితే, ఆర్గ్యుమెంట్స్ ఈ విధంగా ఉంటాయి.

ఈ నూరు శ్లోకాల సంక్షిప్త రామాయణం చిట్ట చివరిలో రాముడు రావణాసురుని సంహరించడం, రాముడు రాజవడం. ఇక్కడితో సంక్షిప్త రామాయణం అయిపోతుంది. కనుక, నారద మహర్షి చెప్పిన విధంగా, కథ కేవలం రాముడు రాజవడంతో పూర్తయిపోతుంది. శ్రీరామాయణం. కాబట్టి, వాల్మీకి మహర్షి కూడా నారద మహర్షి ఏదైతే చెప్పారో, అదే శ్రీరామాయణంగా వాల్మీకి మహర్షి రచించారు. కాబట్టి, రామ రావణ యుద్ధం తర్వాత, శ్రీరామ పట్టాభిషేకంతో శ్రీరామాయణం అనే కావ్యం

సంపూర్ణమైపోతుంది. కాబట్టి, ఉత్తరకాండకు ఆస్కారమే లేదు. ఉత్తరకాండలో ఉన్నటువంటి ఏ విషయాలు కూడా నారద మహర్షి వాల్మీకి మహర్షికి చెప్పలేదు. ఈ సంక్షిప్త రామాయణం ప్రకారం. కాబట్టి, ఉత్తర రామాయణం అనేది కల్పితం, లేదా, ప్రక్షిప్తం తప్ప, వాల్మీకి మహర్షి రచించలేదు.

అయితే, దీనికి కూడా ఒక ప్రతివాదన, లేదా, కౌంటర్ ఆర్గ్యుమెంట్ కూడా ఉంది. అదేమిటంటే, ఈ నూరు శ్లోకాల సంక్షిప్త రామాయణాన్ని కే మొత్తాన్ని కనుక మనం పరిశీలనాత్మకంగా, లోతుగా చదివితే, రామాయణం మొత్తానికి కూడా చిట్టచివరి ప్రయోజనం ఏమిటి? రావణ సంహారం. అరణ్యకాండ నుండి కిష్కింధాకాండ, సుందరకాండ, యుద్ధకాండ, మొత్తం కూడా, రావణ సంహారం దిశగానే నడుస్తూ ఉంటాయి. శ్రీరామాయణం మొత్తానికి కూడా యుద్ధకాండ కీలకమైనటువంటి ఘట్టం. అటువంటి యుద్ధకాండ నారద మహర్షి చెప్పిన నూరు శ్లోకాలు కల సంక్షేప రామాయణంలో చూస్తే కనుక, కేవలం ఒకే ఒక శ్లోకంలో రామారావణ యుద్ధం గురించి చెప్పబడి ఉంటుంది. రామ రావణ యుద్ధం గురించి చెప్పిన ఈ ఒక్క శ్లోకాన్ని ఆధారంగా చేసుకుని యుద్ధకాండ మొత్తం రచించబడింది. ఇప్పుడు, అదే విధంగా సంక్షేప రామాయణం యొక్క చివరి భాగంలో చూస్తే, రామ రావణ యుద్ధం జరిగిన తర్వాత, రామరాజ్యం ఏ విధంగా ఉన్నది? అనేది సుమారు 7, 8 శ్లోకాల్లో చెప్పబడింది. అలాంటప్పుడు, రామ రావణ యుద్ధం గురించి చెప్పిన ఒక్క శ్లోకం నుండి యుద్ధకాండ మొత్తం పుట్టుకుని

వచ్చినప్పుడు, 7, 8 శ్లోకాలలో చెప్పబడిన రామ రాజ్యం నుండి ఉత్తరకాండ ఎందుకు పుట్టకూడదు? ఈ దృష్టిలో కనుక చూస్తే, మనం కచ్చితంగా ఉత్తరకాండ కూడా ఆ సంక్షేప రామాయణంలో భాగమే. రామరాజ్యం ఎలా ఉన్నది? అని చెప్పేటువంటి ఈ ఎనిమిది తొమ్మిది శ్లోకాలు నుండి ఉత్తరకాండ పుట్టుకొచ్చే అవకాశం ఖచ్చితంగా ఉంది. కాబట్టి, ఉత్తరకాండ కూడా వాల్మీకి మహర్షి రచించిందే.

ఉత్తరకాండ నిజమా? కల్పితమా? అన్న నా థర్డ్ పాయింట్ ఆఫ్ రిసెర్చ్ కి వస్తే, మహాభారతం శ్రీరామాయణం గురించి ఏం చెప్తోంది? వినడానికి కొంచెం ఆశ్చర్యంగా ఉన్నా, మహాభారతంలో శ్రీరామాయణం రెండు సార్లు చెప్పబడింది. మహాభారతంలో వనపర్వంలో అంతర్భాగంగా ఉన్నటువంటి తీర్థయాత్రాపర్వం అనే ఆ అధ్యాయంలో 146 నుండి, 147 వ అధ్యాయాలు వరకు శ్రీరామాయణం మొత్తాన్ని కూడా ఆంజనేయ స్వామి భీముడికి ఉపదేశిస్తాడు. పాండవులు వనవాసంలో ఉండగా. అలాగే, మహాభారతంలో, వనపర్వంలో అంతర్భాగంగా ఉన్న ద్రౌపదీహరణ పర్వంలో అధ్యాయాలు 272 నుండి, 290 వరకు, 18 అధ్యాయాల్లో, శ్రీరామాయణం మొత్తాన్ని కూడా మార్కండేయ మహర్షి ధర్మరాజుకు ఉపదేశిస్తాడు. మహా భారతంలో శ్రీరామాయణం ఈ విధంగా రెండు సార్లు చెప్పబడి ఉంది. అయితే, ఇప్పుడు మన ప్రశ్న, ఉత్తర రామాయణం ఇందులో భాగమా? కాదా?

మహాభారతంలో ఆంజనేయ స్వామి, మరియు, మార్కండేయ మహర్షి చెప్పిన శ్రీ రామాయణాన్ని కనుక మనం చదివితే, చిట్టచివర్లో,

ఇద్దరి వర్ణనలో రామరావణ యుద్ధం జరగటం, రావణుడు మరణించడం, శ్రీసీతారామ పట్టాభిషేకం జరగడం. ఇక్కడితో కథ ముగిసి పోతుంది. ఆంజనేయస్వామి మరియు మార్కండేయ మహర్షి తెలియజేసిన వర్ణన ప్రకారం, రావణుడి మరణంతో, రాముడు రాజవడంతో రామాయణం ముగిసి పోతోంది కాబట్టి, ఇంక, ఉత్తర రామాయణానికి ఆస్కారమే లేదు. శ్రీరామాయణం గురించి అత్యంత బలమైనటువంటి సాక్ష్యం ఏది? అంటే, మహాభారతం. అలాంటి మహాభారతంలో, వాల్మీకి మహర్షి, ఆంజనేయ స్వాములు వర్ణించినటువంటి శ్రీరామాయణంలో, చిట్ట చివర, రాముడు రాజవ్వడంతో అయిపోతోంది కనుక, ఉత్తర రామాయణానికి ఎటువంటి ఆస్కారం లేదు. అది వాల్మీకి మహర్షి రచించినది కాదు.

ఈ విధంగా మనం తేల్చేస్తే చాలా పొరపాటే అవుతుంది. ఎందుకంటే, మార్కండేయ మహర్షి వర్ణించినటువంటి శ్రీరామాయణం 18అధ్యాయాలు చిట్ట చివరకు వచ్చేసరికి రామరావణ యుద్ధం రావణ సంహారం ఆ పట్టాభిషేకంతో పూర్తవచ్చు గాక. కానీ, ఆయన ప్రారంభించింది కథ బాలకాండతో ప్రారంభించలేదు. ఆయన కథ ఎక్కడి నుంచి ప్రారంభించారు? అంటే, రావణాసురుడు అనేటటువంటి ఒక రాక్షసుడు ఎన్ని ఆకృత్యాలు చేసేవాడు? అన్న ఆ విషయం నుండి కథ ప్రారంభం చేస్తారు. ఇలాంటి రావణాసురుని సంహరించడానికి శ్రీమహా విష్ణువే శ్రీరాముడిగా జన్మించాడు –అని అక్కడి నుండి రామాయణం మళ్ళీ మొదలవుతుంది. అంటే, మార్కండేయ మహర్షి వర్ణించినటువంటి 18 అధ్యాయాల్లో మొట్టమొదట అంతా కూడా, రావణాసురుడు యొక్క

కృత్యాలు గురించి మాత్రమే ఉంటుంది. యితే, ఈ విషయాలన్నీ కూడా ఆరు కాండల రామాయణంలో మనకు కనిపించవు. కేవలం ఉత్తరకాండలోనే. చెప్పాను కదా, మళ్ళీ 30% ఉత్తరకాండ కూడా రావణాసుడు యొక్క అకృత్యాల గురించి ఉంటుందని. ఈ విషయాలన్నీ కూడా. మార్కండేయ మహర్షి మొట్టమొదటన చెప్పి చిట్ట చివరన రామ పట్టాభిషేకంతో పూర్తి చేస్తారు. అంటే, మార్కండేయ మహర్షి ప్రారంభమే ఉత్తరకాండతో మొదలుపెట్టి, ఆరు కాండల రామాయణాన్ని 18 అధ్యాయాలలో ధర్మరాజుకు బోధిస్తారు. అంటే, మహాభారతంలో కూడా ఉత్తర రామాయణం గురించి చెప్పబడి ఉంది. ముందే చెప్పాను కదా. మహాభారతం కంటే బలంగా నిలబడ్డ సాక్ష్యం ఇంకేముంది, శ్రీ రామాయణానికి? మహాభారతం ప్రకారం చూస్తే కనుక, ఉత్తర రామాయణం కూడా వాల్మీకి మహర్షి రచించిందే. శ్రీ రామాయణంలో అంతర్భాగమే.

తరువాత, నా ఫోర్త్ పాయింట్ ఆఫ్ రీసెర్చ్ పద్మ పురాణం. ఉత్తర రామాయణం నిజమా? లేక, కల్పితమా? అన్న ఈ ప్రశ్నకు సమాధానం మనకు వేదవ్యాసుడు రచించినటువంటి పద్మపురాణంలో కూడా దొరుకుతుంది. రామాయణానికి కాండలు ఎలాగో, మహాభారతానికి పర్వాలు ఎలాగో, పద్మపురాణానికి ఖండాలు ఉంటాయి. అవి ఏడు ఖండాలు ఉంటాయి. అవి, సృష్టిఖండ, భూమి ఖండ, స్వర్గఖండ, బ్రహ్మ ఖండ, పాతాళఖండ, ఉత్తరఖండ, క్రియాయోగసారఖండ. ఇలా ఏడు

ఖండాలుగా పద్మ పురాణం విభజించబడి ఉంటుంది. శ్రీమహావిష్ణువు గురించి శ్రీ వేదవ్యాస మహర్షి ఈ పద్మపురాణాన్ని రచించారు.

పద్మ పురాణం మొత్తంలోను సుమారు 75 అధ్యాయాలలో శ్రీవేదవ్యాస మహర్షి శ్రీరామాయణాన్ని కూడా చెప్పడం జరుగుతుంది. అత్యంత విచిత్రంగాను, ఆసక్తికరంగాను పద్మపురాణంలోని భాగమైనటువంటి పాతాళ ఖండంలో, అధ్యాయాలు ఒకటి నుండి 68 వరకు, కేవలం ఉత్తర రామాయణం మాత్రమే చెప్పబడింది. అలాగే, పద్మపురాణంలోని అంతర్భాగమైనటువంటి ఉత్తర ఖండంలో అధ్యాయాలు 242 నుండి 244 వరకు శ్రీరామాయణం సంక్షిప్తంగా చెప్పబడి ఉంది. అలాగే, పద్మ పురాణంలో అంతర్భాగమైనటువంటి సృష్టిఖండంలో అధ్యాయాలు 33 నుండి 37 వరకు, శ్రీరామాయణంలో నుంచి, అలానే, ఉత్తర రామాయణం, లేదా, ఉత్తరకాండలో నుంచి కూడా కొన్ని సంఘటనలు చెప్పబడి ఉన్నాయి. అత్యంత ముఖ్యంగా, పద్మ పురాణంలో అంతర్భాగమైనటువంటి పాతాళఖండంలో 69 అధ్యాయాలు కేవలం ఉత్తర రామాయణం గురించి మాత్రమే ఉంటుంది. పద్మపురాణాన్ని రచించింది సాక్షాత్తు వేదవ్యాసులే. ఉత్తర రామాయణం కూడా రామాయణంలో అంతర్భాగమే అని చెప్పడానికి పద్మ పురాణం చాలా బలమైనటువంటి సాక్ష్యంగా నిలబడుతుంది.

తరువాత, ఉత్తర రామాయణం గురించిన ఫిఫ్త్ పాయింట్ అఫ్ రీసెర్చ్ శ్రీ వేదవ్యాస మహర్షి రచించినటువంటి స్కాంద పురాణం. 18 పురాణాలలో అన్నిటిలో అతిపెద్దది స్కాంద పురాణం. ఈ స్కాందపురాణం

కూడా పద్మ పురాణంలాగానే, ఖండాలుగా విభజించబడి ఉంది. మాహేశ్వరఖండం, వైష్ణవ ఖండం బ్రహ్మఖండం, కాశీఖండం, అవంతి ఖండం, నగర ఖండం, ప్రభాస ఖండం. ఇందులో, ప్రత్యేకించి వైష్ణవ ఖండంలో కనుక మనం చూస్తే, ఈ వైష్ణవ ఖండంలో భాగంగా అయోధ్యా మాహాత్మ్యం అనే ఒక అధ్యాయం ఉంటుంది. ఆ అధ్యాయంలో ఉత్తర రామాయణం గురించి, అలానే, శ్రీ రామాయణం గురించి, అయోధ్య గురించి, వీటన్నింటి గురించి ఎన్నో విశేషాలు చెప్పబడినాయి. స్కాంద పురాణం వైష్ణవ ఖండంలో అయోధ్యా మాహాత్మ్యం. కొన్ని సంవత్సరాల క్రితం సుప్రీంకోర్టు ఇచ్చినటువంటి రామ్ జన్మభూమి వర్డిక్ట్ లోని, మీరు గూగుల్లో సెర్చ్ చేస్తే, "సుప్రీం కోర్ట్ జడ్జిమెంట్ ఆన్ రామజన్మభూమి" అని కొడితే కనుక, సుమారు 1000 పేజీల పిడిఎఫ్ వస్తుంది. సుప్రీంకోర్టు వాళ్ళు దానినిపబ్లిక్ డొమైన్ లో పెట్టారు. ఆ డాక్యుమెంట్ లో కనుక మీరు తెరిచి చూస్తే, స్కాంద పురాణం వైష్ణవ ఖండం అయోధ్యా మాహాత్మ్యం అనేటువంటి ఈ అధ్యాయంలోనుంచి ఎన్నో విశేషాలు, రాముడు జన్మించినది అదే ప్రదేశంలోనూ, అయోధ్యలోనే అని ప్రూవ్ చేయడానికి సుప్రీంకోర్టులో సాక్ష్యంగా నిలబడింది, స్కాంద పురాణం. సుప్రీం కోర్ట్ స్కాంద పురాణాన్ని సాక్ష్యంగా పరిగణనలోకి తీసుకున్నది– అనే విషయాన్ని నేను ఎందుకు చెబుతున్నానంటే, ఇదే స్కాంధపురాణంలో ఉత్తర రామాయణానికి సంబంధించిన విషయాలు కూడా ఉన్నాయి. మనలో చాలామందికి పురాణాల యొక్క వ్యాలిడిటీ, వాటి పవర్ ఏంటి? అనేది తెలియదు. ఇండియా స్టాప్ కోర్టులో ఒక స్ట్రాంగ్ ఎవిడెన్స్ కింద

నిలబడగలిగింది, స్కాంద పురాణం. నేను ఆధ్యాత్మికంగా, స్పిరిచువల్ గా వాటి పవర్ గురించి చెప్పడం లేదు, జుడీషియల్ గా కాంటెంపరరీ వరల్డ్ లో పురాణం అనేది ఎంత స్ట్రాంగ్ గా నిలబడగలదు? – అన్న దానికి ఒక ప్రైమ్ ఎగ్జామ్పుల్ స్కాంద పురాణం. ఈరోజు అయోధ్యలో రామ జన్మభూమిలో రాముడికి గుడి కట్టగలుగుతున్నారు అంటే, దానికి ప్రథమ కారణం స్కాందపురాణం. రామ్ జన్మభూమి వర్డిక్ట్ కనక మీరు డౌన్లోడ్ చేసి చదివితే, మీకే అర్థమవుతుంది ఆ విషయం. అయితే, స్కాంద పురాణం గురించి నేను ఎందుకు ఇంత స్ట్రాంగ్ గా చెబుతున్నానంటే, ఇదే స్కాందపురాణంలో, వైష్ణవఖండంలో అయోధ్యా మాహత్మ్యంలో ఉత్తర రామాయణానికి సంబంధించిన విషయాలు కూడా చెప్పబడి ఉన్నాయి. కాబట్టి, ఉత్తర రామాయణం కూడా రామాయణంలో అంతర్భాగమే. జరిగిన కథయే– అని చెప్పడానికి స్కాంద మహాపురాణం ఒక బలమైన సాక్ష్యంగా నిలబడుతుంది.

ఉత్తర రామాయణం గురించి నా సిక్స్త్ పాయింట్ ఆఫ్ రీసెర్చ్ కార్వింగ్స్ఆన్ ఏన్ షెంట్ టెంపుల్స్. ఇక్కడ మీరు చూస్తున్నటువంటి ఈ కార్వింగ్ ఏవైతే ఉన్నాయో, అవి, ఎల్లోరా టెంపుల్లో సుమారుగా ఒక 16 నుండి 17వందల సంవత్సరాల క్రితం చెక్కబడినటువంటి సంపూర్ణ శ్రీరామాయణం యొక్క శిల్పకళ. ఈ కార్వింగ్ లో, శ్రీరాముడు జన్మించిన దగ్గర నుంచి రామ రావణ యుద్ధం జరగడం, శ్రీ సీతారామ పట్టాభిషేకం వరకు చెక్కబడి ఉంది. కానీ, సీతారామ పట్టాభిషేకం జరిగిన తర్వాత వచ్చినటువంటి ఉత్తరకాండలో ఎటువంటి సంఘటనలు చెక్కబడి లేవు.

ఒక్క ఎల్లోరాలోనే కాదు, ఏ పురాతన దేవాలయంలో అయినా సరే, శ్రీరామాయణం చెక్కబడినటువంటి ఆలయాలు ఎన్నో ఉంటాయి. ఇప్పటివరకు కూడా నేను చేసిన రిసోర్చ్ లో, ఎక్కడా కూడా ఉత్తర రామాయణంలో ఉన్నటువంటి సంఘటనలు చెక్కబడినటువంటి దేవాలయాలు ఎక్కడా కనపడలేదు. సహజంగా శ్రీరామాయణం అంటే, సీతారామ పట్టాభిషేకంతో ముగిసిపోతుంది. ఈ విధంగా ఎన్నో శిల్పాలు ఎన్నో గుళ్ళలో చెక్కబడి ఉన్నాయి. ఉదాహరణకు ఇక్కడ చూపిస్తున్న ఎల్లోరా ఒక్కటే. కాని, ఇలా ఎన్నో. రామాయణ శిల్ప కళలో, మనకు ఎక్కడ కూడా, ఉత్తర రామాయణంలోని సంఘటనలు కనపడవు. అయితే, దీనినిబట్టి ఉత్తర రామాయణం ప్రక్షిప్తమా? లేక, కల్పితమా? లేక, నిజంగా జరిగిందా? అన్న విషయం మనం చెప్పలేం. కానీ, ఒక్క విషయం అయితే ఖచ్చితంగా చెప్పొచ్చు శ్రీసీతారామ పట్టాభిషేకం జరిగిన తరువాత వచ్చినటువంటి ఈ ఉత్తర రామాయణం ప్రజలలోకి ఎందుకనో అంతగా వెళ్లలేదు. అంతవరకైతే మాత్రం మనం ఖచ్చితంగా చెప్పొచ్చు. అది కేవలం ఇప్పుడే కాదు. కొన్నివేల సంవత్సరాలు క్రితం చెక్కబడినటువంటి ఈ ఎల్లోరాలాంటి పురాతనమైన దేవాలయాలు బట్టి కూడా మనం ఏం చెప్పచ్చు అంటే, కొన్ని వందలవేల సంవత్సరాల నుండి కూడా ఉత్తర రామాయణం ఎందుకో ప్రజల మధ్యకు అంతగా వెళ్లలేకపోయింది.

ఉత్తర రామాయణం గురించి నా సెవెంత్ పాయింట్ ఆఫ్ రీసెర్చ్. ఇప్పటికి సుమారు 120 సంవత్సరాలకు పూర్వం, 1902 వ

సంవత్సరంలో బ్రిటిష్ రాజ్ మన భారతదేశాన్ని పరిపాలిస్తున్న ఆ సమయంలో, ముఖ్యంగా, దక్షిణ భారతదేశంలో చాలా ప్రదేశాల నుండితాళపత్ర గ్రంథాలను బ్రిటిషర్స్ స్వాధీనం చేసుకోవడం జరిగింది. కొన్ని వందల, వేల సంవత్సరాలుగా వంశపారంపర్యంగా గుళ్ళల్లోనూ, సామాన్య ప్రజల దగ్గర ఉన్నటువంటి తాళపత్ర గ్రంథాలను బ్రిటీషర్స్ స్వాధీనం చేసుకున్నారు. అలా స్వాధీనం చేసుకుని, ఒక జనరల్ ఎంట్రీలాగా మొత్తం ఈ తాళపత్ర గ్రంథాల గురించి కలిపి ఒక మ్యాన్యు లాంటిది పబ్లిష్ చేశారు. ఆ పుస్తకమే సౌత్ ఇండియన్ మాన్ స్క్రిప్స్ అనే పుస్తకం. ఇప్పటికీ సరిగ్గా 120 సంవత్సరాల క్రితం, అంటే, 192 వ సంవత్సరంలో బ్రిటీషర్స్ మన భారతదేశంనుండి, ముఖ్యంగా, దక్షిణ భారతదేశం నుండి స్వాధీనం చేసుకున్నటువంటి తాళపత్ర గ్రంథాల యొక్క వివరాలన్నీ కూడా ఈ పుస్తకంలో ప్రచురించబడ్డాయి. అయితే, అలా స్వాధీనం చేసుకున్నటువంటి తాళపత్ర గ్రంథాలలో శ్రీరామాయణం యొక్క తాళపత్ర గ్రంథాలు కూడా వాళ్లకు లభించాయి. అంటే, దాని అర్థం. ఈ తాళపత్ర గ్రంథాలు వాల్మీకి రచించినవి అని అర్థం కాదు. రాతప్రతులు ఒకరినించి ఇంకొకరు వ్రాసుకుంటూ వచ్చినటువంటి శ్రీరామాయణం కొన్ని వందల సంవత్సరాల క్రితంలోని, లేక, సుమారు 1000 సంవత్సరాల క్రితంలోని పురాతనమైనటువంటి తాళపత్ర గ్రంథాలు లభించాయి. అందులో, ఉత్తర రామాయణం లేదు. బాలకాండనుండి యుద్ధకాండవరకే ఉంది. కాబట్టి, ఉత్తర రామాయణం కల్పితం, లేదా, ప్రక్షిప్తం అని అనుకుంటే మళ్ళీ మనం పొరపాటు పడినట్లే.

బ్రిటిషర్స్ కి దొరికినటువంటి తాళపత్ర గ్రంథాలు వాల్మీకి మహర్షి విరచితమైనటువంటి శ్రీరామాయణం ఆరు కాండల తాళపత్ర గ్రంథాలు ఏ విధంగా అయితే దొరికాయో, అలానే, వేరుగా, మరొక తాళపత్ర గ్రంథం, కేవలం ఉత్తరరామాయణం మాత్రమే లిఖించినటువంటి మరొక తాళపత్ర గ్రంథం కూడా బ్రిటిష్ వారికి దొరికింది. దాని వివరాలు కూడా బ్రిటిషర్స ఇందులో, ఈ పుస్తకంలో ప్రచురించడం జరిగింది. అందుచేత, ఉత్తర రామాయణం, లేక, ఉత్తరకాండ అనేది ఎప్పుడూ కూడా శ్రీరామాయణానికి విడిగా వస్తూనే ఉంది. ఉంటూనే ఉంది. అది ప్రజల్లోకి వెళ్లినా, వెళ్ళకపోయినప్పటికీ, ఉత్తర రామాయణం అప్పటినుండి కూడా పారంపర్యంగా వస్తూనే ఉంది. కొన్ని వందల వేల సంవత్సరాల పురాతన మైనటువంటి తాళపత్ర గ్రంథాలలో కూడా ఉత్తర రామాయణం గురించి రచించబడి ఉంది. అయితే, అది ఈ ఆరు కాండల రామాయణంతో కలవకుండా విడిగా ఉంది? ఎందుకు? అనేది సమాధానం లేని ప్రశ్న.

ఉత్తర రామాయణం గురించి ఎయిత్ పాయింట్ ఆఫ్ రీసెర్చ్, రిలయబుల్ రిటెల్లింగ్ సోర్సెస్ ఆఫ్ రామాయణ. ఉత్తర రామాయణం కొన్ని పదుల సంఖ్యలలో, భాషలలో కొన్ని వందలసార్లు అనువదించబడి, లేదా, రచించబడి ఉంది. ఇటువంటి ఈ అధికారికమైనటువంటి రామాయణ రచనలలో, వాల్మీకి మహర్షి విరచితమైన శ్రీరామాయణం తర్వాత, అంత ప్రాముఖ్యం చెందినటువంటివి తులసీదాస్ రచించిన రామచరితమానస్, మరియు, కంబ రామాయణం. ఈ రెండు అత్యంత పురాతనమైనటువంటివి. అయితే, ఈ రెండు గ్రంథాలలో కూడా ఉత్తర

రామాయణం లేదు. ప్రత్యేకించి, తులసీదాసు గారు రచించినటువంటి రామచరితమానస్. అందులో ఉత్తర రామాయణానికి సంబంధించినటువంటివి ఎటువంటి సంఘటనలు కూడా రచించబడిలేవు. హనుమాన్ చాలీసా రచించినంతటి గొప్ప భక్తులైన తులసీదాసు గారు శ్రీసీతారామ పట్టాభిషేకంతో రామాయణాన్ని ఎందుకు ఆపేశారు? ఉత్తరకాండకు సంబంధించిన విషయాలు ఏవి కూడా ఎందుకు ప్రస్తావించలేదు? ఇది కూడా సమాధానం లేని ప్రశ్న.

ఉత్తరకాండకు సంబంధించి సైన్త్ పాయింట్ ఆఫ్ రీసెర్చ్ –ది నేమ్ అఫ్ ఉత్తరకాండ. వాల్మీకి మహర్షి రచించినటువంటి ఈ కాండల పేర్లు కనుక మనం గమనిస్తే, బాలకాండ, రాముడి యొక్క బాల్యం గురించి చెప్తుంది. అయోధ్యాకాండ, సీతారామ కళ్యాణం అనంతరం అయోధ్యలో జరిగినటువంటి విశేషాలు అన్నీ కూడా చెబుతుంది. అలానే, అరణ్యకాండ, సీతారామ లక్ష్మణులు ఏ విధంగా అరణ్యవాసానికి వచ్చి జీవించారు అన్న విషయాలన్నీ చెబుతున్నది. అలాగే, కిష్కింధాకాండ, కిష్కింధారాజ్యంలో జరిగినటువంటి రామ సుగ్రీవ మైత్రిని, వానరుల గురించి చెబుతుంది. ఆంజనేయ స్వామికి మరొక పేరు సుందరుడు. సీతా దేవి జాడను వెతకడంలో ఆంజనేయ స్వామి ఎదుర్కొన్నటువంటి పరిస్థితులు, మరియు విశేషాలు గురించి చెబుతుంది కాబట్టి సుందరకాండ. చివరిగా, రామ రావణ యుద్ధం యొక్క విశేషాలన్నీ రచింపబడి ఉన్నాయి కాబట్టి, యుద్ధకాండ అని పిలుస్తున్నారు. ఇవి వాల్మీకి మహర్షి పెట్టినటువంటి పేర్లు. ప్రతి కాండకు కూడా ఆ కాండ యొక్క మూల అర్థం వచ్చే విధంగా

వాల్మీకి మహర్షి ఆ కాండలకు ఆ పేర్లు పెట్టడం జరిగింది. ఇప్పుడు ఇదే పంథాలో, లేదా, ఇదే పేట్రన్ లో వాల్మీకి పెట్టిన పేర్లను చూస్తే, వాల్మీకి మహర్షి నిజంగా ఉత్తరకాండను రచించి ఉండి ఉంటే, దానికి ఉత్తరకాండ, ఉత్తర అంటే సెక్స్ అని అర్థం, ఉత్తరకాండ అంటే, ద చాప్టర్ ఆఫ్ ద సెక్స్. ఈ పేరు ఎందుకు పేరుపెట్టి ఉండి ఉండాలి? రామావతారం యొక్క మూలమంతా కూడా రామరాజ్యం. అలాంటప్పుడు, ఉత్తర కాండ అంతా కూడా శ్రీరామరాజ్యం గురించి చెబుతుంది కాబట్టి, మిగిలిన కాండలకు ఏ విధంగా అయితే ఆ కాండల యొక్క మూలార్థం వచ్చే విధంగా పెట్టారో, ఈ ఉత్తరకాండకు కూడా రామరాజ్యకాండమనో, లేక, మరొక విధంగానో పెట్టి ఉండాలి ఉత్తరకాండ అనేది ఏ విధంగా ఈ ఆరింటితో సరిపోతుంది? . ఆరు ఒకే విధంగా ఉన్నాయి. ఏడవదైన ఈ ఉత్తరకాండ మాత్రం వీటితో సంబంధం లేకుండా ఉంది, ఆ పేరు. ఇది నిజంగా వాల్మీకి మహర్షిరచించినదేనా? ఈ ప్రశ్నకు కూడా సమాధానం లేదు.

ఉత్తరకాండకు గురించిన చిట్టచివరి పాయింట్ ఆఫ్ రీసెర్చ్, ది బిగ్ ఓపెన్ సీక్రెట్. "చతుర్వింశతి సహస్రాణి శ్లోకానా ముక్తవాన్ ఋషిః, తథా సర్గ శతాన్ పంచ షట్కాండాని తథోత్తరమ్". శ్రీరామాయణం బాలకాండ నాలుగవ సర్గ రెండవ శ్లోకం ఉత్తర రామాయణం గురించి అది కల్పితమా? ప్రక్షిప్తమా? నిజంగా జరిగిందా? జరగలేదా? వాల్మీకి రచించినదా? కాదా? అని ఈ ప్రశ్నలన్నీ అన్నీ కూడా ఒక్క వేటుతో తెగిపోతాయి, ఈ ఒక్క శ్లోకం వల్ల. ఈ శ్లోకం యొక్క అర్థం ఏంటంటే, వాల్మీకి మహర్షి రామాయణం మొత్తాన్ని కూడా 24 వేల శ్లోకాలలో, 500 సర్గలలో సరిపోయేలా ఆరు

కాండలు, మరియు, ఒక ఉత్తరకాండగా రచించారు. వాల్మీకి మహర్షి తన స్వహస్తాలతోనే రాశారు. "నేను ఉత్తరకాండను కూడా రచించాను" అని. "తథోత్తరమ్" అనే చిట్ట చివరి పదానికి అర్థం అదే. వాల్మీకి మహర్షి ఉత్తరకాండను రచించారు అన్న విషయం ఆరు కాండల రామాయణంలో మొట్టమొదట ఉన్నటువంటి బాలకాండలో నాలుగవ సర్గలో రెండవ శ్లోకంలో స్పష్టంగా రాసి ఉంది. అయితే, రామాయణంలోని ఇంత స్పష్టంగా ఉత్తరకాండను కూడా వాల్మీకి మహర్షి రచించారు అన్నప్పటికీ కూడా, ఇంతగా ఉత్తరకాండ గురించి ఇన్ని అభిప్రాయాలు, అది కల్పితమని కొందరు, ప్రక్షిప్తం అని కొందరు, అసలు ఇన్ని అపోహలు, అపార్థాలు ఏ విధంగా వచ్చాయో! నాకు ఎనలైజ్ చేసినప్పుడు నాకు చాలా సర్ప్రైజింగ్ గా, చాలా షాకింగ్ గా అనిపించాయి.

అలానే, నాలుగవ సర్గ మూడవ శ్లోకంలో కూడా వాల్మీకి మహర్షి ఉత్తరకాండతో కలిపి రచించారు– అని "తథోత్తరమ్" అని ఉత్తరకాండ కూడా కలిపి చెప్పడం జరిగింది.

ఆఖరి చాప్టర్ లో కన్ క్లూజన్.

ఉత్తరకాండ గురించి మనకు తెలిసినటువంటి వాస్తవాలు ఏంటి?

ఈరోజు మనకు అందుబాటులో ఉన్నటువంటి, వాల్మీకి మహర్షి రచించినటువంటి వాల్మీకి రామాయణం ఏదైతే ఉన్నదో, ఆ గ్రంథాన్ని రచించినది వాల్మీకి మహర్షి అయితే కనుక, ఆ ఆరు కాండల రామాయణాన్ని రచించినది వాల్మీకి మహర్షి అయితే కనుక, ఈ ఏడవ

కాండన అయినటువంటి ఉత్తరకాండను కూడా రచించింది వాల్మీకి మహర్షియే.

లేదు, వాల్మీకి మహర్షి ఉత్తరకాండను రచించలేదు– అని ఎంతటివారు కూడా అనడానికి ఆస్కారమే లేదు. ఎందుకో చెప్తాను, వినండి.

ఉత్తరకాండను వాల్మీకి మహర్షి రచించారు అన్నది నిజం కాదు, అబద్ధం –అంటే, మనం మహాభారతం, పద్మ పురాణం, స్కాంద పురాణం, ఈ మూడు గ్రంథాల్లో ఉన్నటువంటి రామాయణానికి సంబంధించిన ప్రత్యేకించి, ఉత్తర రామాయణానికి సంబంధించినటువంటి ఘట్టాలు ఏవైతే వర్ణించబడి ఉన్నాయో, మహాభారతంలో, పద్మ పురాణంలో, స్కాంద పురాణంలో, ఈ మూడు గ్రంథాలు కూడా తప్పు– అని మనం అన్నట్లు అవుతుంది. ఉదాహరణకు, స్కాంద పురాణంలో చెప్పబడినటువంటి ఉత్తర రామాయణ సంబంధిత విషయాలన్నీ కూడా కల్పితాలు అని కనుక మనం అంటే, స్కాంద పురాణం కూడా తప్పు అని కనుక మనం అంటే, ఇదే స్కాంద పురాణాన్ని ఆధారంగా చేసుకుని సుప్రీంకోర్టు ఆఫ్ ఇండియా తీర్పు కూడా ఇచ్చింది. రామజన్మ భూమిలో సాక్ష్యంగా నిలబడ్డ స్కాంద పురాణం ఉత్తర రామాయణంలో ఎందుకు తప్పైపోతుంది.? ఎటు నుంచి ఎటు చూసినా సరే, ఉత్తర రామాయణం అనేది శ్రీవాల్మీకి మహర్షి రచించిందే. అయితే, వాల్మీకి మహర్షి రచించినటువంటి ఉత్తర రామాయణంలో, లేక, ఆరు కాండల శ్రీరామాయణంలో ప్రక్షిప్తాలు వచ్చి చేరే అవకాశం ఖచ్చితంగా ఉంది. ఉత్తర

రామాయణంలో ప్రక్షిప్తాలు, అంటే, వాల్మీకి మహర్షి తరువాత వచ్చినటువంటివారు శ్లోకాలను మార్పు చేర్పులు చేయడం, లేదా, కొత్త శ్లోకాలు జోడించడం, ఇటువంటివి జరిగి ఉండొచ్చేమో! కానీ, ఉత్తర రామాయణాన్ని రచించింది మాత్రం వాల్మీకి మహర్షి అనే ఈ విషయాన్ని శ్రీరామాయణం, మహాభారతం, స్కాంద పురాణం, పద్మ పురాణం అనే నాలుగు అత్యంత అధికారికమైన మైనటువంటి గ్రంథాలు ఖచ్చితంగా చెబుతున్నాయి మనకి. ఉత్తర రామాయణం కూడా శ్రీరామాయణంలో భాగమే. ఉత్తర రామాయణం గురించి సంవత్సరం పాటు నేను చేసిన నా రీసర్చ్ లో ఈ పది విషయాలు నిర్ద్వంద్వంగా చెప్పేదేమిటంటే, ఉత్తర రామాయణం అనేది ఎప్పుడూ కూడా శ్రీరామాయణంలో భాగంగానే నిలబడినది. దానికి తగ్గ ఆర్గ్యుమెంట్స్ అండ్ కౌంటర్ ఆర్గ్యుమెంట్స్ ఈ వ్యాసంలోనే మీ ముందు తీసుకు వచ్చాను.

అయితే, కథ ఇక్కడితో అయిపోలేదు. ఉత్తర రామాయణం, లేదా, ఉత్తరకాండ ఆరు కాండల శ్రీరామాయణంతో కలవకుండా ఎప్పుడు విడిగానో, వేరుగానో ఉండటం, అలానే, పారాయణాల్లో కేవలం 6 కాండలు మాత్రమే చెప్పడం, ఏడవ కాండ ఉత్తర రామాయణం గురించి ప్రజలు సహజంగా అంతగా మక్కువ చూపించకపోవడం, ఇవన్నీ ఎందుకు? అన్న విషయంలో నేను ఆలోచిస్తే, మూడు అత్యంత ముఖ్యమైనటువంటి సంఘటనలు, ఇది వరకు నేను చెప్పిన విధంగానే, సీతా పరిత్యాగం, లక్ష్మణునికి మరణం, శంబూక వధ, ఈ మూడు ఘట్టాల్లో కూడా శ్రీరాముడు యొక్క వ్యక్తిత్వాన్ని తక్కువ చేసే విధంగా ఉంటాయి అన్న

భ్రమలో, అనే అపోహలో, ప్రజలు ఎప్పుడూ ఉత్తరకాండను కొంచెం దూరం పెడుతూ వస్తున్నారు. అసలు నిజం ఏమిటి? ఈ మూడు సంఘటనల్లో యథార్థంగా అసలు ఉత్తర రామాయణంలో చెప్పబడిన విషయం ఏమిటి? నిజంగానే శ్రీరాముడి వ్యక్తిత్వాన్ని తక్కువ చేసే విధంగా ఉంటాయా? లేక, ఇది అర్థం చేసుకోవడంలో మన పొరపాటు, మన లోటు పాట్లు ఉన్నవా? నిష్పక్షపాతంగా అసలు ఉత్తరామాయణంలో ఏముంది? అన్న విషయం తెలుసుకునే ప్రయత్నాన్ని చేద్దాం.

అయితే, ఉత్తర రామాయణంలో ఉన్నటువంటి ఈ మూడు సంఘటనలతో పాటుగా, వాలిని సంహరించడం, సీతాదేవి అగ్నిపరీక్ష, అనే ఈ రెండు విషయాలు కూడా కలిపి, ఈ ఐదు విషయాలలో కూడా శ్రీరాముడి వ్యక్తిత్వం ఏవిధంగా ఉన్నది? అన్న విషయాన్ని తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

మొదటి విషయం, వాలిని శ్రీరాముడు చెట్టు చాటు నుండి సంహరించడం. శ్రీరామాయణంలో కిష్కింధాకాండలో18వ సర్గలో వాలి శ్రీరాముని సూటిగా ప్రశ్నిస్తాడు. రామా! నన్ను చెట్టు చాటు నుండి ఎందుకు చంపావు? ధైర్యంగా ముందుకు వచ్చి ఎందుకు చంపలేదు? అని. అందుకు రాముడు ఇచ్చినటువంటి వివరణ "యాంతి రాజర్షయశ్చాత్ర మృగయాం ధర్మకోవిదాః" – రాజైయినటువంటి నాకు మృగాలను చెట్టు చాటు నుండి సంహరించడం అనేది ధర్మబద్ధమే. ఆ ధర్మానికి కట్టుబడే మృగమైనటువంటి నిన్ను నేను సంహరించడం జరిగింది. నేను ఈ వ్యాసంలో మొదటిలోనే చెప్పాను. భావోద్వేగం

ఉన్నచోట తర్కం పనిచేయదు, తర్కమున్నచోట భావోద్వేగానికి తావు లేదు– అని. ఇక్కడ ఎమోషనల్ గా కాకుండా, ఎథికల్ గా చూస్తే కనుక, రాముడు ఎక్కడ కూడా ధర్మం తప్పినట్టుగా మనకు కనిపించనే కనిపించదు. ఈ విషయం నేను చెప్పట్లేదు. ఈ రిఫరెన్స్ లో కనుక మీరు ఇంట్రెస్ట్ ఉన్న వాళ్ళు తీసి చూస్తే, మీకే విషయం అర్థమవుతుంది.

ఇక, రెండవది, సీతాదేవి అగ్ని ప్రవేశం. శ్రీరామాయణానికి, మన తెలుగు ప్రజలకు, తెలుగు సంస్కృతికి ఎన్నటికి విడదీయలేనంత అనుబంధం ఉంది. మన రెండు తెలుగు రాష్ట్రాల్లో కూడా తెలంగాణలో, ఆంధ్రప్రదేశ్ లోనూ అసలు రామాలయం లేనటువంటి ఊరు ఒక్కటి కూడా ఉండనే ఉండకపోవచ్చు. శ్రీరామాయణంతో ఇంత అనుబంధం ఉన్నటువంటి తెలుగు భాష, తెలుగు ప్రజలు, మన వాడుకలో ఉన్నటువంటి, అతిదోషకరమైనటువంటి మాట ఏది? అంటే, సీతాదేవి అగ్నిపరీక్ష. సీతా దేవికి జరిగింది అగ్ని పరీక్ష కాదు. సీతాదేవి రాముడు మాట్లాడినటువంటి కఠినమైన మాటలు వినలేక, ఆత్మహత్యా ప్రయత్నం చేస్తూ అగ్నిలో ప్రవేశిస్తుంది. ఇక్కడ అసలు జరిగినది ఏమిటో రిఫరెన్స్ ప్రకారం చూద్దాం. ఇక్కడ యుద్ధకాండ 115వ సర్గ, పదకొండవ శ్లోకం. "విషయ స్తాం తు రామస్య సమీపే హృదయప్రియామ్, జనవాద భయాద్రాజో బభూవ హృదయం ద్విధా". ఇక్కడ జాగ్రత్తగా కనుక, మనం 11వ శ్లోకంలో, ఈ మొదటి లైన్ చూస్తే కనుక, సంస్కృతంలో ఉంది ఇక్కడ, తెలుగులో అర్థం చెబుతున్నాను. "హృదయస్థాం తు రామస్య సమీపే హృదయ ప్రియామ్" – తన హృదయప్రియుడైనటువంటి రాముని

దగ్గరకు సీతాదేవి వస్తుంది. " రామస్య సమీపే హృదయప్రియామ్ "అని ఇక్కడ వాల్మీకి రాశారు. కింద లైన్లోకి వచ్చేసరికి, "జనవాద భయాద్రాజో బభూవ హృదయం ద్విధా". జనాలు ఏమనుకుంటారో! అని భయపడినటువంటి రాజైన రాముడు సీతాదేవిని స్వీకరించడానికి భయపడ్డాడు. మొదట లైన్లో రాముని "రామస్య" అని సంబోధించినటువంటి వాల్మీకి మహర్షి, రెండవ లైన్ లోకి వచ్చేసరికి "రాజా" అని ఎందుకు సంపాదించారంటే, సీతాదేవి హృదయ ప్రియుడైనటువంటి రాముడు దగ్గరకు సీతాదేవి వస్తున్నప్పటికీ, ప్రజలకు రాజైన రాముడు ఆమెకు దూరంగా జరుగుతున్నాడు. ఈ ఒక్క శ్లోకం ఎంత కీలకమైనటువంటి అర్థాన్ని చెప్తుంది అంటే, సీతారాముడా? రాజారాముడా? వాళ్ళిద్దరి మధ్య, ఆ ఇద్దర రాముల మధ్యన జరిగిన సంఘర్షణ ఏదైతే ఉందో, ఈ ఒక్క శ్లోకంలో దాని అర్థం మొత్తం వచ్చే విధంగా ఉన్నది. అలానే, తర్వాత రాముని సీతాదేవితో మాట్లాడినటువంటి మాటలు చూస్తే, రెండవ శ్లోకంలో, "దీపో నేత్రాతురస్యేవ ప్రతికూలాసి " అని అంటున్నాడు. ఈ సంస్కృత ప్రయోగానికి అర్థం ఏమంటే, కంటికి జబ్బు ఉన్న ఒక వ్యక్తికి దీపాన్ని చూసినప్పుడు ఆ దీపం యొక్క వెలుగు ఎంత కష్టంగా అనిపిస్తుందో, నాకు నిన్ను చూస్తుంటే అంతే కష్టంగా ఉంది. –అని శ్రీరాముడు సీతాదేవితో చెబుతున్నాడు. అంటే, ఇక్కడ రాముడు తన కంటికి జబ్బు ఉన్నది అని చెప్పడంలోని అర్థం ఏమంటే, ప్రజలు ఏమనుకుంటారో! అన్న భయంతో రాముడు సీతాదేవిని స్వీకరించలేకపోవడం అనేది తనకి

తాను ఒక జబ్బు ఉన్న వ్యక్తిగా ఉపమాసం చెప్పుకొని, సీతాదేవిని ఒక దీపంతో సమానంగా చెబుతూ, శ్రీరాముని చెప్పిన మాటలు ఇవి. అంటే, దోషం సీతాదేవిలో లేదు, రాముడిలో మాత్రమే ఉంది. అది కూడా దోషం కాదు, ప్రజలకు కట్టుబడిన ఒక రాజు చేయవలసినటువంటి కర్తవ్యం. ఇవి ఈ మాటలకు అర్థం. రాముడు మాట్లాడినటువంటి ఈ కఠినమైన మాటలు, సీతాదేవిని స్వీకరించకపోవడం, ఈ సంఘటనల మధ్య సీతాదేవి విపరీతమైన దుఃఖానికి గురై, మరణించడానికి అగ్నిలో ప్రవేశిస్తుంది. జరిగిన కథ ఇది. అంతేగాని, మనకు సినిమాలలో చూపించిన విధంగా అగ్నిపరీక్ష, అగ్నిలోనుండి నడుచుకు వచ్చింది కాబట్టి సీతాదేవి ఎటువంటి కల్మషం లేనటువంటిది, ఇవన్నీ కూడా సినిమాటిక్ నేరేషన్స్. జరిగిన కథ ఈ రెండు శ్లోకాల మధ్య ఉంటుంది. బయటకు కనిపించేటటువంటి సీతాదేవి అగ్ని ప్రవేశం, బయటకు కనిపించినటువంటి సీతారాముడికి, మరియు, రాజా రాముడికి మధ్య జరిగినటువంటి సంఘర్షణ, ఈ సంఘటనలో సీతారాములు ఇద్దరు కూడా ఎంతో కష్టాన్ని అనుభవించారు. ఈ సంఘటన ఏమీ కూడా రాముడి వ్యక్తిత్వాన్ని తక్కువ చేసే విధంగా ఉండదు. , అర్థం చేసుకోవడంలో మన పొరపాటు తప్ప.

ఇప్పుడు, ఇక, ఈ వాల్మీకి రచించినటువంటి ఉత్తరకాండలో ఉన్న మూడు అభ్యంతరకరమైనటువంటి సంఘటనలకు వస్తే, మొదటిది సీతాపరిత్యాగం. ఉత్తరకాండలో 43వ సర్గను కనుక మనం చదివితే, అయోధ్యా ప్రజలు సీతాదేవి గురించి ఎంత దారుణంగా, ఎంత ఘోరంగా

మాట్లాడుతున్నారు అన్న ఈ విషయాలన్నీ ఉంటాయి. సీతాదేవిని అపహరించేటప్పుడు, రావణాసురుడు బలవంతంగా సీతాదేవిని తన తొడపై కూర్చోబెట్టుకొని, అపహరించినటువంటి ఆ సీతాదేవిని శ్రీరాముడు తన భార్యగా ఏ విధంగా స్వీకరించాడు? వాళ్ళిద్దరూ ఎలా సంతోషంగా కలిసి ఉండగలుగుతున్నారు? అని ఇంత లోకువగా అయోధ్యా ప్రజలు మాట్లాడుకోవడం జరుగుతుంది. ఉత్తరకాండ 43వ సర్గలో ఈ శ్లోకాలు అన్నీ ఉన్నాయి.

మళ్లీ అదే సంఘర్షణ. రాజారాముడా? సీతారాముడా? వీళ్లిద్దరి మధ్యన కూడా రాముడు తీసుకున్న ఆ నిర్ణయం రాజా రాముడు గెలవాలి అంటే– సీతారాముడు ఓడిపోవాలి. తన శత్రువులే "రామో విగ్రహవాన్ ధర్మః "అన్న శ్రీరాముడు రాజుగా తన ధర్మాన్ని నిర్వర్తించడం కోసం సీతాదేవిని అడవులకు పంపడం జరిగింది రాముడు పడినటువంటి సంఘర్షణ, కష్టం ఎంతైతే ఉందో ఉత్తరకాండ 43వ సర్గ చదివితే అర్థమవుతుంది నేను అదే చెప్పాను కదా ఎమోషన్స్ అండ్, ఎథిక్స్, ఈ రెండిటిని కలిపి చూడడం కష్టం. మహాభారతం చూస్తే, చిన్నప్పటినుండి ఎత్తుకొని పెంచినటువంటి తాతమీదే బాణాలు వేసి చంపమని చెప్పాడు, శ్రీకృష్ణుడు, ధర్మం కోసం. అదే కృష్ణుడు రాముడిగా రాజధర్మం కోసం రాజారాముడిగా గెలిచి సీతారాముడుగా ఓడిపోయాడు. ఈ సంఘటన కూడా రాముడి వ్యక్తిత్వాన్ని తక్కువ చేసే విధంగా లేదు. అర్థం చేసుకోవడంలోని పొరపాటు తప్పు. మనం సరిగా అర్థం చేసుకోక ఉత్తర రామాయణాన్ని దూరంగా పెట్టడం మూర్ఖత్వం.

ఉత్తర రామాయణంలో మరొక అత్యంత అభ్యంతరకరమైనటువంటి సంఘటన– లక్ష్మణుడి మరణానికి శ్రీరాముడు కారణం కావడం ఉత్తరకాండ చివరకు వచ్చేసరికి, 103, 104 సర్గలలో, రాముని కలవడానికి, ఒక వ్యక్తి రహస్యంగా రాముడితో మాట్లాడడానికి వస్తాడు. ఆ వ్యక్తితో ఒక రహస్య సంభాషణ చేయవలసినటువంటి రాముడు, తలుపులు మూసి తలుపులు దగ్గర ఒక లక్ష్మణుని కాపలా పెడతాడు. "లక్ష్మణా! నేను ఒక వ్యక్తితో రహస్యసంభాషణలో ఉన్నాను. ఎట్టి పరిస్థితుల్లో ఎవ్వరిని కూడా ఈ తలుపు దాటి లోపలకు రానివ్వద్దు. ఒకవేళ ఎవరైనా అలా వస్తే కనుక, మరణ దండన విదింపబడుతుంది" అని రాముడు లక్ష్మణులకు ఆజ్ఞ ఇచ్చి, రాముడు ఆ రహస్య వ్యక్తితో ఒక రహస్య సంభాషణలో ఉంటాడు. కొన్ని అనుకోని పరిస్థితుల వలన లక్ష్మణుడే ఆ తలుపులు తెరచి, వాళ్ళ సంభాషణకు అంతరాయం కలిగించే పరిస్థితి వస్తుంది. అంటే, ఇక్కడ రాముడు ఇచ్చినటువంటి ఆ మరణ దండన ఆజ్ఞ అమలు చేయవలసినటువంటి లక్ష్మణుడే, ఆ ఆజ్ఞను తప్పడం వలన, ఆ మరణ దండన లక్ష్మణుడికే విధించవలసినటువంటి పరిస్థితి వస్తుంది. ఆ మరణ దండన లక్ష్మణుడికే విధించవలసినటువంటి పరిస్థితి రావడం చూసి, రాముడు నిర్ఘాంత పోయి, మౌనంగా కూర్చుండి పోతాడు. ధర్మం కోసమే బతికినటువంటి తన అన్న అయిన రాముని మాటను నిలబెట్టడం కోసం లక్ష్మణుడు రాముడి పాదాలకు నమస్కరించి, దూరంగా వెళ్లి, మరణశిక్షను తనకు తానే విధించుకుంటాడు. ఈ విధంగా లక్ష్మణుడి మరణానికి పరోక్షంగా శ్రీరాముడే కారణం అవుతాడు.

చాలామందికి ఇది కొంచెం అభ్యంతరకరంగాను, మళ్ళీ రాముడి వ్యక్తిత్వాన్ని తక్కువైపోతుందేమో! అన్న ఒక భ్రమలోను ఉత్తరకాండను దూరం పెడుతూ ఉంటారు. ఏం జరిగినా, ఎంత కష్టం వచ్చినా, ఎవ్వరు ఉన్నా, ఎవ్వరు పోయినా, ఎటువంటి పరిస్థితుల్లో ఉన్నా, రాముడు ఎప్పుడు కూడా ధర్మానికి కట్టుబడి ఉన్నాడు. అటువంటి సందర్భాలలో ఒక పతాక సందర్భం శ్రీరాముడి మాటకు కట్టుబడి లక్ష్మణుడు తన ప్రాణాలను వదిలేయడం. ఇది అర్థం చేసుకోవడంలో మన పొరపాటు ఉండొచ్చేమో! గాని, ఉత్తరకాండలో ఎటువంటి పొరపాట్లు లేవు.

ఉత్తరకాండ గురించి ఐదవది, ఆఖరిది అతి అభ్యంతరకరమైనది, నూటికి 90 మంది ఉత్తరకాండ ప్రక్షిప్తం అనడానికి కారణమైనటువంటిది శంబూకవధ. ఈ శంబూక వధ ఒక్క సారాంశం ఏమిటంటే, ఉత్తరకాండలో ఇది ఒక సంఘటన. శ్రీరామరాజ్యంలో ఒక బ్రాహ్మణ బాలుడు అకారణంగా మరణిస్తాడు. ఆ బ్రాహ్మణుడు తన కుమారుడు ఇలా మరణించాడు అన్న విషయాన్ని రాముడి దగ్గరకు మొరపెట్టుకుందామని వచ్చినప్పుడు, నారద మహర్షి శ్రీరాముడితో చెప్తారు. "నీ రాజ్యంలో ఎవరో చేయకూడని తపస్సును చేస్తున్నారు. ఆ చేయకూడనటువంటి, చేయకూడనటువంటి తపస్సు వలన అకాల మరణం వచ్చి, ఈ బాలుడు చనిపోయాడు. నువ్వు వెళ్లి ఈ తప్పుని సరిచేయి" అని నారద మహర్షి శ్రీరాముడికి చెప్తారు. అప్పుడు శ్రీరాముడు, అసలు ఎక్కడ ఎవరు చేయకూడనటువంటి తపస్సు తన రాజ్యంలో చేస్తున్నారా! అని వెతకడానికి వెళ్తాడు. అలా వెళ్ళినప్పుడు, తలక్రిందులుగా వేలాడుతూ, ఒక శూద్రుడు, శంబూకుడు

అనే శూద్రుడు, తపస్సు చేస్తూ కనిపిస్తాడు. అలా తపస్సు చేస్తున్న శంబూకుని రాముడు శిరచ్ఛేదం చేసి చంపేస్తాడు. ఎందుకంటే, శూద్రుడై చేయకూడనటువంటి తపస్సు చేస్తున్నాడు కాబట్టి. ఈ సంఘటనను పట్టుకొని, ఇది ఒక కులవివక్షగా, కొంతమంది రాముడు అలా శూద్రుని ఎందుకు చంపేస్తాడు? అని మరి కొంతమంది, అయితే ఉత్తరకాండని వాళ్ళ మతపరమైనటువంటి ప్రచారాల కోసం ఉత్తరకాండను వాడుకుంటున్నారు, కొంతమంది. మతమార్పిడుల కోసం, ముఖ్యంగా. లేదా, ఇటు పండితులు అయినవాళ్లు కూడా కొంతమంది, రాముడలా శంబుకున్ని ఎందుకు చంపేస్తాడు? ఇదంతా ప్రక్షిప్తం –అని ఉత్తరకాండను కొట్టి పారేస్తున్నారు, మరికొంతమంది. అసలు జరిగిన విషయమేంటి? ఉత్తరకాండలో ఉన్న వివరాలేంటి? వీటితో ఎవరు సంబంధం లేకుండా, వాళ్ళ యొక్క వ్యక్తిగత అభిప్రాయాలను, అదిగో రాముడు శూద్రుణ్ణి చంపేశాడు. అలా రాముడు చంపుతాడా? చంపడా? అని వాళ్ళ యొక్క వ్యక్తిగత అభిప్రాయాలు బట్టి వెళ్ళిపోతున్నారు. అయితే, అసలు ఉత్తరకాండలో ఏముందో చదివితే కనుక, మైండ్ బ్లాక్ అయిపోతుంది.

ఉత్తరకాండ, 74వ సర్గ 27వ శ్లోకం, శంబూకవధ ఘట్టానికి మొత్తానికి కీలకమైన శ్లోకం. ఈ శ్లోకాన్ని నారద మహర్షి చెబుతున్నారు. ఏమని అంటే, శ్రీరామా! ఈ యుగంలో, ఆంటే త్రేతాయుగంలో శూద్రులైనవారు తపస్సు చేయడమనేది ఆధర్మం. కలియుగంలో, శూద్రులు తపస్సు చేయడం అనేది ధర్మబద్ధమే. ఈ శ్లోకం తెలుగులోనే ఉంది. కావాలంటే చదివి చూడండి. "రాజులలో శ్రేష్ఠుడవైన రామా!

శూద్రుడు తపస్సు చేయకూడదు. కానీ, కలియుగంలో శూద్రునికి కూడా తపస్సు చేయుట ఉండగలదు. ఆ యుగ ధర్మాన్ని అనుసరించి, శూద్రుడైన శంబూకుడు త్రేతాయుగంలో తపస్సు చేయడమనేది అధర్మకరమైనటువంటి విషయం. కాని, ఈ యుగంలో, కలియుగంలో, శూద్రులు కూడా కూడా తపస్సు చేయవచ్చు. –అని స్పష్టంగా ఉత్తరకాండ చెప్తుంది. ఒకటి మనం చూడాలి. ఇది ప్రక్షిప్తమా కాదా? అంటే, బ్రాహ్మణులైనవారు శూద్రులపై, తక్కువ కులంవారిపై ఆధిపత్యం కోసం ఈ శ్లోకాన్ని చేర్చారు, అని అనుకుందాం. అనుకుంటే, కలియుగంలో శూద్రులుగా తపస్సు చేయవచ్చు– అని ఎందుకు రాసుకుంటారు? నిజంగా బ్రాహ్మణులైనవారు వాళ్ళ కులాధిపత్యం కోసం ఈ శ్లోకాన్ని ప్రక్షిప్తంగా చేరిస్తే కనుక, ఏమని రాసుకొని ఉండి ఉండాలి? బ్రాహ్మణులకు మాత్రమే తపస్సు అధికారం కలదు, శూద్రులైనవారు తపస్సు చేయకూడదు– అని రాసి ఉండాలి, ప్రక్షిప్తం అని అనుకుంటే. కానీ, ఇక్కడ ఏమని ఏమన్నది? శ్లోకంలో చాలా స్పష్టంగా యుగంలో శూద్రులు చేయకూడదు. కలియుగంలో శూద్రులు కూడా తపస్సు చేయవచ్చు –అని చాలా స్పష్టంగా ఉంది. అందువల్ల ఇది ఖచ్చితంగా ప్రక్షిప్తం అయితే కాదు. రెండవది, అసలు ఈ శ్లోకాన్ని దాచి పెట్టేసి, రాముడు శూద్రుడిని చంపేశాడు. శూద్రుల పట్ల రామాయణ కాలంనుండి కూడా వివక్ష ఉంది– అని ఈ శ్లోకాన్ని వక్రీకరించి, రామాయణానికి వ్యతిరేకంగా ప్రజలను తయారు చేసేటువంటి ఈ మతమతమార్పిడి బృందాలు ఎవరైతే ఉన్నారో, రామాయణాన్ని ప్రజలకు వ్యతిరేకంగా

తయారు చేసేటువంటి వక్రీకరణలో ఈ శంబూక వధను వక్రీకరించి వాడడం జరుగుతున్నది. అసలు జరిగింది ఇది. ఇక, రెండవ విషయం ఏంటంటే, రామాయణంలో రచింపబడినటువంటి శంబూకవధ, ఇటువంటి సంఘటనలు అడ్డుపెట్టుకొని, కులవివక్షకూడా విపరీతంగా మనకు ఇప్పటికీ ఉంది. ఈ మాట నేను చెప్పడం లేదు అన్నమయ్య రాశారు. "మెండయిన బ్రాహ్మణుడు మెట్టు భూమి ఒకటే, జఛండాలుడుండేటి సరి భూమి ఒకటే "అని. ఒకసారి విషయానికి వస్తే, ఉత్తరకాండలో శంబూకవధలో ఎటువంటి దోషం లేదు. రాముడు నారద మహర్షి చెప్పినటువంటి ధర్మానికి కట్టుబడే శంబూకుని వధించడం జరిగింది. ఈ విషయాలు ఏవీ తెలియకుండా, కేవలం, అదేదో ఒక కుల వివక్షకు సంబంధించినటువంటి సంఘటనగా చిత్రీకరించడం రామాయణాన్ని వక్రీకరించడం అవుతుంది.

ఇది, ఉత్తర రామాయణం నిజమా? లేక, కల్పితమా? అన్న ఈ విషయంపై నేను చేసినటువంటి రీసెర్చ్ బేస్డ్ డాక్యుమెంటరీ. ఎంత లోతుగా పరిశీలించి, పరిశోధించి చూసినా, ఉత్తర రామాయణం అనేది శ్రీరామాయణంలో అంతర్భాగమే. అందులో ఎటువంటి ప్రశ్న, ఎటువంటి సందేహం లేదు. అయితే, ఉత్తర రామాయణంలో ప్రక్షిప్తాలు వచ్చి చేరాయా? లేదా? అన్న ఆ విషయానికి మాత్రం సమాధానం లేదు. ఏది ఏమైనాప్పటికీ, ఆరు, ఒకటి, ఏడు కాండల శ్రీరామాయణం తెలుగు ప్రజలకే కాకుండా, భారతదేశం మొత్తానికి కూడా, కొన్ని వందల వేల సంవత్సరాలుగా, దార్శనికంగా, ఒక వెన్నెముకగా నిలబడి వస్తూనే

ఉంది. ఎన్ని సంవత్సరాలు అయినా సరే, శ్రీరామాయణం ఉత్తరకాండ సహితంగా, మన అందరికి ఆదర్శప్రాయంగా, దిక్సూచిగా ఎప్పటికీ నిలిచే ఉంటుంది. జైహింద్. జై శ్రీరామ్.

# పరమవీరచక్ర వైదిక చరిత్ర

"పరమవీరచక్ర" భారతదేశ రక్షణార్థం యుద్ధంలో అనిర్వచనీయమైన ధైర్యాన్ని, సాహసాన్ని, త్యాగాన్ని ప్రదర్శించిన సైనికులను భారత ప్రభుత్వం సత్కరించే సర్వోన్నత పురస్కారం, —ఈ పరమవీరచక్ర. మనలో చాలా మంది ఈ గౌరవ పురస్కారాన్ని గురించి విన్నప్పటికీ, అసలు ఈ పరమవీర చక్రయొక్క ఆకృతి, డిజైన్, ఎందుకు ఈ విధంగా చేయబడింది? అసలు ఈ పరమవీరచక్ర యొక్క అర్థం ఏమిటి? అన్న విషయం మాత్రం మనలో చాలా కొద్దిమంది మాత్రమే తెలుసు. ఈ పరమవీర చక్ర గురించి అందరికీ సులభంగా అర్థమవాలనే ఈ చిన్న ప్రయత్నం. ముందుగా, మనం పరమవీర చక్రం యొక్క ఆకృతి గురించి తెలుసుకొందాం.

భారతీయ నౌకాదళం యొక్క వెబ్సైట్లో కనుక మనం ఈ పరమ వీర చక్ర యొక్క డిజైన్ గురించి చదివితే, ఈ ఏవిధంగా రాసుంది. స్పష్టంగా ఇక్కడ ఇండియన్ నేవీ వెబ్సైట్లో మనకు అర్థం అవుతుంది ఏంటంటే, "పరమవీర చక్ర మీద ఇంద్రదేవుని వజ్రాయుధం నాలుగు సార్లు చెక్కబడి ఉంది. " అని అక్కడ రాసి ఉంది. ఎందుకని ఇంద్రదేవుని వజ్రాయుధాన్ని మాత్రమే ఇక్కడ చెక్కడం జరిగింది? ఇది. పరమవీర చక్రకు సంబంధించినంత వరకు, అన్నిటికంటే ముఖ్యమైన ప్రశ్న.

పరమవీరచక్ర మనకు అర్థం కావాలంటే, దధీచి మహర్షి జీవిత చరిత్ర మనకు అర్థం కావాలి. దధీచి మహర్షి, బ్రహ్మ మానస పుత్రుడైన కర్దమ ప్రజాపతి వంశంలో జన్మించిన ఒక గొప్ప యోగి. నాలుగు

వేదాలలోను, అన్నిటికంటే పురాతనమైనటువంటి ఋగ్వేదంలో కూడా, దధీచి మహర్షి యొక్క ప్రస్తావన చాలా విపులంగా ఉంది. దధీచి మహర్షి సరస్వతీ నదీ తీరాన జీవించేవారని, సరస్వతి నది పరివాహక ప్రాంతాల్లో ఆయన ఆశ్రమం ఉండేదని ఋగ్వేదం మరియు, ఇతర పురాణాలద్వారా అర్థమవుతుంది. అయితే ప్రస్తుత పరిశోధన పరిజ్ఞానానుసారం సరస్వతి నది, కనీసంలో కనీసం, 20వేల సంవత్సరాల క్రితమే అంతరించిపోయిందని మనకు అర్థమవుతుంది. ఋగ్వేదంలో విశేషంగా సరస్వతి నది యొక్క ప్రస్తావన, కొన్ని వందల వేల ఏళ్ళ క్రితమే అంతరించిపోయిన సరస్వతీ నది యొక్క చరిత్ర వీటన్నిటినీ పరిశీలిస్తే, దధీచి మహర్షి ఏనాటివారనేది మనకు ఒక చిన్న అవగాహన వచ్చే అవకాశం ఉంది.

మన పురాణాల్లో, ధర్మానికి అధర్మానికి జరిగే యుద్ధాలను వివరించే దేవాసుర సంగ్రామ సందర్భాలు ఎన్నో ఉన్నాయి. అలాంటి ఒకానొక సందర్భంలో, వృత్రాసురుడు అనే ఒక రాక్షస రాజు ఈ ప్రపంచంలో ఉన్న అందర్నీ, అన్నింటినీ హింసిస్తున్న సందర్భాలు అవి. అలా జరుగుతున్న దేవాసుర యుద్ధంలో, ఇంద్రుడు వృత్రాసురునితో తలపడి యుద్ధం చేసి, అత్యంత శక్తివంతుడైన వృత్రాసురుని ముందు నిలువలేక ఓడిపోయి, ఇంద్రుడు వెనక్కి తిరుగుతాడు. ఇంద్రుని, ఇంద్రుడితో పాటు దేవగణాలన్నింటినీ ఎంతో సునాయాసంగా ఓడించి, దేవతలను, ఈ సృష్టిలో ఉన్న అందర్నీ, అన్నింటిని అధర్మాత్మకంగా హింసిస్తూ ఉంటాడు. వృత్రాసురుడు. అతనిని జయించి, తిరిగి

ధర్మసంస్థాపన చేయాలని ఇంద్రుడు, దేవగణాలు శ్రీమహావిష్ణువుని ప్రార్థించి శరణు కోరారు. అయితే, శ్రీమహావిష్ణువు, వృత్రాసురుడు తన భక్తుడు కావడంతో, శ్రీమహావిష్ణువు నేరుగా వృత్రాసరుని సంహరించలేనని, కానీ, అధర్మాన ఉన్న వృత్తాసురుడు మరణించక తప్పదు కాబట్టి, దేవతలను దధీచి మహర్షి శరణు కోరమని శ్రీమహావిష్ణువు ఉపాయాన్ని చెబుతారు.

దధీచిమహర్షి, వేరువేరు సందర్భాలలో, శ్రీమహావిష్ణువు మరియు పరమేశ్వరుడు యొక్క ప్రసాదితంగా అపారమైన తపోశక్తిని, మరియు స్వచ్ఛంద మరణాన్ని వరంగా కలిగి ఉంటారు. ఆ విధంగా నైమిశారణ్యంలో తపస్సులో ఉండే దదీచి మహర్షి దగ్గరకు ఇంద్రుడు, మరియు దేవగణాలు సహాయార్థం శరణు కోరి వచ్చి, వృత్రాసురుని వధించడానికి దధీచి మహర్షి సహాయం కావాలని ప్రార్థించారు. దధీచి మహర్షి, తాను వృత్రాసురుని వధలో, ఇంద్రునకు, దేవగణాలకు ఏ విధంగా సహాయ పడగలను? అని అడుగగా, ఇంద్రుడు శ్రీమహావిష్ణువు చెప్పిన ఉపాయాన్ని ధధీచి మహర్షికి వివరిస్తాడు. దధీచిమహర్షి యొక్క వెన్నెముక, మరియు అస్థికలతో తయారు చేయబడినటువంటి ఒకదివ్యాయుధంతో మాత్రమే వృత్తాసురుని సంహరించడం సంభవమని, అందుకని, ఇంద్రుడు మరియు దేవగణాలు దధీచి మహర్షి ఎముకలను, వెన్నెముకను తమకు ఇవ్వాలని ప్రార్థిస్తారు. "పరోపకారార్థమిదం శరీరమ్ " అన్న దధీచి మహర్షి సంతోషంగా, స్వచ్ఛందంగా తన శరీరాన్ని బిక్షగా దేవతలకు దానం చేస్తారు. " లోకా సమస్తా సుఖినో భవంతు" అని శరీర

త్యాగం చేసిన దధీచి మహర్షి యొక్క అస్థికలను విశ్వకర్మ అత్యంతశక్తివంతమైన, భయంకరమైన ఒక ఆయుధంగా మలుస్తారు. అదే వజ్రాయుధం. శివకేశవానుగ్రహ శక్తి కలిగిన దధీచి మహర్షి యొక్క శరీరంనుండి వెలువడిన ఈ వజ్రాయుధాన్ని ధరించి, ఇంద్రుడు వృత్రాసురవధకై యుద్ధానికి బయలుదేరుతాడు. వృత్తాసురుడికి, ఇంద్రుడికి జరిగిన యుద్ధంలో, అత్యంత శక్తివంతమైన వజ్రాయుధంతో పోరాడలేక, ఆ వజ్రాయుధ శక్తికి వృత్తాసురుడు మరణిస్తాడు.

మన పురాణ ఇతిహాసాలలో ఉన్న అస్త్రశస్త్రాలన్నిటిలోకల్లా అత్యంత శక్తివంతమైనటువంటి ఆయుధాలలో వజ్రాయుధం ఒకటి. అందుకు కారణం దధీచి మహర్షి యొక్క శక్తి. పదిమంది బావుండాలని ప్రాణత్యాగం చేసినవారిలో, బహుశా, మన పురాణ ఇతిహాసాలలో మొట్టమొదట ఉండే పేరు దధీచి మహర్షిది అయి ఉంటుంది.

ఏ స్ఫూర్తితో అయితే దధీచి మహర్షి తన ప్రాణత్యాగం చేశారో, అదే స్ఫూర్తితో, భారతదేశ రక్షణార్థం యుద్ధంలో తమ ప్రాణాలను సైతం లెక్క చేయకుండా తమ జీవితాలను భారతదేశ రక్షణార్థం అంకితం చేసినటువంటి సైనికులను దధీచి మహర్షి అస్థికలతో తయారు చేయబడినటువంటి ఇంద్రుడి వజ్రాయుధంతో చెక్కబడిన పరమ వీరచక్రను అలంకరించడం జరుగుతుంది. అంతేకాకుండా, 1988లో దధీచిమహర్షి పేరుతో ఇండియన్ గవర్నమెంట్ ఒక పోస్టల్ స్టాంపును విడుదల చేయడం కూడా జరిగింది.

అయితే, ఇంద్రుడి వజ్రాయుధం ఈ విధంగా ఉంటుంది– అని పరమవీరచక్ర మీద మనం ఎలా చెక్కుతున్నాము? దేని ఆధారంగా చెక్కుతున్నాం? అది కూడా ఒకసారి చూద్దాం.

ఇంద్రుడి వజ్రాయుధం యొక్క వివరణ మనకు వేదాల్లో, పురాణాల్లో ఉన్నప్పటికీ, చాలా సులువుగా మనకి అర్థమయ్యే విధంగా ఒక విగ్రహం ద్వారా మనం తెలుసుకోవచ్చు. సుమారు 1200 సంవత్సరాల క్రితం చెక్కబడినటువంటి ఇంద్రుడి విగ్రహం ఏదైతే ఉందో, అది ప్రస్తుతం అమెరికాలో మెట్రోపాలిటన్ మ్యూజియంలో భద్రపరచబడి ఉంది. డిఫరెంట్ యాంగిల్స్ లో ఈ ఇంద్రుడు విగ్రహాన్ని చాలా జాగ్రత్తగా గమనిస్తే, నాలుగు భుజాలతో, పక్కన ఒక చిన్న ఏనుగు ఐరావతంతో ఉన్న ఈ ఇంద్రుడు కుడి చేతిలో ధరించినదే వజ్రాయుధం. చూడటానికి సుమారుగా ఒక చిన్న త్రిశూలంలాఇది కనిపిస్తుంది. ఇది మనకు చాలా స్పష్టంగా, పురాతన కాలంలో ఇంద్రుడి వజ్రాయుధం ఏ విధంగా పురాణ ఇతిహాసాల్లో చెప్పబడి ఉన్నదో, ఆ విధంగా తయారు చేయబడినటువంటి, ఈ పన్నెండు వందల సంవత్సరాల పురాతనమైన ఈ ఇంద్రుడి విగ్రహం ద్వారా మనకు స్పష్టంగా తెలుస్తుంది. ఈ విగ్రహంలో ఉన్న ఇంద్రుడి వజ్రాయుధాన్ని పరమవీర్ చక్రతో పోల్చి చూస్తే, మనకు చాలా స్పష్టంగా అర్థమవుతుంది, ఎందుకు? ఏ విధంగా పరమవీర చక్రయొక్క డిజైన్ ఈరోజు ఇలా ఉంది అన్నది. మరొక పెద్ద దురదృష్టం ఏంటంటే, భారతదేశ సంపద అయినటువంటి ఇటువంటి పురాతన విగ్రహాలు పాశ్చాత్య దేశ మ్యూజియాలలో ఈరోజు మనం చూడవలసి

వస్తుంది. అయితే, మనకెలాగో, మన చరిత్ర మీద, మన పురాతన సంపద మీద శ్రద్ధ ఎలాగో లేదు. కాబట్టి ఇది మన దగ్గర ఉండటం కంటే, వెస్ట్రన్ కంట్రీస్ మ్యూజియంలో ఉండడం ఎంతో మేలు.

ఋగ్వేదం, మరియు ఇతర పురాణాల్లో చెప్పబడినటువంటి దధీచిమహర్షి జీవిత చరిత్రానుసారంగా రూపొందించబడిందే ఈ పరమవీర చక్ర. భారతదేశ రక్షణ కోసం తమ ప్రాణాలను సైతం త్యాగం చేసిన ప్రతి సైనికుడు దధీచి మహర్షి యొక్క స్వరూపమే– అని భారత ప్రభుత్వం సమర్పించే గౌరవ పురస్కారమే ఈ పరమవీర చక్ర. ఇది పరమ వీరచక్ర యొక్క వైదిక చరిత్ర. కేవలం యుద్ధంలో ప్రాణాలు కోల్పోయిన సైనికులే కాకుండా, సైన్యం దగ్గర నుంచి మొదలుకొని, పోలీసుసిబ్బంది వరకు, పదిమంది బాగుండాలని తమ ప్రాణాలను సైతం లెక్కచేయకుండా, కర్తవ్యాన్ని నిర్వహించే ప్రతి ఒక్కరు దధీచి మహర్షి యొక్క స్వరూపమే. వేద పురాణ ఇతిహాసాలు అంటే అవేవో మతపరమైనటువంటి గ్రంథాలనుకోవడం మూర్ఖత్వం. ఇది ఈ దేశ చరిత్ర. ఇది పరమవీరచక్ర యొక్క వైదిక చరిత్ర.

# రామసేతు

(యూట్యూబ్ ఇన్ఫర్మేషన్ ద్వారా సేకరించినది)

రామసేతు. ఈ పేరు వినగానే మనకు రామాయణంలోని యుద్ధకాండ గుర్తుకు వస్తుంది సీతను కాపాడుకోవడంకోసం రాముడు సముద్ర మార్గం ద్వారా లంకకు వెళ్ళి, రావణుని సంహరించి, సీతను దక్కించుకుంటాడు– అని రామాయణం ద్వారా మనకు తెలుస్తుంది. అయితే, వాస్తవానికి రామాయణం మీద, రామసేతు నిర్మాణంపై అనేక విమర్శలు ఉన్నాయి. అసలు రామాయణం నిజం కాదు అని, రామసేతుగా పిలవబడుతున్న నిర్మాణం ప్రకృతి సిద్ధంగా ఏర్పడింది అని గత భారత ప్రభుత్వాలే ఎన్నో వాదనలు చేశాయి. మరి, రామసేతు నిర్మాణం నిజమా? రామసేతు నిర్మాణం పై ఎటువంటి రాజకీయాలు నడిచాయి? అసలు వాల్మీకి రామాయణం నిజంగా జరిగిందా? లేదా? తాజా పరిశోధనలు ఈ సందేహాలపై ఎటువంటి క్లారిటీ ఇచ్చాయి? అనే విషయాల్లో నేను మీకు ఈ వీడియో ద్వారా వాస్తవాలతో సహా ఈ వీడియో చూపించబోతున్నాను.

మిత్రులారా! అసలు రామసేతు వాస్తవాలను తెలుసుకునే ముందు, రామాయణంప్రకారం నిర్మాణం ఎలా జరిగిందో, ఒక్కసారి చూద్దాం. వనవాసంలో భాగంగా సీత కోరిక మేరకు మాయలేడిని తీసుకొని వచ్చేందుకు రాముడు వెళ్ళగా, అతడు ఎంతకీ రాకపోవడంతో, సీతకు తోడుగా ఉన్న లక్ష్మణుడు రాముని వెతుకుతూ వెళ్తాడు. సరిగ్గా, ఆ సమయంలోనే పథకం పన్నిన రావణాసురుడు సన్యాసి రూపంలో

వచ్చి, సీతను ఎత్తుకొని వెళ్లి తన రాజ్యమైన లంకలో అశోక వనంలో బానిసగా ఉంచుతాడు. ఇక, ఆ విషయాన్ని హనుమంతుడి ద్వారా తెలుసుకున్న శ్రీరాముడు రావణాసురుని సంహరించి సీతను తీసుకుని వచ్చేందుకు బయలుదేరతాడు కొంత దూరం ప్రయాణించాక, లంకలో ప్రవేశించడానికి ముందు మధ్యలో ఒక సముద్రం అడ్డుగా ఉంటుంది.

సముద్రుని దాటేందుకు దీక్ష చేసిన రాముని సముద్రుడు ఎంతకీ కరుణించకపోవడంతో, కోపగించుకొన్న రాముడు రామబాణాన్ని ప్రయోగించి సముద్రంలో నీటిని ఆవిరి చేసి ఆ మార్గం గుండా వెళ్లేందుకు ప్రయత్నిస్తుండగా, ఆ విషయం తెలుసుకున్న సముద్రుడు ప్రత్యక్షమై, " స్వామీ!, నా ధర్మం నేను నిర్వర్తిస్తున్నా ఆ విషయం మీకు తెలుసుకదా. "అని వానరసేనతో సముద్ర మార్గాన్ని ఏర్పరిచేందుకు తగిన ఉపాయం చెప్పడంతో, వెంటనే రామునితో పాటు ఉన్న వానరసైన్యం ఆ పక్కనే ఉన్న బండరాళ్లను తీసుకుని వచ్చి, కొన్ని రోజులు కష్టపడి, 30 మైళ్ల పొడుగు కల, సముద్రం గుండా లంక వరకు మార్గాన్ని ఏర్పాటు చేస్తారు. ఇక్కడ విచిత్రం ఏమంటే, ఆ బండరాళ్లు నీటిలో మునగకుండా నీటిపై తేలి ఆడుతూ ఉంటాయి. అలా, ఆ విధంగా సముద్ర మార్గం గుండా శ్రీరాముడు ఏర్పరచుకున్న దారిని రామసేతు అని అంటారు. సేతు అనగా వారధి అని అర్థం. ఇది రామాయణం ప్రకారం రామసేతు ఏర్పడడానికి అసలు కారణం.

అయితే, ఈ నిర్మాణం జరిగి సుమారు 17 లక్షల సంవత్సరాలు అవుతూ ఉండడంతో, రామసేతు నిర్మాణం నిజంగానే జరిగింది– అని

చెప్పడానికి తగిన ఆధారాలు లేకపోవడంతో, అసలు రామసేతువే కాదు కదా, రామాయణమే జరగలేదు. చరిత్రలో లిఖించబడ్డ వాల్మీకి రామాయణం వట్టి బూటకమని ఆరోపణలు ఆ తర్వాత కాలంలో తీవ్రంగా వ్యాపించాయి. అయితే 2005వ సంవత్సరంలో అధికారంలో ఉన్న సోనియాగాంధీ ప్రభుత్వం శ్రీలంకతో ప్రయాణ దూరాన్ని తగ్గించి, వ్యాపారం వృద్ధి చేయాలనే సంకల్పంతో, రామసేతు మార్గాన్ని చీల్చివేసి, నౌకాయాన మార్గాన్ని ఏర్పాటు చేయాలని సంకల్పించింది. ఆ నేపథ్యంలోనే రామసేతుపై వివాదాస్పద వ్యాఖ్యలు చేస్తూ, అసలు రామసేతు అనేది మానవ నిర్మితం కాదని, ప్రకృతి సిద్ధంగా ఏర్పడిందే అని ఆర్కియాలాజికల్ సర్వే ఆఫ్ ఇండియాతో కలిసి ప సుప్రీం కోర్టును ఆశ్రయించింది. అయితే, దీనిపై వాదనలు జరుగుతున్న సమయంలోనే, బిజెపి నేత, అలాగే, స్వతహాగా న్యాయవాది అయిన సుబ్రహ్మణ్యం స్వామి కౌంటర్లు దాఖలు చేసి, "అవసరాల కోసం దైవభక్తిని విమర్శించవద్దు" అని అంటూ సుప్రీంతో పోరాడి, వివాదాలు రేపిన వారికి షాక్ ఇచ్చారు. అయితే, అప్పటికీ రామసేతు నిర్మాణం ఒక నమ్మకంగానే తప్ప, నిజమైనదిగా ఆధారాలు లభించకపోవడంతో, ఇండియన్ శాస్త్రవేత్తలు శ్రీలంక, ఇండియా మధ్య ఉన్న రామసేతుపై పరిశోధనలు ఆరంభించి, అనేక పరిశీలనలు చేశారు. కానీ, ఎన్ని ప్రయోగాత్మక పరిశోధనలు చేసినా, సైంటిస్టులకు సరైన ఆధారాలు లభించకపోవడంతో, రామసేతు నిర్మాణంలో స్పష్టత అనేది అపరిష్కృతంగా మిగిలిపోయింది. ఇక లాభం లేదనుకున్న అమెరికన్ పరిశోధన సంస్థ నాసా, రామసేతు నిర్మాణం

సందేహాలకు ఫుల్ స్టాప్ పెట్టేసి, ఆ సముద్ర మార్గం అసలు మానవ నిర్మితమా? లేక, సహజ సిద్ధంగా ఏర్పడిందా? అనే విషయంలో క్లారిటీ ఇచ్చేందుకుగాను రామసేతుపై పరిశోధనలు ముమ్మరం చేసింది. గత కొంత కాలంనుంచి పరిశోధనలు చేసిన అంతర్జాతీయ సంస్థ నాసా పరిశోధనల్లో ఆశ్చర్యకరమైన విషయాలు బయటపడ్డాయి. భారత్ లోని రామేశ్వరం వద్దగల పంబన్ ద్వీపంనుండి శ్రీలంకలో గల మన్నార్ ద్వీపాలను కలుపుతూ నిర్మించబడ్డ రామసేతు అనబడు ఈ 30 మైళ్ళ మార్గం నిజంగా మానవ నిర్మితమేనని, ఇది అసలు సహజసిద్ధంగా ఏర్పడే ఛాన్స్ లేదు, కాకపోతే, వేల సంవత్సరాల నిర్మాణం కావడంతో, సముద్రంలో గల అలజడులు వలన మార్గం చెదిరిపోయి కనిపిస్తూ ఉన్నది తప్ప, మానవ నిర్మితం కాదు– అని చెప్పడంలో వాస్తవం లేదు, ఇది ఖచ్చితంగా రాముని ఆధ్వర్యంలో నిర్మించబడిన నిర్మాణమే అనే విషయంలో ఖచ్చితమైన ఆధారాలతో సమాధానమిచ్చింది. ఈ విషయాలు అమెరికన్ సైన్స్ ఛానల్లో ప్రసారం కావడంతో, వివాదాస్పద వ్యాఖ్యలు చేస్తున్నవారి నోర్లు మూతబడడమే కాకుండా, "రామసేతు మానవ నిర్మితం" అని సపోర్ట్ చేసేవారికి సంతోషాన్ని ఇచ్చాయి. ఇక, ఈ రోజుతో రామసేతు మాత్రమే కాదు, రాముని చరిత్రగా చెప్పబడిన వాల్మీకి రామాయణం నిజం. ఈ భూమిపై రాముని పాలన జరిగిన మాట వాస్తవమేనని తేలడంతో, "జైశ్రీరామ్" అని ఆనంద పారవశ్యంలో మునిగిపోక తప్పదు. ఇది, స్నేహితులారా! రామసేతుకు సంబంధించిన,

అలాగే, రాముని గాథ రామాయణానికి సంబంధించిన నేను మీకు అందిస్తున్న సమాచారం.

# అపూర్వమైన మన ప్రాచీన విజ్ఞానం

యుగయుగాల భారతదేశ చరిత్రలో అడుగడుగునా ఎందరో మహానుభావులు తమ వద్ద ఉన్న విద్యాభాండాగారాన్ని గ్రంథస్థం చేసి, భావితరాలకు అందించారు. పాశ్చాత్య ప్రపంచం ఓనమాలు నేర్చుకుంటున్న సమయంలోనే సమస్త విద్యలపై అధ్యయనం చేసి, అమూల్యమైన విద్యాసంపదను పంచిపెట్టిన కొంతమంది మహా పురుషుల గురించి, వారు రాసిన గ్రంథాల గురించి, ఆ గ్రంథాలలో ఉన్న వెలకట్టలేని విద్య గురించి నేటి సమాజంలోని చాలామందికి తెలియదనే చెప్పాలి. అటువంటివారికి మన మహనీయుల ప్రజ్ఞాపాటవాలను గురించి ప్రస్తావించే ప్రయత్నం ఇది.

వాల్మీకి రామాయణాన్ని, వ్యాసమహర్షి మహాభారతాన్ని రాసినట్లు మనలో చాలామందికి తెలుసు. అయితే, వీరే కాకుండా, ఎందరో విద్యాకుశలలు ఆధునిక విద్యకు కూడా అందనంత రీతిలో మహా గ్రంథాలను రాశారు. వారి వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

వాల్మీకి. ఈ మహానుభావుడి పేరు చెప్పగానే, ఆయన రచించిన రామాయణం గుర్తుకు వస్తుంది. అయితే, ఈయన రామాయణంతోపాటు అక్షర లక్ష అనే ఒక అద్భుతమైన గ్రంథాన్ని మనకందించారనే విషయం ఎంతమందికి తెలుసు? ఈ గ్రంథం అప్పట్లోనే రచించిన ఒక ఎన్సైక్లో పీడియావంటిది. ఈ గ్రంథంలో రేఖాగణితం, బీజగణితం, త్రికోణమితి, భౌతిక గణిత శాస్త్రం మొదలైన 325 రకాల గణిత ప్రక్రియల గురించి, ఇంకా ఖనిజశాస్త్రం, భూగర్భ శాస్త్రం, జల యంత్ర శాస్త్రం, గాలి, విద్యుత్,

ఉష్ణములను కొలిచే పద్ధతులవంటి ఎన్నో విషయాల గురించి విపులంగా వివరించబడింది. ఈ గ్రంథంలోని ఏ ఒక్క శాస్త్రం పైన అయినా పూర్తి అవగాహన తెచ్చుకుంటే, మనం ఆ రంగంలో ప్రపంచ ప్రసిద్ధి చెందడంలో ఎటువంటి సందేహం లేదు.

ఖండిక ఋషి. ఈయన గురించి చాలా తక్కువ మందికే తెలుసని చెప్పాలి. కానీ, ఈయన రచించిన శబ్దశాస్త్రం ఎంతో ప్రఖ్యాతి చెందింది. ఈ గ్రంథంలో సృష్టిలోని అన్ని రకాల ధ్వనులను, ప్రతిధ్వనులను గురించి వివరించారు. ముఖ్యంగా, ఈ గ్రంథంలోని ఐదు అధ్యాయాలు కృత్రిమంగా ధ్వనులు ఎలా సృష్టించడం? వాటి స్థాయి వేగాలు ఎలా కొలవడం? అనే విషయాల గురించి క్షుణ్ణంగా వివరించబడింది.

కశ్యపముని. ఈయన రచించిన శిల్పశాస్త్రం అమోఘం అని చెప్పాలి ఈ శాస్త్రంలో 22 అధ్యాయాలు ఉండగా, వాటిలో 307 రకాల శిల్పాల గురించి, 101 రకాల విగ్రహాల గురించి సంపూర్ణంగా వివరించబడింది. అంతేకాకుండా, ఆలయాలు, రాజభవనాలు, చావడులు మొదలైన అన్ని రకాల నిర్మాణ విషయాలు 1000 కి పైగా ఉన్నాయి. ఈ శాస్త్రంలో విశ్వామిత్రుడు, మయుడు, మారుతి మొదలగు ఋషులు చెప్పిన ఎన్నో విషయాలను కశ్యపముని పొందుపరిచాడు.

సుకేశుడు. మన పురాతన భారతీయులు వండుకునే అన్ని రకాల వంటల గురించి, అవి తినడం వల్ల మానవులకు కలిగే లాభాల గురించి సుకేశముని సూపశాస్త్రాన్ని రచించాడు ఇందులో, ఊరగాయలు, పిండివంటలు, తీపి పదార్థాలు 108 రకాల వ్యంజనాలు మొదలగు అనేక

రకాల వంటకాలతో పాటు, ఆ కాలంలో ప్రపంచవ్యాప్తంగా వాడుకలో ఉన్న 3032 రకాల పదార్థాల తయారీ గురించి చెప్పబడింది.

.

ఋష్యశృంగముని. ఈయన రాసిన మాలినీ శాస్త్రంలో వివిధ రకాల పూల గురించి, ఆ పూలతో అల్లే దండలు, వివిధ రకాల శిరోలంకరణతో పాటు, పూల రేకలపై రహస్య భాషలో సందేశాలు రాసే విధానం గురించి వివరించబడింది ఈ విషయాలన్నీ 16 అధ్యాయాలలో పొందుపరిచాడు.

అశ్వినీ కుమార సహ్. ఈయన లోహ్లపై రాసిన ధాతుశాస్త్రం మహత్తర గ్రంథంగా పేర్కొనవచ్చు. ఈ గ్రంథంలో మొత్తం ఏడు అధ్యాయాలు ఉండగా, వాటిలో లోహ్ల గురించి, కృత్రిమ లోహ్ల తయారీ, లోహ్ల మిశ్రమం వల్ల వచ్చే ఫలితాల గురించి వివరించాడు. ఇదే గ్రంథంలో, రాగిని బంగారంగా ఎలా మార్చాలి? అనే అంశంపై కూడా ఈయన వివరించాడట. కానీ, కాలగమనంలో ఈ గ్రంథానికి సరైన రక్షణ లేక, ఈ విషయాలు చాలా వరకు నాశనమైనాయి. అశ్వినీ కుమారుడు లోహ్ల మీదే కాకుండా, 32 రకాల విషాలు, వాటి గుణాలు, ప్రభావాలు, వాటిని ఉపయోగించే పద్ధతి, పొరపాటున ఆ విషాలు మానవ శరీరంలోకి వెళ్తే, ఆ విషాల విరుగుడు వంటి విషయాలను విషశాస్త్రం అనే గ్రంథంలో స్పష్టంగా రాశాడట.

భీముడు. భీముడి పేరు చెప్పగానే అతని బల పరాక్రమాలు, గదావిద్యా నైపుణ్యం గుర్తుకు వస్తుంది. అయితే, ఆయన గురించి మరో

కోణం చాలా తక్కువ మందికి తెలుసని చెప్పాలి. భీముడు బలంలోనే కాకుండా, చిత్రలేఖనంలో ప్రవీణుడు. ఈయన ప్రావీణ్యం ఎంతటిదంటే, ఒక మనిషి గోరు గాని, తల వెంట్రుక గాని ఎముకను గాని చూసి, ఆ వ్యక్తిలా బొమ్మను గీయగలిగేవాడట. ఈయన ఈ వివరాలతో పాటు, 200 రకాల చిత్రలేఖన ప్రక్రియల గురించి చిత్ర కర్మశాస్త్రం అనే గ్రంథాన్ని కూడా రచించాడు ఈ వివరాలన్నీ 12 అధ్యాయాలలో పొందుపరిచాడు.

మల్లుడు. మల్లుడు మహాబలవంతుడిగా మన పురాణాలు చెబుతున్నాయి. ఈయనతో ముష్టి ఘాతానికి దిగడం అంటే యమపురికి దారి వెతుకున్నట్లే అని మన పూర్వీకులు చెప్పారు. ఈయన వ్యాయామాలు, వాటి వల్ల కలిగే ఉపయోగాలు, అటల వల్ల కలిగే లాభాలు, వట్టి చేతులతో చేసే 24 రకాల పోరాట విద్యల గురించి మల్లశాస్త్రం అనే గ్రంథాన్ని లిఖించాడు.

వాత్సాయన మహాముని. ఈ పేరు వినగానే అందరికీ ఆయన రాసిన కామశాస్త్రం గుర్తుకొస్తుంది. అయితే, ఈయన దానితోపాటు, రత్నపరీక్ష అనే గ్రంథాన్ని కూడా రాశాడు. ఈ శాస్త్రంలో రత్నాలకు ఉన్న 24 లక్షణాలు, వాటి శుద్ధతను పరీక్షించడానికి 32 పద్ధతులు, వాటి బరువు తూచే విధానం, వాటి రూపంవంటి విషయాల గురించి ఈ శాస్త్రంలో పొందుపరిచారు.

వీరబాహువు. ఈయన సుబ్రహ్మణ్యస్వామి శిష్యుడిగా మన పురాణాలలో చెప్పబడింది. ఈయన రచించిన మహేంద్రజాల శాస్త్రంలో

నీటిపై నడవడం, గాలిలో తేలడంవంటి ఎన్నో చిత్ర విచిత్ర భ్రమలను కల్పించే గారడీల గురించి వివరించబడింది.

వ్యాసుడు. వేదాలను క్రమబద్ధీకరించాడు కాబట్టి ఈయనను వేదవ్యాసుడు అని అంటారు. ఈయన పేరు వినగానే, అందరికీ మహాభారతం గుర్తుకు వస్తుంది. అయితే, ఈయన మహాభారతంతో పాటు, ఎన్నో గ్రంథాలను మానవాళికి అందించాడు. వాటిలో ఒకటి అర్ధశాస్త్రం ఈ గ్రంథాన్ని మొత్తం మూడు భాగాలుగా విభజించి, వాటిని 82 విధానాలుగా, ధనం ఎలా సంపాదించాలో వివరించాడట. దీని ఆధారంగానే కౌటిల్యుడు అర్ధశాస్త్రాన్ని మరింత విపులంగా వివరించి, దానిని గ్రంథస్థం చేశాడని ఒక వాదన. అయితే, నేటికీ చాణక్యుడు రచించిన అర్ధశాస్త్రమే ప్రాచుర్యంలో ఉంది.

ఆగస్త్య మహాముని. మన పురాణాలలో అగస్త్య మహాముని గురించి ఎన్నో విషయాలు చెప్పబడ్డాయి. ఈయన మహామునిగా, అపార విద్యాపారంగతుడిగా మన వేదాలలో చేపబడింది. ఈయన రాసిన శక్తి తంత్రం అనే గ్రంథంలో సూర్యుడు, చంద్రుడు, గాలి, అగ్ని, భూమి మొదలైన 64 రకాల బాహ్య శక్తులు, వాటి వినియోగాల గురించి వివరించబడింది. అంతే కాదు, ఇందులో అత్యంత శక్తివంతమైన, ప్రమాదకరమైన అణ్వస్త్రాల తయారీ, వాటి విచ్ఛేదనన గురించి వివరించబడింది.

మతంగ ఋషి. ఈయన సౌదామిని కళ అనే గ్రంథాన్ని లిఖించాడు. ఈ గ్రంథంలో నీడల ద్వారా, ఆలోచనల ద్వారా మనిషి

మానసిక ప్రవర్తన గురించి చెప్పబడింది. అంతేకాకుండా, భూమి, పర్వతాలలోని లోపలి భాగాల ఛాయాచిత్రాలను తీసే ప్రక్రియ గురించి చెప్పబడింది.

అత్రిముని. ఈయన వాతావరణంపై ఎన్నో పరిశోధనలు చేశాడట. ఈయన రాసిన మేఘశాస్త్రం అనే గ్రంథంలో 12 రకాల మేఘాలను, 12 రకాల వర్షాలను, 64 రకాల మెరుపులను, 33 రకాల పిడుగుల గురించి విపులంగా వివరించబడింది.

అధర్వణ వేదం. ఆధర్వణ వేదం మన సనాతన ధర్మంలో పేర్కొనబడిన నాలుగు వేదాలలో ఒకటి. ఈ వేదాన్ని ఎందరో మహా ఋషులు, దేవతలు లిఖించినట్లు మన పురాణాలు చెబుతున్నాయి. ఈ వేదంలో స్థాపత్య విద్య అనే అంశం ఒకటి ఉంది. ఇందులో, ఇంజనీరింగ్, ఆర్కిటెక్చర్ విద్యల గురించి, నగరాల ప్రణాళిక, కట్టడాలు మొదలైన సమస్త నిర్మాణ విషయాల గురించి పొందుపరిచారు.

ఈ 15 శాస్త్రాలే కాకుండా, ఆగ్నివర్మ రచించిన ఆశ్వశాస్త్రం, కుమారస్వామి రచించిన గజశాస్త్రం, భరద్వాజ మహాముని రచించిన యంత్ర శాస్త్రంవంటి శాస్త్రాలతో పాటు, ఆయుర్వేదం, ధనుర్వేదంవంటి ఎన్నో శాస్త్రాలను గ్రంథస్థం చేసి, మన పూర్వీకులు మనకు అందించారు. అయితే కాలగమనంలో వచ్చిన ఎన్నో ప్రళయాలు, యుద్ధాలవంటివాటివల్ల చాలా గ్రంథాలు నాశనమవ్వగా, మరికొన్ని నిర్లక్ష్యం వల్ల పాడైపోయాయి. వీటిలో కొన్ని మటుకు ఇప్పటికీ కొన్ని ప్రదేశాలలో భద్రపరిచారు. వీటిని గనుక ఈ కాలంలోని శాస్త్రవేత్తలు బాగా

అధ్యయనం చేసి, వినియోగంలోకి తెస్తే, ప్రపంచం కనిషవిని ఎరుగని ఎన్నో అద్భుతాలను సృష్టించవచ్చు.

## కణికనీతి

(తెలుగు ప్లానెట్ టీవీ ఆధారంగా)

మహాభారతంలో ఉన్నన్ని పాత్రలు ఈ ప్రపంచంలో మరో సాహిత్యంలోనూ కనిపించవు. సృష్టిలో ఉన్న అన్ని రకాల వ్యక్తిత్వాలు మనకు ఇందులో కనిపిస్తాయి. వాటిలో, భీష్ముడు, విదురుడువంటివారు మంచి గురించి, మంచి పాలన గురించి చెబితే, శకుని, కణికుడువంటి వారు దుష్టబుద్ధితో చెడును మంచిగా చూపిస్తూ, వారి వేళ్ళతో వారి కన్నునే పొడిచే విధంగా చేశారు. సరిగ్గా చెప్పాలంటే, నేటి సమాజంలో మూర్ఖుల ఆలోచన ఎలా ఉంటుంది? అన్నది ఈ కణికుడి పాత్ర ద్వారా తెలుస్తుంది. ఈ కణికుడు గురించి, అతడు చెప్పిన ప్రమాదకరమైన రాజనీతి గురించి తెలిసికొందాం.

పాండవుల వృద్ధిని చూసి కలతపడిన ధృతరాష్ట్రుడు ఒకనాడు తన వద్ద మంత్రిగా పనిచేస్తున్న నీతిశాస్త్ర విశారుదుడు, ప్రభుభక్తి పరాయణుడు అయిన కణికుడు అనే మంత్రిశ్రేష్ఠుని పిలిచి, " ఓ అమాత్యా! పాండవుల వృద్ధి పట్ల నాకు అసూయ కలుగుతున్నది. వారి పట్ల నేను ఆచరించదగినది సంధియా? విగ్రహమా? ఏది యుక్తమో, ఏది నాకు లాభకరమైనదో, ఆ కార్యాన్ని నేను ఎట్లు సాధించుకోగలనో చెప్పు"మని అడిగాడు. దానికి కణికుడు, " రాజా! రాజు వ్యక్తి కాదు. రాజు రాజ్యానికి సమిష్ఠశక్తి. రాజు యొక్క శ్రేయస్సు కానీ, ఆపదలు కానీ, వ్యక్తిగతమే కాదు. రాజ్యానికి, రాజ్య ప్రజలు అందరికీ సంబంధించినది. అందువల్ల, రాజు ప్రజలందరికీ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని నిర్ణయాలు

తీసుకోవలసి ఉంటుంది. రాజు సమర్థత తనను తాను కాపాడుకోవడంపై ఆధారపడి ఉంటుంది. రాజు ప్రశాంతంగా ఉంటే, రాజ్యం సుభిక్షంగా ఉంటుంది. కాబట్టి రాజు తీసుకునే నిర్ణయాలు పైకి కఠినంగా కనిపించినా, అవి రాజ్యప్రజలకు మేలు చేకూర్చే విధంగా ఉండాలి. లేదా, నామమాత్రంగానైనా అలా కనిపించే విధంగా ఉండాలి. రాజ్య ప్రజలందరి సంక్షేమం లక్ష్యంగా రాజు పనిచేయవలసి ఉంటుంది. కాబట్టి, దానికి సంబంధించినవి. మీకు శ్రేయస్సు తెచ్చేవి కొన్ని నీతి వాక్యాలు చెబుతాను ఆలకించండి" అంటూ ప్రారంభించాడు.

"రాజా! రాజుకు దండమే బలం కాబట్టి, నిత్యం దండాన్ని ఎత్తి పెట్టుకుని, పౌరుషాన్ని ప్రకటించాలి. మొదటగా, నీ బలాబలాలను గుర్తించి, బలాలను ప్రదర్శించాలి. అలాగే, బలహీనతలను, తప్పులను అత్యంత రహస్యంగా ఉంచాలి. వచ్చిన ప్రతి అవకాశాన్ని ఉపయోగించుకోవాలి. అలాగే, ఎదురయ్యే ప్రతి అవరోధాన్ని వడుపుగా పక్కకు తప్పించాలి. లేదా, శత్రువు వైపుకు మళ్ళించాలి. శత్రువు ఎవరో జాగ్రత్తగా గుర్తించడం అవసరం. వారిని నాశనం చేయాలని ఆలోచన వస్తే, ఆ ఆలోచనను పటిష్ఠంగా అమలుపరచాలి. ఫలితం వచ్చేవరకు, వాళ్లు సమూలంగా నాశనం అయ్యేంతవరకు ఆ రహస్యాన్ని సంతానంతో సహా, ఎంత దగ్గర మిత్రులకు, బంధువులకు కూడా చెప్పవద్దు. రహస్యం బయటకు వస్తే, రాజు ఉనికికే ప్రమాదం కలగవచ్చు.

కార్యసాధన రాజుకు కీర్తి తెచ్చి పెట్టేది. దానిని యుక్తితో సాధించాలి. ఆ ప్రక్రియలో నీ ప్రణాళికలు, నీ వ్యూహాలు, అన్వేషణలు

చాలా రహస్యంగా ఉంచుకోవాలి. కానీ, అణువంత కూడా బయటకు రానీయవద్దు.

శత్రువు మంచివాడు, పరాక్రమశాలి, బలవంతుడు, అపారమైన సైన్యం, అనంతమైన సంపద కలిగినవాడు అయితే, వాడిని మాయోపాయంతో పడగొట్టాలి. మనకు ఎదురు తిరిగేవాడెవడైన, మనకు ప్రబలశత్రువే. కనుక, సహితుకంగా వారి ఆర్థిక మూలాలపై దెబ్బతీయాలి. రాజా! శత్రువు పట్ల కరుణ కృప చూపి, రక్షించడం అంటే మన గొయ్యిని మనమే తీసుకున్నట్లే. అందుకే, శత్రుశేషం అస్సలు ఉండరాదు. అలాగే, శత్రువు దుర్బలుడు అయినప్పుడు కూడా, ప్రమత్తత నాశన హేతువుతుంది. రాజుకు సప్తాంగాలు ఉంటాయి. అవి, మంత్రి, సుహృదుడు, కోశం, శరీరం, కోట, బలం. వీటిని జాగ్రత్తగా రక్షించుకోవాలి. రాజా! ఏ పని ఆరంభించాలో, ఏది కూడదో విచక్షణతో నిర్ణయించాలి. ఆరంభించిన పనిని మధ్యలో ఎప్పుడు విడవరాదు. కాలికి ముళ్ళు గుచ్చుకున్న యెడల, ద దానిని సగం తీసి, పూర్తిగా తొలగించక, మిగిలిన సగభాగాన్ని అందులోనే వదిలేస్తే, బాధ మరింతగా హెచ్చుతుందే కానీ, ఏమాత్రం తగ్గదు. ఆలాగుననే శత్రువును నిర్మూలింపదలిస్తే, పూర్తిగా నిర్మూలించాలి. అంతేకానీ, సగం దెబ్బ కొట్టి వదిలి వేస్తే, శత్రువు మరింత బలవంతుడై, మనల్ని మరింత దెబ్బ కొడతాడు. రాజా! అవసరాన్నిబట్టి కొన్ని వినాలి. కొన్నిటిని విని విననట్లుగా నటించాలి. కొన్నిటిని చూడాలి. కొన్నింటిని చూసి చూడనట్లుగా నటించాలి. కొన్నిటిని పట్టించుకోవాలి. కొన్నింటిని

పట్టించుకోవద్దు. అయితే, అందరి పట్ల నమ్రతను నటించాలి. అశక్తతను చెప్పాలి. సాంత్వవచనాలతో శత్రువును నమ్మించాలి. అదను చూసి, దెబ్బతీయాలి. ప్రాణాలను తీసే భయంకరమైన ఆయుధాన్ని గడ్డిలో దాచిన విధంగా, నీ ఉపాయాలను, వ్యూహాలను దాచిపెట్టి, విశ్వాసాన్ని కల్పించి అవకాశం వచ్చిన సమయంలో లోబరుచుకోవాలి. ఎదుటివారిపై దయ చూపటం వల్ల, వాడు తనకు అవకాశం వస్తే నిన్ను నశింపజేస్తాడు. అందుకే శత్రువును సంహరించాలి. శత్రువును సంహరిస్తే, మనకున్న భయం పోతుంది. విడిచిపెడితే భయం కలుగుతుంది. అలాగే, మంచితనాన్ని నటించాలి. లోకాన్ని నమ్మించాలి. సదా అనుగుణంగా చరించాలి. మనపై ఈ లోకానికి విశ్వాసం కలిగే విధంగా మాట్లాడాలి. అవకాశం ఉన్నమేరకు మంచి పనులు చేసినట్లుగా నటించాలి. ముఖ్యంగా, యజ్ఞ యాగాదులు నిర్వహించాలి. ఉపవాసాలు చెయ్యాలి. సన్యాసిగా అవసరమైతే నటించాలి. కానీ, మన లక్ష్యాన్ని విడువకూడదు. అవసరమైన మేరకు లోకాన్ని, ప్రజలను, శత్రువులను వంచించాలి.

మనకు కాలం అనుకూలంగా లేని సమయంలో శత్రువులతో మైత్రికి చేయి చాచాలి. సమయం వచ్చినప్పుడు వారిని, బండపై కుండలు మోదినట్లుగా మోది, నశింపజేయాలి. శత్రుపక్షంలో చేరినవాడు తండ్రి అయినా, గురువులైనా, మిత్రులైనా, చివరకు సంతానమైనా, తన క్షేమం కోసం వారిని ఉపేక్షించడం ప్రమాదం కొని తెచ్చుకున్నట్లే. తనవారినైనా వారిపై దయ చూపటం అనేది ఆత్మ వినాశానికి దారితీస్తుంది. రాజా! దయ అనేది మానసిక దౌర్బల్యం. దానిని ఎప్పుడూ శత్రువుల పట్ల

చూపరాదు. శత్రువులపై మనసులోని పగను ఎన్నడూ బయటకు ప్రకటించవద్దు. ఎల్లప్పుడూ నాలుకపై ప్రేమాస్పద వాక్యాలే నిలపాలి. కానీ, హృదయం ఎప్పుడూ కఠినత్వంతో నిండిపోవాలి. ధర్మాన్ని పలకాలి. ధర్మాత్ములను గౌరవించాలి. ధర్మాత్మునిగా నటించాలి. అప్పుడు, ఎన్ని తప్పులు చేసినా, ఈ లోకం మనలను విశ్వసిస్తుంది. ఎవరు మనకు పగతుడో, వారిని అందరి ముందు ఆదరించాలి. ధనకనక వస్తు వాహనాధులను ఇవ్వాలి. తదుపరి మాయోపాయంతో వారి పైన నేరాన్ని మోపాలి. లేని పోని నిందలను సృష్టించి, దుష్ప్రచారం చేసి, తదుపరి వారిపై లేని పోని నిందలను మోపి, వారి తప్పిదాలను అందరి ముందు పెట్టి. వారిని శిక్షించాలి. అలాగే, వారికి తప్పులు చేసే అవకాశం కూడా మనమే ఇవ్వాలి. రాజా! శత్రువులకు చేతులు జోడించుట, శాంతవచనాలు పలుకుట, ఉచిత ఆసనాదులు ఇచ్చుట, ఆదరంగా హత్తుకొనుట, పాదాలకు నమస్కరించుట ఇవన్నీ సమయానుసారంగా అనుసరించాలి. తన ఆలోచనలు శత్రువులకు చేరకుండా ఎలాగైతే జాగ్రత్త పడతామో, అలాగే మిత్రులకు కూడా చేరకుండా చూసుకోవాలి. ధనవంతుడు మరొక ధనవంతుడిని ఆశ్రయించడు. తమ పనులు నెరవేరేక, ఎవరూ మన వద్దకు రారు. కాబట్టి, మన అవసరం ఎప్పుడూ ఎదుటి వారికి ఉండేటట్లుగా చూసుకోవాలి.

శత్రువు చిన్నవాడని ఉపేక్షించవద్దు. చిన్నపాముసైనా, పెద్దకర్రతోనే కొట్టాలి. శత్రువును ఎప్పుడైనా సమూలంగా నాశనం చేయాలి. శత్రుశేషం, ఋణ శేషం ప్రమాదాన్ని తెచ్చేది. శత్రువైనా,

మిత్రుడైనా, వారితో వీలైనంత మేరకు ధర్మబోధనలతో ధార్మికునిగా నటించాలి. తదుపరి, సామదానభేద దండోపాయాలతో నీ దారికి తెచ్చుకోవాలి. అవకాశం వచ్చిన వేళ నిశ్శంకగా చంపేయాలి. ఎవరిని నమ్మవద్దు. తుదకు తన నీడను కూడా, రాజా! అనుమానించాలి. గూఢచారి వ్యవస్థనెంత పటిష్టంగా ఏర్పాటు చేస్తే, రాజుకు అంత రక్షణ కలుగుతుంది. ఈ ప్రపంచంలో ఏదైనా అద్భుతమైన ఆవిష్కరణ జరిగింది అంటే, అది సమిష్టి కృషి ఫలితమే. కానీ, పేరు ఒక్కరికే రావచ్చు. కానీ, రాజా! ఎవరు ఏ ఆవిష్కరణ చేసినా, పేరు మాత్రం మనకే వచ్చే విధంగా జాగ్రత్తపడాలి. సాధారణంగా యుద్ధం ఆరంభించడానికి ముందు అది ధర్మ యుద్ధమే. కానీ, ఆరంభించాక అది విజయావకాశాలపై చూపే ప్రభావాన్ని బట్టి దాని స్వరూపం మారిపోతుంది. గెలిచే సమయంలో అధర్మం అంటూ కూర్చోవడం మూర్ఖత్వం అవుతుంది. మానవ స్వభావం ఎప్పుడూ ఒకే రీతిగా ఉండదు. అవసరాలకు అనుగుణంగా మారుతూ ఉంటుంది. మంచివారు చెడ్డవారుగా, చెడ్డవారు మంచివారుగా మారే అవకాశం ఉంటుంది. మంచి చెడ్డలు ప్రక్క ప్రక్కనే ఉంటాయి. అవకాశాన్ని బట్టి మనిషి వాటిని వాడుకుంటాడు. దానిని సరిగా అంచనా వేయటమే మీ విజయానికి మొదటి మెట్టు. రాజా! రాజుకు అహంకారం పనికిరాదు. ఎన్నడూ మన అహంకారాన్ని బయలుపరచనీయకూడదు. శత్రువైనా, వినయంగా మాట్లాడడం, ఎదురేగి స్వాగతించటం, ఆసన భోజనాదులు ఇవ్వడం చేయాలి. తనకు నచ్చినా, నచ్చకపోయినా, కలతపడినవారికి ఓదార్పు నివ్వాలి. నేనున్నానని అభయం ఇవ్వాలి. కానీ, అవకాశం వస్తే

తొక్కేయాలి. రాజా! కష్టపడకపోతే సుఖం విలువ తెలియదు ప్రజలకు హామీలు ఇవ్వాలి. కానీ, అమలు చేయడంలో ఎంత వీలైతే అంత ఆలస్యం చేయాలి. రాజా! ప్రజలు సుఖశాంతులతో వర్ధిల్లుతుంటే మన మాట వినరు. అందుకే ఒక చేత్తో ప్రజలకు మేలు చేస్తున్నట్లుగానే నటిస్తూ, మరొక చేత్తో కప్పం రూపంతో తిరిగి వారినుండి పిండుకోవాలి. తిరిగి వారిని అష్ట దరిద్రులుగానే నిలబెట్టాలి.

రాజా! మనుషులలో భయం అనేది గొప్ప శత్రువు. అది వారిని ముందుకు పోనివ్వని ఒక పెద్ద మానసిక జబ్బు. ఆ జబ్బును ఎంతగా పెంచితే ప్రజలు, శత్రువులు అంతగా వశవర్తులు అవుతారు. భయం ఎప్పుడు ప్రజలకు, సామంతులకు, పరరాజులకు ఉండాల్సిందే. అందుకే, దండనను సిద్ధంగా ఉంచుకోవాలి. నిన్ను భౌతికంగానే కాదు, మానసికంగా భయపెట్టే శత్రువును కూడా పూర్తిగా అణిచివేయటమే మనకు ఎదురు లేని నీతి. అడవి ఎంత దట్టంగా ఉన్నా, ఒక్క నిప్పు కణిక దాన్ని బూడిద చేస్తుంది. కాబట్టి, నాయకుడు అనుక్షణం అప్రమత్తంగా ఉండాలి. ఒకసారి అంటుకున్న నిప్పురవ్వను కొంత ఆర్పేసి, విడిచి విడిచి పెడితే, ఆ బూడిద అడుగులో ఉన్న మరో నిప్పు కణిక కాల్చేస్తుంది. శత్రువును దండించడం ద్వారా శత్రుభయాన్ని సమూలంగా పోగొట్టుకోవాలి. శత్రువును భౌతికంగా, ఆర్థికంగా, మానసికంగా అణిచివేసే ప్రణాళికలను సిద్ధం చేసుకోవాలి. ఆ ప్రణాళికలు అమలు అయ్యేవరకు ఆ రహస్యం బయటకు రాకుండా, పటిష్ఠమైన విధానాన్ని ఏర్పాటు చేసుకోవాలి. నాయకుని ఆలోచనలు ఏమాత్రంగా బయటపడినా, శత్రువు

అప్రమత్తమవుతాడు. అవకాశం మేరకు ప్రతీకారం తీర్చుకునే ఆలోచనలు చేస్తాడు. రాజా! ఎవరు ఏ పని చేసినా, ఈ ప్రపంచంలో ఫలితాన్ని ఆపేక్షించే చేస్తారు. అంతే కాదు, ఇతరులను వంచించకుండా, హింసించకుండా, దారుణ కర్మలను ఆచరింపకుండా, ఎవ్వరు ఐశ్వర్యవంతులు కాలేరు. కాబట్టి, నీకంటే బలవంతులైన పాండవుల బలాన్ని తలుస్తూ, ఊరికే ఆలోచించి ఎలా సాధించాలని చింతిస్తూ కూర్చునే కన్నా, నేను చెప్పిన ఈ నీతి వాక్యాలను ఆచరణలో పెట్టి విజయాన్ని స్వీకరించు" అన్నాడు కణికుడు.

సంస్కృత భారతంలో కణికుడిని పిలిచి ఉపదేశం పొందినవాడు ధృతరాష్ట్రుడు. కానీ, నన్నయభారతంలో కణికోపదేశం పొందింది, దుర్యోధనుడు. ఈ కణిక నీతివలననే కౌరవ పాండవుల కథ కొత్త మలుపు తిరుగుతుంది. కనుక, కణికనీతి అంటే కుటిలనీతి. దీనిని ఆచరించేవారెవరైనా దుర్మార్గులు, అధర్మపరులు అనడంలో ఏమాత్రం సందేహం లేదు. ఈనాడు ఎందరో రాజకీయ నాయకులు ఈ కణిక నీతిని ఆచరించడం చూడవచ్చు. అలాగే, శాశ్వత శత్రుత్వం గానీ, శాశ్వత మిత్రత్వం కానీ పాటించకపోవడం, వ్యూహప్రతివ్యూహాలతో అవసరాలకు ఒకరిని మరొకరు తోసేసి గద్దెనెక్కడం కూడా మనకు తెలిసిందే కదా!

## మహాభారతం ఒక వాస్తవం

మన రామాయణ మహాభారతాల గురించి ఎప్పుడూ ఒక వాదన ఉంటూ ఉంటుంది. అవి జరిగాయా? కల్పితమా? చరిత్ర మన ఊహకు అందనంతమాత్రాన, మనం కనిపెట్టలేనంత మాత్రాన నిజం అబద్ధమో, లేక, కల్పనో అయిపోదు. మహాభారతం జరిగింది అన్నదే నిజం. భారతం కల్పన కాదు. మన భారత దేశ చరిత్రకు అసలైన సాక్ష్యం. మహాభారత యుద్ధమే మొట్టమొదటి ప్రపంచ యుద్ధం కూడా. కురుక్షేత్ర యుద్ధం నిజంగానే జరిగిందా? అనే ప్రశ్న అందరిలోనూ ఒక్కోసారి వస్తూ ఉంటుంది. ఎందుకంటే, మన చరిత్ర పుస్తకాల్లో ఎప్పుడూ మహాభారతం గురించి పెద్దగా కనబడదు. ఈ యుద్ధానికి సంబంధించిన ఆధారాలు ఇప్పుడిప్పుడే బయటపడుతున్నాయి. భారత యుద్ధానికి సంబంధించిన ఎన్నో ఆధారాలు ఉన్నాయి. వాటిని డీకోడ్ చేయాల్సిన అవసరం ఉంది. కురుక్షేత్ర యుద్ధంలో 18 అక్షౌహిణుల సైన్యం చనిపోయారని మహాభారతం చెప్తుంది. ఆ కాలంలో అంత జనాభా ఉందా? అన్నది మన వాళ్ళ డౌట్. అందుకే, అక్షౌహిణి అంటే ఏమిటో ఇప్పుడు తెలుసుకుందాం. మహాభారతంలో ఉన్న మిస్టరీస్ ని ఇప్పుడు చూద్దాం.

మహాభారత యుద్ధం 18 రోజులు జరిగింది. 18 అక్షౌహిణుల సైన్యం నాశనమైంది. అక్షౌహిణి అంటే ఎంత? ఇప్పటి ఆర్మీలో ఒక్కో స్థాయిలో ఉన్నట్టే, అప్పట్లోనూ సైన్యం విభజన ఉండేది. మన ఆర్మీలో కంపెనీ, ప్లాటోన్, బెటాలియన్, రెజిమెంట్, ఇలా ఒక్క స్థాయిలో ఒక్కో

లెక్కన సైన్యం ఉంటుంది. అలాగే, మహాభారతంలోని కురుక్షేత్ర యుద్ధంలో కూడా అప్పటి సైనికుల లెక్కలు ఉన్నాయి. అవేంటో ముందు చూద్దాం.

ఒక రథం, ఒక ఏనుగు, మూడు గుర్రాలు, ఐదు మంది సైనికులు ఉంటే, ఈ మొత్తం గ్రూప్ ని ఒక పత్తి అనేవారు. ఈ పత్తికి నాయకుడు ప్రతిపాలుడు. ఇప్పటి పేరుతో పోలిస్తే లెఫ్టినెంట్. పత్తికి మూడు రెట్లు, అంటే, మూడు రథాలు, మూడు ఏనుగులు, 9 గుర్రాలు, 15 మంది సైనికులు ఉంటే, అది సేనాముఖం. ఆ సేనాముఖానికి అధిపతి సేనాముఖి. ఇప్పటి ఆర్మీ భాషలో క్యాప్టెన్. ఇలా భారత కాలంలో చిన్న నుంచి పెద్ద వరకు ప్రతి సైన్యానికి ఒక లెక్క ఉంది. మొదటిది పత్తి, రెండు సేనా ముఖం, ఆ తర్వాత గుల్మం, తర్వాత గణం, వాహిని, పృతన, చమువు, అనీకిని, చివరిది అక్షౌహిణి. అక్షౌహిణి అతి పెద్ద సైన్య సమూహం. అక్షోహిణికి నాయకుడిని మహాసేనాపతి అనేవారు. మహాసేనాపతి అంటే ఈ నాటి ఈ భాషలో జనరల్. ఒక అక్షౌహిణిలో ఎంత సైన్యం ఉంటుంది? ఒక అక్షౌహిణిలో 21870 రథాలు, 21 వేల ఎనిమిది వందల డెబ్బై ఏనుగులు, 65610 గుర్రాలు, 1, 09, 350 మంది సైనికులు ఉంటారు. ఇది ఒక అక్షౌహిణి. సైన్యం మొత్తంగా లెక్కిస్తే అక్షౌహిణి అంటే, 218, 700 మంది సైన్యం. భారతంలో చెప్పిన లెక్క ప్రకారం పాండవుల సైన్యం ఏడు అక్షౌహిణులు. కౌరవుల సైన్యం 11 అక్షౌహిణులు. అంటే, మొత్తం 18 అక్షౌహిణుల సైన్యం. 18 అక్షౌహిణుల సైన్యం అంటే 39 లక్షల, 36 600 మంది. ఎన్నో దేశాలు, ఎన్నో రాజ్యాలు

ఈ యుద్ధంలో పాల్గొన్నాయి. అలాంటప్పుడు, 40 లక్షల మంది యుద్ధంలో పాల్గొనడంలో ఆశ్చర్యం ఏముంది? అప్పట్లో భారత జనాభా కోట్లలో ఉండేది. మొగల్ కాలంనాటి లెక్కలలో మన జనాభా ఐదు కోట్లు మన జనాభా అని కొందరు చెబుతుంటారు. అప్పట్లో అంతే జనాభా ఉందని, ప్రతి యుగంలోనూ అంతే ఉండాలని లేదు కదా. ద్వాపరయుగంలో భూభారం తగ్గించేందుకే నేను అవతరించానని శ్రీకృష్ణుడు చెప్పినట్టు భారతంలో చాలా సార్లు కనిపిస్తుంది. అంటే, అప్పట్లో ఎన్ని కోట్ల జనాభా ఉండి ఉంటుందో ఊహించవచ్చు. కొన్ని లెక్కల ప్రకారం, మహాభారత కాలానికి అప్పటి భారత దేశ ప్రాంతంలో ఉన్న జనాభా 12 కోట్ల పైనే. అలా సుమారు 40 లక్షల మంది సైన్యం మహాభారత యుద్ధంలో పాల్గొన్నారు. ఆ యుద్ధంలో ఎంతో మంది మరణించాక, ద్వారక మునిగిపోయాక, ఇంకెన్నో ఉత్పాతాలు జరిగాక, అతి కొద్ది మంది జనాభాతో కలి యుగం ప్రారంభమైంది. ఆనాడు మహాభారత యుద్ధంలో 100కు పైగా రాజ్యాలు పాల్గొన్నాయి. వాటిలో ఇప్పటి చైనా ప్రాంతం, ఆఫ్ఘనిస్తాన్ ప్రాంతం, నేపాల్ ప్రాంతం రాజులు కూడా ఉన్నారు. భారతం నిజంగా జరిగిన కథే అని వ్యాసుడు మహాభారతంలో చెప్పారు.

భారతంలో ఉన్న పాత్రలన్నీ చరిత్రను మరో తరానికి చెప్పే పేర్లతోనే కనిపిస్తాయి. ఒకవేళ ఇది కథే అయితే, ఇన్ని పాత్రలు, ఇన్ని నంబర్లు, వాటికి మళ్లీ పేర్లు, అవసరమే లేదు. కానీ, మహాభారతంలో కొన్ని వందల క్యారెక్టర్ లు ఉంటాయి. ప్రపంచ సాహిత్యంలో ఇంకే

గ్రంథంలోను ఇన్ని క్యారెక్టర్లు కనిపించవు. విచిత్రం ఏంటంటే, భారతం విన్నవారికి ఆ క్యారెక్టర్లన్నీ గుర్తుంటాయి. చరిత్ర అయితే తప్ప అలా గుర్తు ఉండడం కష్టం. పైగా, యుద్ధంలో వ్యాసుడు ఎన్నో వ్యూహాలు, ఎన్నో అస్త్రాల గురించి వివరించాడు. మకర వ్యూహం, చంద్రం వ్యూహం, అర్ధచంద్ర వ్యూహం, గరుడ వ్యూహం, పద్మవ్యూహం, ఇలాంటి వ్యూహాల గురించి వివరణ ఉంది. అలాగే, బ్రహ్మాస్త్రం బ్రహ్మ శిరోనామకాస్త్రాలు ఎవరైనా చూస్తే అవి ఆటంబాంబులని తెలుస్తోంది. బ్రహ్మాస్త్రం ప్రయోగిస్తే 12 ఏళ్ల పాటు అక్కడ మొక్క కూడా మొలవదని ద్రోణుడు చెబుతాడు. ఇది ఇప్పుడు న్యూక్లియర్ బాంబుకి దగ్గరగా ఉంది. ఇవన్నీ చెప్పాల్సిన అవసరం ఒక కథకు లేదు. పైగా, ఇవన్నీ టెక్నికల్ అంశాలు. అప్పట్లో జరగనిదే, జరిగింది చూడనిదే, ఇలాంటివి ఊహించే అవకాశమే లేదు. జరిగినదే వ్యాసుడు రాశాడు.

మహాభారతంలో చరిత్ర మొత్తం కనిపిస్తుంది. 18 పర్వాలుగా మహాభారతం విభజించి ఉంటుంది. అందులో మొదటి పర్వం ఆదిపర్వం. అందులో భరత వంశంలో రాజులందరి గురించి ఉంటుంది. ఆ రాజుల వారసులు ఆ తర్వాత పరిపాలించడం ఆధునిక చరిత్రలోనూ కనిపిస్తుంది. అలాగే, మహాభారతంలో చెప్పిన ద్వారక, యుద్ధం జరిగిన కురుక్షేత్ర ప్రాంతం, పాండవులు పాలించిన ఇంద్రప్రస్థంలాంటి ప్రాంతాలన్నీ తవ్వకాల్లో కనిపించాయి. సముద్ర గర్భంలో ద్వారకానగరం దొరికింది. ద్వారకకు, హస్తినకు కనెక్షన్ ఉందని, అక్కడ మట్టి, పింగాణి పాత్రలు స్పష్టంగా చెబుతున్నాయి. మహాభారత యుద్ధం జరిగిన 36 ఏళ్లకు ద్వాపరయుగం

ముగిసింది. క్రీస్తుపూర్వం 3102 నుంచి కలియుగం వచ్చింది. శ్రీకృష్ణుడు అవతారం కూడా అప్పుడే ముగిసింది. మహాభారత యుద్ధం ముగిసేక, ఇంద్రప్రస్థం, కురుక్షేత్రం, హస్తినాపురం, ఇలాంటి ప్రాంతాలన్నీ పాండవుల వారసులు పరిపాలించారు. వారి కాలం క్రీస్తుపూర్వం 1400 వరకు కొనసాగింది. అందుకు ఆధారాలు కూడా తవ్వకాల్లో దొరికాయి. ఆ తర్వాత గంగానది వరదలకు హస్తినాపురం రాజ్యంలో చాలా భాగం మునిగిపోయింది. కురుక్షేత్రం తర్వాత హస్తినను పాలించిన రాజు పరీక్షిత్తు ఆయన తర్వాత ఐదవ వారసుడు నిచక్షువు. గంగానది వరదలకు హస్తిన మునిగిపోయాక, నిచక్షువు తన రాజధానిని కౌశామ్బికి తరలించాడు. వరదలకు హస్తిన మునిగిపోవడం నిజమేనని, కౌశాంబి నగరం కూడా అపుడే ఏర్పడిందని అర్కియాలజిస్టులు నిరూపించారు కూడా. అందువల్ల పాండవులు హస్తినను పరిపాలించారన్నది చారిత్రక సత్యం. యుద్ధాన్ని ఆపడానికి శ్రీకృష్ణుడు కౌరవుల దగ్గరికి రాయబారానికి వెళ్లడం భారతంలో ముఖ్యమైన ఘట్టం. ఆ సమయంలో శ్రీకృష్ణుడు పాండవులకు కనీసం మూడు ఊళ్ళు అయినా ఇమ్మంటాడు. పాండవులు అడిగిన ఆ ఊళ్ళు పాణిప్రస్తం, సోనప్రస్థం, ఇంద్రప్రస్థం. వీటిలో, పాణిప్రస్థమే నేటి పానిపట్టు, సోనప్రస్తం నేటి సోనపేట్. ఇంద్రప్రస్థమే నేటి పురానా ఖిలా. అక్కడ పాండవులు కాలంనాటి అవశేషాలు చాలా దొరికాయి. ఆనాడు మహాభారతంలో చెప్పిన 35 ప్రాంతాల్లో తవ్వకాలు జరిగితే, అన్నిచోట్ల ఆనాటి అవశేషాలన్నీ దొరికాయి. మట్టి పాత్రలు, డ్రైనేజీలు, గోడలు, కొన్ని పాచికలు శూలాలు, బాణాలు, కత్తులు దొరికాయి అప్పటికి ఇనుము

కూడా ఎక్కువగా వాడినట్టు తెలిసింది. అప్పటి పింగాణీ పాత్రలకు క్వాలిటీ ఇప్పటి క్వాలిటీకి ఏమాత్రం తక్కువ కాదు. ఎంతో విలాసవంతమైన, అందమైన అర్బన్ కల్చర్ మహాభారత కాలంలో ఉంది.

ఇప్పటికి పర్ఫెక్ట్ కాలమానం అంటే గ్రహగతులే. మన పురోహితులు గ్రహగమనాలను చూసి, గ్రహణాలు ఎప్పుడు వస్తాయో ఏ కంప్యూటర్లు లేకుండానే కచ్చితంగా చెప్పగలుగుతున్నారు. మహాభారతంలో కాలం లెక్కలు చాలా ఉన్నాయి. యుద్ధానికి ఒక ముహూర్తం పెట్టారు. భీష్ముడు తన మరణానికి తనే ఒక ముహూర్తం పెట్టుకున్నాడు. యుద్ధం జరిగినప్పుడు సూర్యుడు ఒకేరోజు రెండు సార్లు అస్తమించాడు. గ్రహణాలు ఏర్పడ్డాయి. ఇలా చాలా లెక్కలు ఉన్నాయి. మహాభారతంలో చెప్పిన జాతకాలు గ్రహణాలు, గ్రహాల లెక్కలను కొందరు శాస్త్రవేత్తలు పరిశోధించారు. ఆ గ్రహగతులన్నీ సరిగ్గా మహాభారత కాలంలో వ్యాసుడు చెప్పిన క్రమంలోనే జరిగాయని నిరూపించారు.

మహాభారతంలో ఎన్నో అస్త్రాలు వాడారు. అవేవీ కనిపించలేదు. షఅవన్నీ మాయ ఆస్త్రాలా? బ్రహ్మాస్త్రం, సమ్మోహనాస్త్రం ఇవన్నీ వార్ హెడ్ ను తలపించే అస్త్రాలు. బ్రహ్మాస్త్రం వేస్తే, అక్కడ 12 ఏళ్ల పాటు కరువు వస్తుందన్నారు. ఇవన్నీ బాణం, పుల్లలు, శూలాలకు సంబంధించిన టెక్నాలజీలా లేదు. అర్జునుడు ఉపయోగించిన అస్త్రాల్లో, కొన్ని టార్గెట్ లాక్ చేసి ప్రయోగించినవి ఉన్నాయి. సైంధవుడి కథ చదివితే ఆ విషయం అర్థమవుతుంది. 40 లక్షల మంది సైన్యం రోజు బళ్లాలతో,

కత్తులతోనూ పోరాడితే 18 రోజుల్లో యుద్ధం ముగిసే అవకాశం లేదు. కనుక అడ్వాన్స్ అస్త్రాలెన్నో ఉపయోగించి ఉండాలి. మహాభారత యుద్ధం ముగిసిన తర్వాత శ్రీకృష్ణుడు ఈ దివ్యాస్త్రాల సాంకేతికతను మొత్తం నాశనం చేశాడని చెప్తారు. అశ్వత్థామ తన బ్రహ్మాస్త్రాన్ని గర్భంతో ఉన్న ఉత్తర మీద ప్రయోగించాడు. ఇలాంటి ఆస్త్రాలు అశ్వత్థామలాంటివాళ్ళ చేతుల్లో పడితే, ప్రపంచం నాశనం అవుతుందని శ్రీకృష్ణుడు అప్పటి టెక్నాలజీని నాశనం చేయించాడని ఒక కథ ఉంది. అదే నిజమైతే, కురుక్షేత్ర యుద్ధంనాటి ఆయుధాలు దొరికే అవకాశం లేదు.

మహాభారత కాలానికే ఇనుము వాడకం భారతీయులకు తెలుసు. తెలియడమే కాదు, ఇనుముతో మన భారతీయులు చేసిన ప్రయోగాలు ప్రపంచంలో అప్పటివరకు ఎవరూ చేయలేదు. నిజానికి ఇప్పటివరకు కూడా చేయలేదని చెప్పాలి. దానికి ఉదాహరణ, ఢిల్లీలో కుతుబ్మినార్ ముందు ఉన్న, తుప్పు పట్టని ఇనుప స్తంభం. క్రీస్తుపూర్వం 300 సంవత్సరంలో ఈ స్తంభాన్ని తయారు చేశారు. ఈ స్తంభాన్ని అప్పటి ఇస్లామిక్ రాజులు కనీసం కదల్చలేకపోయారు. ఈ చుట్టూ ఉన్న ఆలయాలను కూల్చగలిగారు కానీ, ఈ స్తంభాన్ని ఏమీ చేయలేకపోయారు. అప్పటికే మన దేశస్థులకు ఇంత మెటీరియల్ సైన్స్ తెలుసు. ఇప్పటికీ తుప్పు పట్టని ఆ ఇనుము టెక్నాలజీ ఏంటో ఎవరూ సరిగ్గా కనుక్కోలేకపోయారు. కంటి ముందు కనిపిస్తున్న ఇనుప స్తంభమే

పెద్ద రహస్యంగా మిగిలిపోయింది. మరి, మహాభారత కాలం నాటికి ఉన్న దివ్యాస్త్రాల గురించి డికోడ్ చేయగలమా?

భరద్వాజముని వైమానిక శాస్త్రం, యంత్ర శాస్త్రాలను కనుగొన్నారు. ఇవి ఇప్పటికీ అద్భుతాలే. భరద్వాజుడు కొడుకే ద్రోణుడు. ద్రోణుడికి తండ్రి ఆ విద్యలన్నీ నేర్పకుండా ఉంటాడా? ఆ విద్యలు నేర్చుకున్న ద్రోణుడు తన ప్రియశిష్యుడైన అర్జునుడికి చెప్పకుండా ఉంటాడా? భరద్వాజుడు ఎన్నో రకాల విమానాల గురించి చెప్పారు. అందులో నీటితో నడిచేవి, గాలితో నడిచేవి కూడా ఉన్నాయి.

ఆయుధాల నిర్మాణం కూడా యంత్ర శాస్త్రంలో ఉంది. ఎలాంటి దాడినైనా తట్టుకునే కవచంలాంటి పదార్థం గురించి భరద్వాజ గ్రంథాల్లో ఉంది. అర్జునుడి కవచాన్ని ఏ ఆయుధము చీల్చలేదు. ఆ కవచాన్ని తయారు చేసింది ద్రోణుడు. ఆ ప్రత్యేక కవచం అవసరం గురించి ద్రోణుడు, అర్జునుడికి తప్ప ఎవ్వరికి చెప్పలేదు. యుద్ధం చివరిలో దుర్యోధనుడికి ద్రోణుడు ఆ కవచం ఇచ్చాడు. అలాంటి బుల్లెట్ ప్రూఫ్ మెటీరియల్ భరద్వాజుడు చెప్పిన మెటీరియల్ ఒకటే. ద్వారకలో ఉండగా, ఓసారి కృష్ణుడిపై ఏయిర్ ఎటాక్ జరిగిందని ఆయనే భారతంలో చెప్పాడు. ద్రౌపదికి ఈ విషయాన్ని శ్రీకృష్ణుడు చెప్పాడు. ఆ ఎటాక్ ని ఎదుర్కొన్నాను అని కూడా చెప్పాడు. అప్పటికే యుద్ధ విమానాలు ఉన్నాయా? ఇవన్నీ ఇప్పుడు వినడానికి మిస్టీరియస్ ఉండొచ్చు. మిథికల్ గా కూడా అనిపించొచ్చు. కానీ, మనకు తెలిసింది మాత్రమే సైన్స్

కాదు. ప్రతి యుగంలోనూ టెక్నాలజీ ఉంది. ఆ టెక్నాలజీ ఆ యుగం దాటి మన యుగంలోకి రాలేదన్నది వాస్తవం.

మన అధర్వణ వేదంలో ఉన్న వెపన్స్ టెక్నాలజీ కోసం సెకండ్ వరల్డ్ వార్లో హిట్లర్ కూడా ప్రయత్నించాడు. మన తెలుగు పండితుడు, అధర్వణ వేదవిద్వాంసుడు అయిన దండిబొట్ల విశ్వనాథ శాస్త్రిని జర్మనీ తీసుకెళ్ళి. హిట్లర్ రహస్యాలు కూడా తెలుసుకున్నాడని అంటారు. ఇప్పటికీ జర్మన్ మ్యూజియంలో దండి బొట్ల విశ్వనాథ శాస్త్రి ఫోటో ఉంది. ఇలాంటివి చూసినప్పుడు వేదాల్లో చెప్పిన ఎన్నో ప్రయోగాలు ద్వాపర యుగంలో జరిగే ఉంటాయని అనుకోవాలి. ఎందుకంటే, ఇప్పటికీ అటామిక్ బాంబు లక్షణాలే బ్రహ్మాస్త్రం, బ్రహ్మ శిరోనామకాస్త్రాలకి ఉన్నాయి. ఇప్పటి హైడ్రోజన్ బాంబు లక్షణాలే పాశుపత ఆస్త్రానికి ఉన్నాయి. నారాయణాస్త్రం క్వాంటం థీరీతో పనిచేస్తుంది. ఒక మనిషి వంద మనుషులుగా 100 చోట్ల కనిపించే టైం ట్రావెల్ తరహా అస్త్రం అర్జునుడు దగ్గర ఉండేది. ఇలాంటి ఎన్నో ఆస్త్రాలు ఊహకు అందనివి ఒక కథలో ఎలా రాయగలరు? సంజయుడు యుద్ధంలోనే అదృశ్యరూపంలో తిరుగుతూ, యుద్దాన్ని దృతరాష్ట్రుడికి వర్ణించాడు. అదృశ్య రూపం అంటే హాలోమెన్ తరహా. ఇలాంటి ఊహలే అద్భుతం. అలాంటివి రాశారంటే, అప్పటికి చూసినవే రాసుండాలి. జరిగినదే చూసి ఉండాలి. అందుకే, మహాభారతం మహాద్భుతం.

# రామసేతువు

రామసేతు. ఆనాడు రాముడు, అతని వానరసైన్యం శ్రీలంకకు నిర్మించిన రాతివంతెన. సీతమ్మ కోసం రావణుడిపై యుద్ధం చేసాడు, రాముడు. ఇప్పటి ధనుష్కోటి ప్రాంతానికి వచ్చాడు. అక్కడి నుంచి సముద్రమార్గంలో అతి దగ్గరలో ఉన్న లంక భూభాగంలోకి వెళ్లాలి. అప్పుడే వానర వీరుల్లో ఒకరు, నిర్మాణ శాస్త్రంలో ఆరితేరిన నలుడు వారధి కట్టాడు. నలుడి ఆధ్వర్యంలో నీటిలో తేలే రాళ్లతో వంతెనకట్టారు, వానర వీరులు. రామసేతు లేకపోతే లంకపై యుద్ధమే లేదు. ఆ సేతువు వల్లే రామ రావణ యుద్ధం జరిగింది. రావణ సంహారం జరిగింది. సీతారాములు కలిశారు. ఇప్పటికీ రామేశ్వరం దగ్గరలో ఉన్న ధనుష్కోటికి వెళితే, రామసేతు ఆనవాళ్లు కనిపిస్తాయి. ఆనాడు సముద్రుడని శాంతించాలని రాముడు కోరాడు. ఇప్పటికీ ఆ శాంతి సముద్రం మనకు కనిపిస్తుంది. రామసేతు వైపు ఉన్న సముద్రంలో అసలు అలలే రావు. పక్కనే ఉన్న బంగాళాఖాతం మాత్రం ఎగిరెగిరి పడుతూ ఉంటుంది. అసలు, రామసేతు కథేంటో ఇప్పుడు తెలుసుకుందాం.

నాలుగైదు ఏళ్ల క్రితమే నాసా డిస్కవరీ ఛానల్ పరిశోధకులు రామసేతు మీద రీసెర్చ్ చేశారు. ఆ సేతు సహజసిద్ధంగా ఏర్పడినది కాదు, మనుషులు కట్టినదే అని వారు తేల్చారు. సేతువు ఉన్నచోట ఉన్న రాళ్లు ఏడు వేల కిందటివి అని చెప్పారు. ఇవి డిస్కవరీ ఛానల్ చెప్పిన వివరాలు. ఇన్నాళ్లు ఆ వారధి మనుషులు కట్టినది అని కొందరు వాదించేవారు. కానీ, వాల్మీకి రామాయణంలో ఆ వారధి ఎలా కట్టారు, ఏ

రాళ్లు వాడారు అన్న వివరాలన్నీ ఉన్నాయి. సైంటిస్టుల పరిశోధనలతో వాల్మీకిరామాయణంలో రామసేతు గురించి రాసిన ప్రతి అక్షరం నిజంగా జరిగినదేనని ఋజువయింది. తన లీలలకు సాక్ష్యాలుగా భగవంతుడు ఈ భూమి మీద కొన్ని రుజువులు వదిలే వెళ్తాడు. రామాయణం జరిగిందే అనడానికి రామసేతు ప్రత్యక్ష సాక్ష్యం. శ్రీకృష్ణుడు ఉన్నాడు అని చెప్పేందుకు ఇప్పటికీ ద్వారక సముద్రంలో మునిగి ఉన్న ద్వారక సాక్ష్యం. భారతదేశంలో ఎక్కడ వరకు అంటే, పూర్వకాలంలో పెద్దలు, ఆ సేతు హిమాచలం అని చెప్పేవారు. ఇందులో, సేతువు అంటే రామసేతువు, హిమాచలం అంటే హిమాలయాలు అని అర్థం. త్రేతాయుగంలో జరిగిన రామకథను వాల్మీకి రామాయణంగా వర్ణించారు. సీతను అపహరించిన రావణుని వధించి ఆమెను సురక్షితంగా తీసుకురావడానికి లంకకు వెళ్లాలి. ఆ లంకకు వెళ్లాలంటే సముద్రాన్ని దాటాలి. అలా దాటడానికి ఉన్న అన్ని అవకాశాలపై చర్చ జరిగాక, సముద్రంపై వంతెన కట్టాలని అనుకుంటాడు, రాముడు. విశ్వకర్మ అంశతో పుట్టిన నలుని సహాయంతో సముద్ర జలాలపై తెలియాడే ఒక వంతెనను నిర్మించాడు. లక్షల మంది వానరుల సహాయంతో కట్టిన వారధి, అది. అలా కట్టిన వారిని ఆ తర్వాత తరాలు కూడా భారత శ్రీలంకల రాకపోకలకు ఉపయోగించాయి. శ్రీలంకలో బౌద్ధ వ్యాప్తికి బౌద్ధభిక్షువులు ఈ వంతెనను ఉపయోగించినట్టు ఆధారాలు ఉన్నాయి.

విభీషణుడు కాలం నుంచి భారత శ్రీలంకల మధ్య ఉన్న స్నేహం ఇప్పటికీ కొనసాగుతోంది. దీనికి రాముడే పునాది వేశాడు ఆ తర్వాత

సముద్రమట్టాలు పెరిగి ఆ వంతెన క్రమంగా మునిగిపోయింది. విదేశీ పాలకుల సమయంలో ఆ వంతెనకు ఆడమ్స్ బ్రిడ్జి అని పేరు పెట్టారు. బ్రిటిష్ చరిత్రకారులు మహా మేధావులు అని మన దేశంలో ఉన్న మన ఎంతోమంది చరిత్రకారుల నమ్మకం కదా. అసలు వంతెనే లేకపోతే ఆడమ్స్ బ్రిడ్జ్ అనే పేరు ఎందుకు పెట్టాలి? అనే ఆలోచన మన హిస్టారియన్లకు ఎందుకు రాలేదో! రామసేతు అనే ఐడెంటిటీ చెడిపోవడానికి ఆడమ్స్ బ్రిడ్జి అని పేరు పెట్టారు, విదేశీ పాలకులు. కానీ, తరతరాలుగా రాముడు వేసిన దారిలో నడుస్తున్న భారతీయుల నోటి నుంచి ఏనాడూ ఆడమ్స్ బ్రిడ్జ్ అనే మాట రాలేదు. ఇప్పటికి, ఎప్పటికీ ఆ వంతెన రామసేతు గానే మనసులో నిలిచిపోయింది, నిలిచిపోతుంది కూడా.

నీటిలో మునిగిపోయి ఉన్న ఆ రాతి వంతెన ప్రస్తావన భారత పురాణాల, ఇతిహాసాల గ్రంథాల్లో ఉంది. క్రీస్తుశకం 1480 వరకు ఆ వంతెనను అప్పటి తరాలు వాడుకున్నాయి ఆ తరువాత తుఫానులో సముద్ర అలలకు ఆ వంతెన దెబ్బతింది. సముద్రం క్రమక్రమంగా పెరిగింది. వంతెన నీటిలో మునిగింది. సునామీ లాంటి పెద్ద పెద్ద విపత్తులను ఆ సేతువు ఇప్పటికీ ఆపుతుంది. ఆ మధ్య సునామీ వచ్చి చెన్నై నష్టపోయింది. ధనుష్కోటి ప్రక్కన ఉన్న పల్లెలు మాత్రం సురక్షితంగా ఉన్నాయి. కారణం, రామసేతువు. అలాంటి సేతువును తొలగించి భారతదేశ నౌకాయాన మార్గం చేద్దామని అప్పటి ప్రభుత్వాలు ప్రయత్నించాయి. సేతుసముద్రం అనే ప్రాజెక్టు కూడా స్టార్ట్ చేశాయి. కానీ,

ఆ వంతెననించి ఒక రాయిని కూడా కదపలేకపోయారు. పెద్ద పెద్ద క్రేన్ లు కూడా విరిగిపోయాయి. ఆ తర్వాత ఆ ప్రాజెక్టు కూడా మూలన పడింది

రామాయణం ప్రకారం త్రేతాయుగంలో ఈ రామసేతు నిర్మాణం జరిగింది. రామసేతు నిర్మాణ కాలం ఇప్పటికీ సరిగ్గా తెలియదు. తమిళనాడులో రామేశ్వరం కన్నా ముందు వచ్చే రైలుస్టేషన్ పంబన్ దీవి. అక్కడినుంచి శ్రీలంకలోని మన్నారుదీవి వరకు ఈ వంతెన ప్రస్తుతం కనిపిస్తోంది. విచిత్రమేమంటే, పాక్ జల సంధి, మన్నారు జలసంధులను ఈ రామసేతు విడదీస్తుంది. విచిత్రం ఏమంటే, ఈ రామసేతు ఉన్న ప్రాంతం అంతా సముద్రమట్టం మూడు నుంచి 30 అడుగుల లోతు మాత్రమే ఉంటుంది. ఇప్పటికే అదే లోతు ఉండడం ఆశ్చర్యం.

దీని వెనుక రామాయణంలోనే కథ ఉంది రాముడు ఈ సేతును నిర్మించేటప్పుడు సముద్రుడు ఉగ్రరూపంలో ఉన్నాడు. సేతువును నిర్మించేందుకు అనువుగా సముద్రుడు శాంతించాలని రాముడు కోరాడు. కానీ సముద్రుడు స్పందించలేదు. అప్పుడు రాముడు బ్రహ్మాస్త్రాన్ని ఎక్కుపెడితే, సముద్రుడు భయపడి శాంతించాడని రామాయణంలో కథ. ఇప్పటికీ రామసేతు ఉన్న ప్రాంతంలో ఒకవైపు హిందూ మహాసముద్రం, మరోవైపు బంగాళాఖాతం ఉంటాయి. ఆ రెండు సముద్రాల అద్భుత సంగమాన్ని ధనుష్కోట్లో చూడవచ్చు. ఒకవైపు సముద్రం ఎటువంటి అలలు లేకుండా ప్రశాంతంగా ఉంటే, మరోవైపు సముద్రం ఊరిని మింగేస్తుందా! అన్నట్టు ఎగిరెగిరి పడుతూ ఉంటుంది.

ధనుష్కోట్లో ఇప్పటికీ కనిపించే వింత అది. ప్రస్తుతం మనకు కనిపిస్తున్న ఈ రామసేతు 50 కిలోమీటర్ల పొడవు ఉంది. ధనుష్కోటి నుంచి ఇప్పుడు కనిపిస్తున్న శ్రీలంకకు సముద్రపు దారి 50 కిలోమీటర్లు మాత్రమే. పడవల్లో ప్రయాణిస్తే, రెండు మూడు గంటల్లో చేరుకోవచ్చు ఆ దారిలో ఒకటి రెండు చోట్ల ఇప్పటికీ రామసేతు పైకి కనిపిస్తుందని అంటారు. ఈ వంతెన కోసం వాడిన రాళ్లు నీటిపై తేలుతూ ఉంటాయి. ఆ రాళ్ల అవశేషాలను ఇప్పటికీ ధనుష్కోటి ఒడ్డున చూడొచ్చు. రెండు చేతులతో ఎత్తడానికి వీల్లేనంతగా ఆ రాళ్లు బరువుగా ఉంటాయి. కానీ, నీటిలో వేస్తే మాత్రం, తేలుతూ ఉంటాయి ఆ రాళ్లలో ఉన్న కెమికల్ కాంపోనెంట్స్ వల్లే ఇలా జరిగినా, అలాంటి రాళ్ళను ఆ కాలంలో ఎలా కనిపెట్టారు అన్నది ఆశ్చర్యం. రామాయణంలో కూడా రామసేతుకు వాడిన రాళ్లు తేలుతాయని వాల్మీకి వర్ణించారు. నలుడు ఆ రాళ్ళను ఎంపిక చేశారు అని కూడా చెప్పారు. రామేశ్వరం, ధనుష్కోట్లో ఎక్కడపడితే అక్కడ ఈ రాళ్లు కనిపిస్తూ ఉంటాయి. ఆ రాళ్ళను నీటిపై తేల్చి, మనకి అక్కడ ప్రజలు చూపిస్తూ ఉంటారు. ఇప్పుడు దొరుకుతున్న రాళ్లు మూడు నుంచి ఐదు కేజీల బరువు ఉంటున్నాయి. కానీ, రామాయణంలో వర్ణన చూస్తే ఆ కాలంలో పర్వతాల లాంటి రాళ్లను కూడా వాడినట్టు వివరణ ఉంది.

15వ శతాబ్దం వరకు రామసేతుని ప్రజలు వాడుకున్నారు. శ్రీలంకకు వెళ్లేందుకు అప్పటి వ్యాపారులకు ప్రధాన రహదారి ఈ వంతెనే. ఆ తర్వాత సముద్రాల్లో మార్పు వచ్చి, దారి నీటిలో కలిసిపోయింది. 1480లో వచ్చిన భారీ తుఫానుల వల్ల రామసేతు డ్యామేజ్ అయిందని

రామేశ్వరంలో ఉన్న రామన్ కోవెల శాసనాలు చెప్తున్నాయి. ఈ సేతుకు ఉపయోగించిన రాళ్లు అగ్ని పర్వతాలు పేలినపుడు ఏర్పడిన రాళ్లు, లేదా, లైమ్ స్టోన్ అని సైంటిస్టులు నిర్ధారించారు. కానీ, అలాంటి రాళ్లు ఒక ధనుష్కోటి ప్రాంతంలో తప్ప ఇంకెక్కడ కనిపించకపోవడం ఆశ్చర్యం. మొత్తానికి ఈ వంతెన ఏడువేల ఏళ్ళకు ముందు నుంచే ఉందని స్పష్టమైన ఆధారాలు లభించాయి. కార్బన్ డేటింగ్, ఇతర పరీక్షల్లో రామసేతు రామాయణం కాలం నాటిదే అని సైంటిస్టులు తేల్చారు. 1960లో నాసా ఒక సాటిలైట్ పిక్చర్ ని తీసింది. ధనుష్కోటి నుంచి శ్రీలంక మధ్య ఉన్న ఈ వారధి ఫోటో స్పష్టంగా కనిపించింది. ఈ వంతెనతో కూడిన శ్రీలంక ఒక కన్నీటి బిందువులా ఉందని కూడా నాసా ఒక స్టేట్మెంట్ ఇచ్చింది. 2000వ సంవత్సరంలో ఎన్డీవర్ షటిల్ రాడార్ మిషన్ లో భాగంగా తీసిన సాటిలైట్ ఫోటోలలో రామసేతు మరింత స్పష్టంగా కనిపించింది

రామసేతు వల్ల ఎన్నో ప్రయోజనాలు ఉన్నాయని సైంటిస్టులు తేల్చారు. సముద్ర అలల తాకిడి, సునామీ వంటి ప్రమాదాల నుంచి దేశాన్ని, తీర ప్రాంతాన్ని తీరంలో ఖనిజ ప్రకృతి వనరులను ఆ సేతువు రక్షిస్తోంది. ప్రపంచంలో యురేనియంకి దీటుగా పనికొచ్చే అత్యంత విలువైన థోరియం నిలువలు అపారంగా ఉన్న మన సముద్ర తీరాన్ని ఇది కాపాడుతుంది. ప్రపంచంలో ఉత్పత్తి అయ్యే థోరియంలో 30% ఇక్కడే దొరుకుతుంది. అబ్దుల్ కలాంవంటివారు విద్యుత్ ఉత్పత్తికి యురేనియం బదులు థోరియం వాడాలనే సూచనలను చేసేవారు.

2017లో రామసేతుపై డిస్కవరీ సైన్స్ ఛానల్ లో వచ్చిన డాక్యుమెంటరీ వరల్డ్ వైడ్ గా సెన్సేషన్ క్రియేట్ చేసింది. భారత శ్రీలంకల మధ్య ఉన్న రామసేతు మానవ నిర్మితమేనని ఆ ఛానల్ రుజువు చేసింది. అలాగే, భారతీయదాసన్ యూనివర్సిటీకి చెందిన సెంటర్ ఫర్ రిమోట్ సెన్సింగ్ ప్రొఫెసర్ ఎస్ఎం రామస్వామి నేతృత్వంలో 2003లో ఒక బృందం రామసేతుపై పరిశోధనలు చేసింది. రామనాథపురం పంబన్ లలో సేతువుపై వీరు పరిశోధనలు చేశారు. ఇక్కడ బీచ్ లో భూమి, సముద్రపు సుదీర్ఘ అలల తాకిడి వల్ల ఏర్పడ్డాయని, కార్బన్ డేటింగ్ పరీక్షల ద్వారా ఇక్కడ తీరప్రాంతాల వయస్సు రామాయణ కాలంతో సరిపోతుందని వారు తేల్చారు. కోరల్ పేవ్ స్ బదులుగా ఉండే ఇసుక మధ్య ఇలాంటి వంతెనలు సహజంగా ఏర్పడడం సాధ్యం కాదని కూడా వారు చెప్పారు.

మరి రామాయణంలో ఈ సేతు గురించి ఏముంది? వానరవీరులలో ప్రముఖుడైన నలుడు విశ్వకర్మ కుమారుడు "నాపై సేతువు అని అతడే నిర్మించగలడు. "ఆ సేతువుని నేను భరించగలను" అని సముద్రుడు రాముడికి చెప్పినట్టు రామాయణంలో శ్లోకాలు ఉంటాయి. సేతు నిర్మాణ కౌశలం నాకు తెలుసని, మన వానరసేనతో ఆ కార్యాన్ని నెరవేరుస్తానని అన్నాడు, నలుడు. శ్రీరాముడు సేతునిర్మాణనికి ఆజ్ఞాపిస్తే లక్షల మంది వానరవీరులు మహావృక్షాలను, పెద్దపెద్ద పొదళ్లను తీసుకొచ్చి, సముద్ర తీరానికి తెచ్చారు. ఏనుగులంత ఎత్తున బండరాళ్లను పర్వతాలను పెకలించి, యంత్ర సాయంతో సముద్రతీరానికి చేర్చారు, వానరులు. యంత్రం గురించి రామాయణంలో

ఉంది. ఆ యంత్రం ఏంటో తెలియదు. నలుడు సముద్రంపై సేతు నిర్మాణం ప్రారంభించాడు. వానరులు అంతా సహకరిస్తున్నారు. కొందరు పర్వతాలను తీసుకువచ్చారు. ఇంకొందరు దారికి అటు ఇటు కర్రలు పాతి వాటిని వరుస క్రమంలో గడ్డి పోచలను పెనవేసి కడుతున్నారు. ఏ రోజు ఎంత ఎంత దూరం కట్టారో కూడా, రామాయణంలో ఉంది. ఐదు రోజుల్లో ఈ వంతెన నిర్మాణాన్ని ముగించారు. వానరులు. ఆరో రోజు సముద్రానికి అవతల ఉన్న లంకలో సువేల పర్వతానికి చేరుకున్నారని వాల్మీకి రామాయణం యుద్ధకాండలో 69 నుంచి 73 వరకు ఉన్న సర్గలు చెబుతున్నాయి. ఇలా రామాయణంలో విశ్వకర్మ అంశతో పుట్టిన నలుడు రామసేతును నిర్మించాడని యుద్ధకాండలో స్పష్టంగా ఉంది. ఈ సేతువు 10 యోజనాలు వెడల్పు, 100 యోజనాలు దూరం ఉందని రామాయణం చెప్తుంది. యోజనం అంటే సుమారు ఎనిమిది మైళ్ళు ఆ లెక్కన ఎనిమిది వందల మైళ్ల దూరం ఈ సేతువును నిర్మించారని రామాయణం చెప్తుంది. ఇప్పుడు మనకు ఆధారాలుగా కనిపిస్తున్న రామసేతు 50 కిలోమీటర్లు. ఆ లెక్కన, మనం ఇప్పుడు చూస్తున్నది అసలు శ్రీలంకలో ఒక భాగం మాత్రమేనా? అసలు లంక సముద్రంలో మునిగిందా? అన్నది కూడా పరిశోధించాలి. పురాణాల్లో చెప్పిన లంకలో కొన్ని ఆనవాళ్లు మాత్రమే ఇప్పుడు శ్రీలంకలో కనిపిస్తున్నాయి. ద్వారకలాగే అసలు లంక కూడా సముద్రంలో మునిగిందా? మునిగితే, ఎక్కడుంది? అన్నది పరిశోధించాలి. అలా లక్షల సంఖ్యలో వానరులు రామసేతుని నిర్మించారు. ఇంకా ఎన్నో మిస్టరీలు రామసేతులాగే సముద్రంలో

మునిగిపోయాయి. మన భారతదేశ చరిత్రకు మూలమైన రెండు ప్రధాన సాక్ష్యాలు సముద్రంలో కలిసిపోయాయి. ఒకటి, త్రేతాయుగం నాటి రామసేతు. ఇంకొకటి, ద్వాపరయగంలోని శ్రీకృష్ణుడు నడిచిన నేల ద్వారక. ఈ రెండిటిని లోతుగా అధ్యయనం చేస్తే, ఇప్పుడున్న చరిత్ర పుస్తకాలను అన్నిటిని మార్చాల్సి వస్తుంది.

# ఆర్యభట్ట

సున్నా లేకపోతే ఈ ప్రపంచమే లేదు. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం అంతా సున్నాలోనే. సున్నా లేకపోతే డిజిటల్ లాంగ్వేజ్ లేదు. కంప్యూటర్లూ లేవు. విలువలేదు అనుకున్న 0 విలువ అనంతం అని ప్రపంచానికి చాటి చెప్పిన మొట్టమొదటి గణిత శాస్త్రవేత్త ఆర్యభట్ట.

ఆర్యభట్ట ఈ ప్రపంచంలోనే అత్యున్నత గణిత శాస్త్రవేత్త. ఇప్పుడున్న ఏ గణిత శాస్త్రవేత్త అయినా ఆర్యభట్ట తర్వాతవారే అవుతారు తప్ప, ఆయనకన్నా ముందు అని చెప్పే అవకాశమే లేదు. ట్రిగనామెట్రి, అర్థమెటిక్, ఆల్జీబ్రా, సైన్ వాల్యూస్, ఇలా చెప్పుకుంటూ పోతే ప్రపంచంలో ఇప్పుడు వినియోగిస్తున్న గణిత శాస్త్రానికి తొలిమెట్టుగా ఆర్యభట్టే కనిపిస్తాడు. గుప్తుల స్వర్ణయుగంలో, అద్భుతమైన పరిశోధనలు జరుగుతున్న సమయంలో, ఆర్యభట్టకు ఆనాటి చక్రవర్తులు మంచి గుర్తింపు ఇచ్చారు. లేకుంటే భూమి గుండ్రంగా ఉందని, గ్రహణాలు నీడల వల్ల ఏర్పడతాయని అంత స్వేచ్ఛగా గ్రంథస్థం చేశాడంటే, ఆ కాలంలో రాజ్యాలు ఎంతో అభివృద్ధి చెంది ఉండాలి. మతనియమాలకు వ్యతిరేకమైన పరిశోధనలు చేసినందుకు సోక్రటీస్ కి, గెలీలియోకి పట్టిన గతిని చరిత్రలో చూసాం. కానీ, భారతదేశంల క్రీస్తు పూర్వమే ఆధునిక భావజాలంతో ఉందనడానికి ఆర్యభట్ట, వరాహ మిహిరుల గ్రంథాలు, వారి పరిశోధనలు సాక్ష్యం. ప్రస్తుతం పాట్నాగా పిలుచుకుంటున్న ఆనాటి పాటలీపుత్రంలో ఆర్యభట్ట తన జీవితంలో ఎక్కువకాలం ఉన్నాడు. అక్కడ

విశ్వవిద్యాలయంలో ఆయన చాలా కాలం గణిత ఆచార్యుడు. ఆర్యభట్టీయం, ఆర్య సిద్ధాంతం, ఖగోళాధ్యాయం లాంటి గొప్ప శాస్త్ర గ్రంథాలు రచించి, గణితం, ఖగోళంలో అప్పటివరకు ప్రపంచంలో ఎవరికీ తెలియని ఎన్నో గొప్ప పరిశోధనలు చేశాడు. సంస్కృత భాషకు, గణిత శాస్త్రానికి మధ్య ఉన్న సంబంధాన్ని మరో గ్రంథంలో రచించాడు. గణితంలో కటపయాది పద్ధతిని ఉపయోగించాడు. అప్పటికే వేదాల్లో సున్నా ప్రస్తావన చాలా ఉంది. " పూర్ణమిదం, పూర్ణమదమ్ " అనే మంత్రం సున్నాకు సంబంధించినదే. ఇన్ఫినిటీని అనంత విశ్వంతో పోలిస్తూ చెప్పే గ్రేట్ మ్యాజిక్ మంత్రం అది. కానీ 0 విలువను ప్రపంచానికి పరిచయం చేసింది మాత్రం ఆర్యభట్టే. ఆధునిక గణితంలోనూ, ట్రిగ్నోమెట్రీలోనూ ఇప్పటికీ వినియోగిస్తున్న సైన్, కొసైన్లను కనిపెట్టింది ఆర్యభట్టే. సైన్ వాల్యూని ఆర్యభట్ట జ్యా అని పిలిచారు. ఖగోళ గణితశాస్త్రంలో ఆర్యభట్ట అందించిన సేవలకు గుర్తుగానే భారతదేశం మొట్టమొదటి సాటిలైట్ కి ఆర్యభట్ట అనే పేరు పెట్టారు. ఆర్యభట్ట గ్రంథాలను మనకన్నా ఎక్కువ స్టడీ చేసింది గ్రీకులే. వారు ఆర్యభట్ట రాసిన ప్రతి అక్షరాన్ని ట్రాన్స్లేట్ చేసుకున్నారు. ఆయన శిష్యరికం కోసం పాటలీపుత్రకు వచ్చారు. గ్రీకులు ఆర్యభట్టను ఆర్డ్వేరియస్ అని పిలిచేవారు. వెయ్యి సంవత్సరాల క్రితం భారత్ ను సందర్శించిన అల్బెరూని అనే అరబ్ యాత్రికుడు ఆర్యభట్ట గురించి చాలా వివరంగా రాశాడు. అతను హిమాలయాల ఎత్తును కొల్చినట్టు అల్ బెరూని రాశాడు. అంటే, ఆర్యభట్టు తన గణిత శాస్త్ర సిద్ధాంతాలతో పర్వతాల ఎత్తును కొలిచే విధానాన్ని కూడా కనిపెట్టాడు.

ఆర్యభట్ట పుట్టింది కూడా పాటలీపుత్ర సమీపంలోనే. కుసుమపుర ఆయన సొంతూరు. 23 ఏళ్ల వయసులోనే ఆర్యభట్టీయమనే గ్రంథాన్ని రాసిన జీనియస్, ఆర్యభట్ట. కలియుగంలో 3600 సంవత్సరంనాటికి తన వయస్సు 23 సంవత్సరాలు అని ఆయనే ఆర్యభట్టీయంలో రాసుకున్నారు. యుధిష్ఠిరశకాన్ని ఆయన ప్రామాణికంగా తీసుకున్నాడు. దీనినిబట్టి మహాభారత కాలాలపై కూడా ఆయన రీసెర్చ్ చేశారని అంటా. రు ఆర్యభట్ట తన జీవితంలో ఎక్కువ భాగం గణిత, ఖగోళ పరిశోధనలు చేశాడు. ఆ వివరాలను దశగీతిక అనే గ్రంథంలో రాశాడు ఆర్యభట్టీయ గ్రంథంలోని మొదటి భాగం దశగీతిక. రెండో భాగం ఆర్యోష్టోత్తర శతకం. దశగీతికలో 13 శ్లోకాలు ఉన్నాయి. చిన్న చిన్న సూత్రాల్లో అద్భుతమైన జ్ఞానాన్ని రచించాడు, ఆర్యభట్ట. ఆర్యభట్ట ఖగోళ గణిత శాస్త్రాలలో ఎన్నో రచనలు చేశాడు. వాటిలో చాలావరకు ఇప్పుడు దొరకటం లేదు. పై విలువ 3. 1416 అని ఖచ్చితంగా ప్రకటించిన మొట్టమొదటి సైంటిస్ట్ ఆర్యభట్ట. ప్రపంచానికి పై అనేది ఒకటి ఉందని చెప్పింది ఆర్యభట్టే. " త్రిభుజస్య పాలా శరీరం సమదలకోటి భుజార్ధ సంవర్గమ్". అనే ఒక సూత్రంలో త్రిభుజం యొక్క వైశాల్యం దాని భూమి, ఎత్తుల లబ్ధంలో అర్ధభాగానికి సమానమని చెప్పాడు. ఇప్పటికీ అదే సూత్రం పాటిస్తున్నాం. ఇంజనీరింగ్ విద్యలో ఈ సూత్రం చాలా కీలకం. భూమి నీడ చంద్రుని మీద పడడం వల్లే గ్రహణాలు వస్తాయని, రాహు కేతువులంటే నీడలేనని చెప్పినవాడు ఆర్యభట్ట. భూమి గోళాకారంగా ఉంటుందని చెప్పింది ఆర్యభట్టే. తన గోళాధ్యాయం అనే గ్రంథంలో భూమి

గురించి ఎన్నో విషయాలు రాశాడు. మన గ్రహాల యొక్క కాంతి స్వయం ప్రకాశం కాదని, అది సూర్యకాంతి వల్ల వచ్చినదని చెప్పిన మొదటి శాస్త్రజ్ఞుడు ఆర్యభట్టే. సూర్యగ్రహణాలను కచ్చితంగా లెక్క కట్టాడు. భూమి తన చుట్టూ తాను తిరగడానికి 23 గంటల 56 నిమిషాల 4. 1 సెకండ్లు పడుతుందని ఈ ప్రపంచానికి మొదటి చెప్పింది ఆర్యభట్టే. ఆ కాలం లిప్తలనుబట్టి ఆయన చెప్పాడు. ఆధునిక లెక్కల ప్రకారం అది 23 గంటల 56 నిమిషాల 4. 091 సెకనులుగా తేలింది. అంటే, ఆర్యభట్ట లెక్క అంత కరెక్ట్ గా ఉంది. అది వేల ఏళ్ళక్రితం వేళ్ళ మీద కట్టిన లెక్క. అది. "భూగోళః సర్వతో వృత్తః "అని ఆర్యభట్ట రాశాడు. భూమి గోళమని ఆ మాటలోనే ఉంది. భూమి, నక్షత్ర గోళానికి మధ్యగా, నిరాధారంగా ఉందని చెప్పాడు. అనంత విశ్వంలో భూమి గురుత్వాకర్షణ శక్తితో వేలాడుతోంది అని చెప్పాడు. ఇవన్నీ ఋగ్వేదంలో కనిపించే సిద్ధాంతాలు. వాటిని పామర జనానికి కూడా అర్థమయ్యేలా పాఠాలుగా విభజించాడు ఆర్యభట్ట. ఖగోళాన్ని ఒక సబ్జెక్టుగా మార్చిన గొప్ప ఉపాధ్యాయుడు ఆర్యభట్ట. భూమి తన చుట్టు తాను తిరుగుతూ, సూర్యుని చుట్టూ తిరుగుతోంది అని ఈ క్రింద శ్లోకంలో చెప్పాడు ఇది కనిపెట్టిన మొదటి వ్యక్తి కూడా ఆర్యభట్టే. ఈయన సిద్ధాంతాలనే గ్రీకు మేధావులు బట్టీ పట్టి, మళ్ళీ మనకే చెప్తే, వాళ్ళ పేర్లే మనం చరిత్రలో చదువుకుంటున్నాం. ", భూపంజరస్థిరో–– వృత్తావృత్తేన ప్రాతిదైశిక ఉదయాస్తమయోః సంపాదయతి నక్షత్ర గ్రహాణామ్" అనే శ్లోకాన్ని ఆర్యభట్ట రాశాడు. దీని అర్థం ఏంటంటే, నక్షత్ర గోళం స్థిరంగా ఉంది, అంటే, సూర్యుడుచుట్టూ ఈ భూమి తిరుగుతూ

నక్షత్రాలు గ్రహాలకు పొద్దున్న, రాత్రులను సృష్టిస్తుంది. అంటే, భూమి తిరగడం వల్లే పగలు రాత్రి ఏర్పడుతున్నాయని అర్థం. అంతేకాదు, సూర్యుని చుట్టూ గ్రహాలు వృత్తాకారంలో కాకుండా దీర్ఘం వృత్తాకారంగా తిరుగుతాయని చెప్పింది కూడా ఆర్యభట్టే. ఇలా ఒకటి కాదు, ప్రపంచానికి గణితం అంటే ఏంటో తెలియని రోజుల్లోనే ఆర్యభట్ట గణితంపై పరిశోధనలు చేశాడు. అంకెలతో ఆడుకున్నాడు. వేదాల్లో ఉన్న సైన్స్ ని అందరికీ అర్థమయ్యేలా చెప్పాడు. సున్నా విలువను ప్రపంచానికి చెప్పాడు. అంత గొప్ప మేధావి గురించి ఈ తరం వారికి తెలిసింది తక్కువే. ఆయన కనిపెట్టిన చాలా విషయాలను గ్రీకులు కనిపెట్టారు అని రాస్తే, అదే చరిత్ర అనుకుని చదువుకుంటున్నాం.

# బ్రిటిష్ పాలనలో తిరుమల

బ్రిటిష్ ఇండియా పాలనలో హిందూమతం ఒక దయ్యం. హిందూమతం ఒక వ్యక్తి చేతనో, లేదా, ఒక ప్రవక్త చేతనో స్థాపించబడలేదు. అందువలన హిందూమతానికి స్థాపకుడు అనేవాడు లేడు. దీనికి మనలాగా తెచ్చిపెట్టుకున్న మిషనరీ లక్ష్యాలు కానీ, లక్షణాలు కానీ, ఏమాత్రం లేవు. హిందువులను, హిందూసమాజాన్ని, అంతకంటే ముందుగా, వారి అస్తిత్వాన్ని నిలబెడుతూ, హిందువులకు మార్గదర్శక నాయకత్వం వహిస్తున్న బ్రాహ్మణులను ఉక్కుపాదం మోపి అణగ ద్రొక్కాలి. ఏ విధంగానైనా వారిని దెబ్బతీసి, వారిని ఆర్థిక దారిద్రానికి గురిచేసి, ఆ తర్వాత వాళ్లను మన కంపెనీ సేవకులుగా చేయాలి. ఆలయాల వ్యవస్థను, తద్వారా హిందూమత సమాజపు పునాదులను నిర్వీర్యం చేయాలి. హిందూ సమాజంలోనే వర్ణ కుల వర్గ బేధాలు సృష్టించి, వారిలోనే వారికి ఐక్యమత్యం లేకుండా చేసి, బలహీనపరచాలి. భూములు, గ్రామాలు దేవాదాయములనుండి తీసివేసి, వాటి మూలంగా దేవాలయాలకు వైభవం లేకుండా చేసి, దాని మూలంగా బలహీనపడేటట్లు చేయాలి. ఆలయంలో జరిగే ఉత్సవాలకు వైభవం లేకుండా చేసి, మెల్లమెల్లగా ఆలయ వ్యవస్థను మరుగున పడేటట్లు చేయాలి, దీనికి, మునుపే ముస్లిం పాలకులు ప్రవేశపెట్టిన తస్తీక్ అనే నామమాత్రపు కంటితుడుపు నష్టపరిహారం ఇచ్చినట్లుగా ఇచ్చి, ఈ మిషతో ఆలయానికి సంబంధించిన ఆదాయాలు, భూములను సర్వసంపదలను కొల్లగొట్టి, భక్తుల నుండి ఆలయాలను నెమ్మదిగా,

నిశ్శబ్దంగా దూరం చేయాలి. ఇటువంటి దురాచార దౌర్భాగ్యపు ఆలోచనలను బ్రిటిష్వారు చేశారు –. అనేందుకు చాలా గట్టి ఆధారాలు ఉన్నాయి.

కలియుగంలో తిరుమల ఉనికి ప్రపంచానికి తెలిసిన తర్వాత నాటినుంచి, అంటే, 1801 నుంచి, 1843 వరకు 43 ఏళ్ల పాటు తిరుమల ఆలయ పాలన బ్రిటిష్ ఈస్టు ఇండియా కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ నార్త్ ఆర్కాట్ జిల్లా కలెక్టర్ నేతృత్వంలో సాగింది. ఈ సమయంలో కుట్రపూరిత ఆలోచనలతోనే తిరుమల ఆలయానికి చెందిన అన్ని గ్రామాలను స్వాధీనం చేసుకుని, ఆంగ్లేయులు, ఆ తరువాత ఆ ఆలోచనలోని క్రమంలోని కుట్రలో భాగంగానే, అంతకమునుపు తిరుమలలో ప్రతి సంవత్సరం ఆనవాయితీగా జరిగే తొమ్మిది బ్రహ్మోత్సవాలను ఆపివేసి, కేవలం ఒకే ఒక్క బ్రహ్మోత్సవానికి పరిమితం చేసి, అలాగే జరిగేలా ప్రవేశపెట్టారు. తిరుమలలో జరిగే బ్రహ్మోత్సవాలలో నిత్యపూజాది నైవేద్యాలకు, బ్రహ్మోత్సవాలకు, నిత్య కైంకర్యాలకు, పేటికి నిధులు లేకుండా చేసి, కొండమీద యాత్రికుల వసతి సదుపాయాలు చేసే అన్నసత్రాలకు, రామానుజ కూటాలకు, మఠాలకు కూడా ఆదాయం లేకుండా చేయడం వలన ప్రతి సంవత్సరం తిరుమల ఆలయానికి వచ్చే ఆదాయం క్రమంగా ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం తగ్గిపోయేటట్లు చేసి, చివరకు, అలా రాగా మిగిలిన ఆదాయాన్ని కూడా బ్రిటిష్ సర్కారు ఖజానాకు తరలించడం జరిగింది. రోజువారీగా వచ్చే కానుకలు, నగలు కూడా బ్రిటిష్ ప్రభుత్వం ఆధీనం చేసుకుంది. అలా విజయనగర రాజులు,

ఇతర రాజులు అప్పటికే ఇచ్చి ఉన్న అనేక బంగారు ఆభరణములను, నగలను, కిరీటాలను, కానుకలను, మొత్తం ఈ కాలంలోనే బ్రిటిష్ ప్రభుత్వం తన సొంతం చేసుకోవడం జరిగింది అని తెలుస్తోంది. చివరగా, స్వామివారి ఒంటి మీద ఉన్న నగలు, ఆభరణాలు మాత్రమే ఆయనకు మిగిలాయి. అయితే, ఈ విషయం అంతా ప్రపంచానికి ఎలా తెలిసిందంటే, 19వ శతాబ్దం మొదటి రోజుల్లో ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనలో వారి వ్యాపార పరిధిలో ఉన్న ప్రాంతాలు బ్రిటిష్, విదేశీ ఇండియా, చైనా, ఆస్ట్రేలియాల విశేషాలు సంబంధించిన ఒక ఏసియాటిక్ జర్నల్ నెలవారి వార్తల రిజిస్టర్ ఒకటి లండన్లో ప్రచురింపబడేది. ఆ పత్రికలో 1831 మే–ఆగస్టుకు చెందిన పత్రికలో, ఒక ఆసక్తికరమైన వ్యాసం తిరుమల ఆలయం గురించి ప్రచురించబడింది. అది రాసింది మరెవరో కాదు, ఒక ఆంగ్ల రెవిన్యూ అధికారి. అప్పట్లో తిరుపతి అంతా కూడా అతని ఆధీనంలో ఉండేది. ఆలయంతో ఆయనకు నేరుగా సంబంధం లేకపోయినా, తాలూకా రికార్డుల ద్వారా ఆలయ విషయాలు ఆయనకు పూర్తిగా తెలిసేవి. ఆ తర్వాత, ఆయన తిరుమల గురించి చాలా పరిశోధన చేసి, ఆనాటి విషయాలు కళ్ళకు కట్టినట్లుగా ఆనాటి ఆంగ్లేయలలో హిందూమతం పైన, విగ్రహారాధన పైన ఆలయ వ్యవస్థ పైన, ఆయనకు ఉండే దురభిప్రాయాన్ని కూడా కలిపి వర్ణించి, వ్యాసంలో పొందుపరిచాడు. అలా తాను రాసిన వ్యాసాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీకి పంపాడు. ఆ వ్యాసంలోని సారాంశం ఆనాటి ఆలయానికి సంబంధించిన విషయాలకు,

పరిస్థితులకు అద్దం పట్టేటట్లుగా కనబడుతుంది. ఇంతకీ, అతడు పంపిన వ్యాసంలోని సారాంశం ఏమిటంటే—

ఇండియా నలుమూలలోనుండి వేలంపెర్రిగా అనేకమంది భక్తులు ఈ తిరుమల ఆలయానికి వచ్చి, అనేక కానుకలు ఇవ్వడం చాలా ఆశ్చర్యకరము, మరియు ఒక విచిత్రమైన విశేషము. ఇక్కడికి రాజులు మొదలైనవారంతా వారే వచ్చి, అనేక బంగారు వెండి ఆభరణాలు, వజ్రాలు, రత్నాలు పొదిగిన కిరీటాలను ఈ రాతిబండ విగ్రహానికి కానుకలుగా తెస్తారు. ఒక్కోసారిగా వారికి వీలు లేకపోతే, వారి ప్రతినిధుల ద్వారా ఆయినా కూడా ఆలయానికి ఇలా కానుకలు పంపే సాంప్రదాయం వీరికి ఉంది. ఆ విధంగా ఒక రాజులు, జమిందారులే కాక, చాలా పేద ప్రజలు, గ్రామీణులు కూడా వారికి తినడానికి తిండి లేకపోయినా, పస్తులు ఉన్నా సరే, వారికి ఉన్న దాంట్లో తృణమో, పణమో, లేక రాగి నాణెమో, ఇలా ఏదో ఒక నాణాన్ని పసుపు, కుంకుమ, బియ్యం కలిపిన పదార్థాలతో దానిని పెద్ద ముడుపుగా కట్టి ఇక్కడికి తీసుకొని వస్తారు ఇదంతా ఎందుకంటే, కొండమీద రాతి విగ్రహంకోసం. ఈ విగ్రహం తిరుపతికి సమీపప్రాంతంలో ఉన్న నారాయణవనంలోని ఆకాశరాజు కూతురును పెళ్లి చేసుకున్నదట. ఆ సమయంలో ఆ రాతి విగ్రహం దగ్గర పెండ్లి ఖర్చులకు డబ్బులు లేక కుబేరుడు దగ్గర అప్పు తీసుకున్నదట, ఈ రాతి విగ్రహం, అనగా, వీరి దేవుడు. ఇలా తీసుకున్న ఆప్పుకు వడ్డీతో కలిపి ప్రతి సంవత్సరం వచ్చే ఆదాయాన్ని స్వర్ణముఖి నది మధ్య భాగంలో పాలించే రాజులకు అప్పు కింద జమ చేసి చెల్లించాలని ఆ రాతి విగ్రహం

నియమం పెట్టిందట. ఆ విధంగా దేవుడు అనబడే ఈ రాతి విగ్రహంపై భక్తితో వేలాది మంది భక్తులు ప్రతి సంవత్సరం జరిగే బ్రహ్మోత్సవాలకు తండోపతండాలుగా వస్తారు. సంవత్సరానికి లక్షల రూపాయలలో వచ్చే ఆదాయంలో నూటికి నూరు శాతం ఈ తొమ్మిది బ్రహ్మోత్సవాల నుండే వస్తాయి. కృష్ణదేవరాయలకు ముందు కాలంలో సంవత్సరానికి 7 బ్రహ్మోత్సవాలు జరిగేవి. ఇవికాక, తిరుపతి గోవిందరాజస్వామి రెండు బ్రహ్మోత్సవాలు. మొత్తం కలిపి ఇట్టా తొమ్మిది బ్రహ్మోత్సవాలు జరిగేవి. ఇలా వచ్చిన డబ్బును దేవాలయానికి సంబంధించిన బ్రాహ్మణులు గుడిలో పూజలకు, నైవేద్యాలకు దేవుడి ఉత్సవాలకు వాడుకునేవారు. కానీ, ముసల్ మానులు ఈ స్వామివారి ఆదాయాన్ని తమ స్వంతం చేసుకోవటం మొదలుపెట్టారు. కానీ, అసలు విషయం ఏమిటంటే, ఈ ఆలయం ఆదాయాలను చట్టపరంగా అదివరకు ముసల్మాన్ రాజుల అనుభవించేవారు. పరుల జోలికి పోకుండా ప్రశాంతంగా జీవించే హైందవుల స్వేదాన్ని, రక్తాన్ని తమదైన కుట్రపూరిత విధానాలతో ఊచకోత కోసి, వారి నుండి సంపాదించారు, కనుక, ఇక మన కంపెనీ విషయంలోనూ అంతే. కోరమండల్ సముద్రతీరంలో ఉన్న మన వ్యాపారమంతా దెబ్బతినకుండా, మనం చేసిన యుద్ధాలు మన సైనికులు అర్పించిన ఆసువులు, వాటికి మనకు వచ్చిన మొదటి ఆదాయంగా ఈ ఆలయ నిధులను గుర్తించాలి. అదే ప్రతి సంవత్సరం మనం చేసినదానికి వచ్చే ప్రతిఫలంగా మనం భావించవచ్చు. మన బ్రిటిష్వారికి ఫ్రెంచ్వారితో జరిగిన యుద్ధాలలో భాగంగానే ఆర్కాట్ నవాబు ఫ్రెంచివారి సైన్యంతో

కలిసి మనపై పోరాడి, ఓడి పోయాడు. ఆ విధంగా ఆ ప్రాంతంలో ఈ ఆలయం నుండి వచ్చే ఆదాయమే మన మొదటి విజయంగా మనం భావించవచ్చు. ఆర్కాట్ నవాబు అంటే ముసల్మాన్. ఇక్కడ ఆదాయాన్ని మన బ్రిటిష్వారి ఆధీనం చేశాడు. ఆ విధంగా హిందూ భక్తులు కానుకలు ఏ వస్తువైనా కావచ్చు, ఏ రూపంలో నైనా కావచ్చు, బంగారు వెండి ముద్దలు, అన్ని రకాల నాణాలు, రూపాయల సంచులు, రాగి డబ్బులు, మసాలా దినుసులు, ఇంగువ, తలనీలాలు, అంటే, చిన్నప్పటి మొక్కులు అవి. పురుషుడు కానీ, స్త్రీలు కానీ, తమ తల్లిదండ్రులు, వారి చిన్నప్పుడు వెంట్రుకలు ఇస్తామని మొక్కుకుంటే, అది ఎన్నాళ్ల తర్వాత అయినా ఇవ్వవలసి వస్తుంది. ఈ రాతి విగ్రహం ముందు ఒక అందమైన భామ తన ఒంటి మీద దగదగా మెరుస్తున్న నగలు అన్ని ఒలిచి బంగారు జలతార చీర విప్పి, చిరిగిన వస్త్రాలు కట్టుకొని, ఆ విప్పిన అవన్నీ కుప్పెనలో వేసి నిలువ దోపిడీ ఇవ్వడం, తాను ఈ పని చేయడానికి ఆ అందమైన భామ ఆనందంగా వందల మైళ్ళు ఎంతో ప్రయాసలకులోనై రావటం ఎంతైనా చాలా ఆశ్చర్యము, మరియు ఒక విచిత్రమైన విశేషం. ఈ యాత్ర తప్ప ఆమె తన జీవితంలో అంతవరకు ఊరి బయటకే వచ్చి ఉండకపోవచ్చు. కొడుకు పుట్టాలనో, పుట్టిన కొడుకు ఆరోగ్యంగా ఉండాలనో, తన శిశువు కాలి అందెలు, చేతి గాజులు విప్పి కుప్పెనలో వేస్తే, ఈ రాతి విగ్రహం తనపై తన శిశువు పైన అనుగ్రహం చూపుతుందని నమ్మకం వీరిలో దృఢంగా ఉంది. దేశాన్ని పాలించే రాజులైతే, శత్రువులను జయించడానికో శత్రువులతో సామరస్యం కావడానికో, వ్యాపారస్తులయితే

వ్యాపార వృద్ధి కావడానికో, ఆరోగ్యం కుదుటపడాలనో, కొడుకుకో కూతురుకో పెళ్లి కావాలనో, ఇలా ఎవరైనా కావచ్చు, ఏదైనా కావచ్చు, ఇచ్చేది రాతి విగ్రహంలో ఉండేది దేవుడే అని మొక్కుకొని బయలుదేరుతారు, మంచి జ్ఞానం కల పండితులు, ఏ విషయం తెలియని పామరులు కూడా. ఈ రాతి విగ్రహపు తిరుపతి దేవుని విషయంలో గుడ్డి నమ్మకం కలవారే అలా మొక్కుకున్నవారే ఈ కానుకలను తేవాలని లేదు. వారి బంధువుల ద్వారా, స్నేహితుల ద్వారా, వకీళ్ల ద్వారా, అన్నింటిని మించి, గోసాయిల ద్వారా పంపే సంప్రదాయం కూడా వీరిలో ఉంది. గోసాయిలు అంటే ఉద్యోగులులాంటివారు. ఆలయం అటువంటివారిని చాలామందిని నియమిస్తుంది బ్రహ్మోత్సవాలకు కొన్ని నెలల ముందు ఈ గోసాయిలను అందరిని ఆలయం అధికారులు పంపుతారు. గోసాయిలు వారు వెళ్ళవలసిన ప్రాంతం చేరాక, వారు తమతో తెచ్చిన ఆలయపతాకాన్ని ఎగురవేసి, ఆలయంవారు ఇచ్చిన అధికార పత్రాన్ని అందరూ చూసేటట్టు ప్రదర్శిస్తారు. ఈ పతాకం చుట్టూ హిందూ విగ్రహారాధకులు చేరి, భజనలు చేస్తూ, ఆ గోసాయిలకు వారి వారి కానుకలు భగవంతునికి సమర్పించమని ఇస్తారు. కొందరు గోవులను కూడా ఆ రాతి విగ్రహానికి గో పరిరక్షణకోసం కానుకగా సమర్పిస్తారు. సొంతంగా రాదలుచుకున్నవారు ఆ గోసాయిలతో కలిసి తిరుమలకు వస్తారు. అలా గ్రామ గ్రామాలను తిరిగి. కానుకలు, జనాన్ని పోగుచేసిన గోసాయిలు తిరుమల ప్రయాణం అవుతారు. ఇదంతా గుడ్డివాడు, మరికొందరు గుడ్డివాళ్ళని తన వెంట తీసుకుని వెళుతున్నట్లుగా

ఉంటుంది. వీరందరు బ్రహ్మోత్సవాల సమయానికి కొండకు చేరుతారు. అయితే, ఈ గోసాయిలకు భక్తులు ఇచ్చే కానుకలు దొంగిలించే సాంప్రదాయం లేదు. వారికి తృణమో, పణమో భక్తులనుండి ముడుతుంది. దానితో వారు సంతృప్తి చెందుతారు. దారి ఖర్చులు వగైరా దేవస్థానమే భరిస్తుంది. యాత్రికులు గోసాయిల ద్వారా రావటానికి ఆసక్తి చూపుతారు. అలా వస్తే, వారి వసతికి, భోజనం వసతికి, దర్శనానికి ఇబ్బంది ఉండదు. అన్ని విషయాలు గోసాయిలే చూసుకుని, భక్తులకు అన్ని సౌకర్యాలు కల్పిస్తారు. అలా వీరందరూ కలిసి తిరుమల కొండ మీదికి బయలుదేరి వస్తున్నప్పుడు "గోవిందా! గోవిందా!" అని అరుచుకుంటూ కొండకు వస్తారు. నేను తిరుపతికి ప్రయాణం చేస్తున్నప్పుడు అలాంటి ఎన్నో గుంపులను, యాత్రికులను ఇలా భక్తితో గోవింద నామం చేస్తూ రావటానికి చూశాను. వీరు వస్తున్నప్పుడు దారంతా ఎంతో సందడిగా ఉంటుంది. నాకు అది ఏదో ఆటవికుల గుంపు చేస్తున్న హడావుడిగా అనిపిస్తుంది. వీరు వివిధ రూపాలలో కానుకలు ఇచ్చేవారు, దానితో ఆలయ కైంకర్యాలను చేసేవారు, కానుకలను జమ చేసే గదికి దానికి వారు కుప్పెన అనే పేరు పెట్టారు. ఆదినుండి వస్తున్న హిందువుల చరిత్ర. అయితే, ఈ కానుకలు, వితరణలు బాగా పెరిగిపోయాయి. ఆదాయానికి ఒక లెక్క, పద్దు ఉండాలనే యోచనను మన ఈస్ట్ ఇండియా కంపెనీ చేసింది. దానితో మన బ్రిటిష్ పాలకులు1821, 25, జూలై తేదీలో కుప్పెన స్థానంలో తొలిసారిగా ప్రత్యేకమైన హుండిని ఏర్పాటు చేశారు. హుండీ కోసం ఒక గంగాళాన్ని

తీసుకొని, దాని చుట్టూ తెల్లని వస్త్రాన్ని కప్పేసి, దానిపైన వేంకటేశ్వర స్వామి తిరునామాన్ని ఏర్పాటు చేసి తాళ్లతో పైకి లాగి కడతారు. అలా చేసిన, కరెక్టుగా, ఒక్క సంవత్సరానికి, అంటే, 1822లో మొత్తమాదాయం ఒక లక్ష 42, 000. ఆ విధంగా, మనం కుప్పెనను కాలక్రమేణ హుండీగా పరిగణలోకి తీసుకొని వచ్చాం. హుండీని ఎలా ఎక్కించాలి? ఎలా దించాలి? అనే విషయంలో ఒక ప్రత్యేకమైన చట్టాన్ని కూడా ఏర్పాటు చేశాం. ఇది బ్రూస్ కోడ్ 12లో ఉంది. ఇక, ఆదాయాలు, ఆస్తుల వ్యవహారంపై బాధ్యతలు వారికి వదిలేద్దాం. అంటే, ఎన్నో గ్రామాల ఆదాయం, ఎన్నో భూములపై వచ్చే శిస్తులు పోవటం, కొన్ని గ్రామాలకు శిస్తులు మాఫీ చేయటంలాంటివన్నీ మనకు నష్టమే కదా. ఇంకో విధంగా ఆలోచిస్తే, చాలా వరకు భూములు, గ్రామాలు బ్రాహ్మణులకు ఇనాముగా ఉన్నాయి. వారు శాస్త్రం ప్రకారం బ్రాహ్మణులు నాగలి పట్టి వ్యవసాయం చేసే పనిని వారు చేయరు. మిగిలిన కులాలవారు వీరికి దాదాపు దాసులవంటివారు కష్టం రైతులది, ఫలితం బ్రాహ్మణులది, మధ్యలో నష్టం మన సర్కారుది. ఇటువంటి వ్యవస్థని మార్పు చేయాలని దేవస్థానం భూములు గ్రామాలన్నీ మన కంపెనీ ఆధీనంలోకి తీసుకున్నాం. ఆలయాలకు నష్టపరిహారంగా తస్తిక్ అలవెన్స్ ఇచ్చాం. ఇలా ఇతరుల కష్టార్జితాన్ని అన్యాయంగా అనుభవిస్తున్న బ్రాహ్మణుల నుండి భూములు, గ్రామాలు తీసుకొని. వాటిని ఇతర కులాల వారికి ఇస్తే, నిజంగా కష్టం చేసేవారికి భూమి ఇచ్చినట్లు అవుతుంది కదా. ఆ విధంగా బ్రాహ్మణులు దెబ్బతిన్నా, ఇతరులు బాగుపడ్డారు. ఇలా జరిగినప్పుడు

మన ప్రభుత్వం ఆదాయం కూడా బాగా పెరిగింది. ఇలా వచ్చిన ఈ ఆదాయం మనకు వ్యవసాయ రంగంలో పెట్టుబడులు పెంచడానికి పనికి వస్తుంది కదా. ఫ్యూచర్ ఆలోచిస్తే, మన కంపెనీ మనుగడ అంత పటిష్టంగా లేదు. ఇవాళ కాకపోయినా, రేపైనా, హిందువులు మన విధానాల మీద దండెత్తుతారు. చరిత్రలో మనం చాలా చూశాం. మతపరమైన విషయాలపై ప్రజలు ఎంతకైనా తెగిస్తారు. అలా జరిగే లోపు వారి వ్యవస్థను బలహీనపరచడం మన బాధ్యత. కనుక, ఇప్పుడు మనం చేసేదేమిటంటే, దేశంలో ఉన్న అన్ని ఆలయాల ఆదాయాలు పోగొట్టి. ఆలయ వ్యవస్థను దెబ్బతీసేటట్లు చేశాం. ఆలయంలో ఆధిపత్యంతో పాటు, దాని వల్ల సమాజం మీద పట్టు ఉన్న బ్రాహ్మణుల ఆదాయం పోగొట్టిఱ వారిని బలహీనపరచి, సమాజంలో వారి పట్టుకోయేలా చేశాం. దాంతో ఈ తెలివిగల బ్రాహ్మణులు వేరే గత్యాంతరం లేక, మన కంపెనీలో గుమస్తాలుగా చేరిపోయి, మన చెప్పుచేతుల్లోనే ఉంటారు. వాళ్ళు కొందరు మన సైన్యంలో కూడా చేరుతున్నారు. వారు ఏదో ఒక కొలువులో చేరాలి కనుక, మన కొలువులో చేరితే సరిపోతుంది. దీంతో, మతపరంగా ప్రజలను రెచ్చగొట్టే బ్రాహ్మణులు కానీ, వారికి ఆదాయం తెచ్చేందుకు ఆలయ వ్యవస్థలు కానీ లేకుండా పోతాయి. దీనిద్వారా ఫ్యూచర్లో హిందువులు తిరుగుబాటు చేసే ప్రమాదం ఉండదు, తిరుపతి తిరుమల ఆలయం మన కంపెనీ ఆధీనంలోకి వచ్చిన తర్వాత, ప్రతి సంవత్సరం ఆదాయం తగ్గేటట్లుగా చూస్తాం. అలా వచ్చిన ఆదాయం కూడా వారికి దక్కకుండా, నేరుగా మన సర్కార్కేచెంటట్లుగా చేస్తాం. ఇలా కొన్ని సంవత్సరాలు పాటు

జరిగితే, తిరుపతి ఆదాయం పూర్తిగా పడిపోయి, ఆలయం కాస్తా కుప్పకూలిపోతుంది. హిందువులను ఉత్తేజ పరచగల స్తోమత గల ఈ ఆలయం నిర్వీర్యం అయిపోతుంది. అలానే, దేశంలోని ఇతర ముఖ్యమైన ఆలయాల విషయం కూడా అంతే. అయితే, మిగతా ఆలయాలు తిరుమల తిరుపతిలా కాదు. అవి ఇప్పటికే దెబ్బతిని పోయాయి. అయితే, హిందూ మతం అనే దెయ్యానికి ఇంకా చాలా ఆయువు పట్లు ఉండనే ఉన్నాయి. నెమ్మదిగా వాటిని కూడా దెబ్బతీయాలి. నాకు కొండకు వెళ్లి పరీక్షించే అవకాశం లేదు. తిరుపతి ఆలయంలోకి వెళ్లి వ్యవహారాలు చూసే బాధ్యత నాది. కాదు. కానీ, తిరుపతి తాసిల్దారు కార్యాలయం నా అధీనంలో ఉంది కనుక, రెవెన్యూ వ్యవహారాలన్నీ నా చేతుల్లో ఉన్నాయి. దేవస్థానం రికార్డులన్నీ నా పరిశీలనకు వస్తాయి. కాబట్టి, ఇవన్నీ నేను నాకు తెలిసినంతవరకు వాటిని క్షుణ్ణంగా పరిశీలించి, రాసిన విషయాలు. మరిన్ని వివరాలను, నిజాలను తెలుసుకోవడానికి నేను స్థానికులను సంప్రదించాను. కానీ, వారికి అసలు ఈ విషయపరిజ్ఞానమే సరిగ్గా లేదు. సరిగ్గా తెలియదు. లేదా, మనమడిగినప్పుడు ఏమీ తెలియనట్టుగా నటిస్తూ ఉండవచ్చు. కనుక, నా పరిధిలో వచ్చిన రికార్డులు, ఇతర సమాచారం ఆధారంగా ఇక్కడ జరిగినది నేను చూసినది నిజమని నమ్మి మీకు రాస్తున్నాను.

ఇలా, ఈ వ్యాసాన్ని బట్టి మనం ఆంగ్లేయులు అంతర్యాన్ని గమనించవచ్చు. ఆ తరువాత 1843 నాటికి కంపెనీవారు మహంతులకు ఆలయాన్ని అప్పగించినప్పుడు, ఆలయ నిధులు దాదాపు 40 లక్షల

మేరకు బ్రిటిష్ ప్రభుత్వం సొంతం చేసుకున్నట్లుగా ఆధారాలు ఉన్నాయి. ఏది ఏమైనా, ఎన్ని ఉన్నా లేకున్నా, తిరుమల విషయంలో వారి ఎత్తుగడలు పారలేదని చెప్పాలి. శ్రీ తిరుమల వేంకటేశ్వర స్వామి మహిమ వలన వారు అనుకున్న దానికి వ్యతిరేకంగా ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం ఆదాయం పెరుగుతూనే వచ్చింది. భక్తుల సంఖ్య పెరుగుతూనే వచ్చింది. తిరుమల వైభవం తగ్గకపోగా, అంతకు వెయ్యిరెట్లు ఎక్కువ అయ్యింది.

# వరాహమిహిరుడు

గణితం పుట్టినిల్లు భారత్. భారత్ నుంచే ఇతర దేశాలకు గణితం వెళ్ళింది. వేదకాలంనుంచే గణిత సూత్రాలు మంత్రాల రూపంలో భారతీయులందరికీ తెలుసు. రుద్ర నమక చమకాలనుంచి ట్రిగ్నోమెట్రీ పుట్టింది. వేదాంగాల్లో ఒక భాగమైన సుల్బ సూత్రాలే బీజగణితానికి మూలాలు. ఈ గణితాన్ని ప్రజలకు ఉపయోగపడేలా మార్చిన ఘనత మాత్రం కొందరు భారతీయ గణిత శాస్త్రజ్ఞులదే. వీరిలో ముఖ్యమైనవారు ముగ్గురు. వారు, ఆర్యభట్ట, వరాహమిహిర, భాస్కరాచార్య. వీరు గణిత శాస్త్రవేత్తలు మాత్రమే కాదు, అంతరిక్ష పరిశోధకులు కూడా. అంతమే లేని విశ్వంలో నక్షత్రాలు, గ్రహాలు, భూమ్మీద వాటి ప్రభావాలను కచ్చితంగా లెక్కలేసినవారు ఈ శాస్త్రజ్ఞులు. వీరిలో, ఇప్పుడు మనం వరాహమిహిరుడు గురించి చెప్పుకుంటున్నాం.

వరాహమిహిరుడు గణిత శాస్త్రజ్ఞుడు. అంతకుమించిన ఖగోళ శాస్త్రజ్ఞుడు. గెలీలియో, కోపర్నికస్లు పుట్టకముందే భూమి గోళంగా ఉంటుందని, భూమిపై 27 నక్షత్రాల ప్రభావం ఉంటుందని, సూర్యగ్రహణాలు చంద్రగ్రహణాలు వాటి వాటి నీడల వల్ల ఏర్పడ్డాయని చెప్పిన మహా మేధావి. ఆయన రచించిన బృహత్సంహితలో ఖగోళ శాస్త్రం గురించి ఎన్నో విషయాలు ఉన్నాయి. ఇప్పటికీ మనం ఉపయోగిస్తున్న కర్కటరేఖ, మకర రేఖల గురించి మొట్టమొదట చెప్పినది వరాహమిహిరుడే. ఇప్పటి మధ్యప్రదేశ్ లో ఉన్న ఉజ్జయినిలో ఒక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు వరాహమిహిర. చంద్రగుప్త

విక్రమాదిత్య ఆస్థానంలో ప్రసిద్ధి చెందిన నవరత్నాల్లో వరాహమిహిర ఒకరు. క్రీస్తుపూర్వం 200 సంవత్సర కాలంనాటి వాడని చెప్పారు, భారతఖగోళ శాస్త్ర పరిజ్ఞానం ఎంత గొప్పదో ప్రపంచానికి చాటిన శాస్త్రవేత్త వరాహమిహిర. ఇప్పుడంటే గ్రీన్విచ్ రేఖను ప్రామాణిక కాలంగా ప్రపంచమంతా పాటిస్తోంది. గ్రీనిచ్ మీదుగా కర్కాట రేఖ వెళ్లడం వల్ల ఆ ప్రమాణాన్ని పాటిస్తున్నాం. గ్రీనిచ్ కన్నా ముందు ప్రపంచానికి ప్రామాణిక కాలంగా ఉన్నది ఉజ్జయిని. కర్కాటరేఖ ప్రారంభం అయ్యేది ఉజ్జయినినుంచే. అందువల్లే అక్కడ మహాకాలేశ్వర ఆలయం ఉంది. మహాకాళేశ్వర అంటే, మహాకాలం అని అర్థం, అంటే, గ్రేట్ టైం. ఉజ్జయినిలో కర్కాట రేఖను సూచించే సైన్ బోర్డులు ఉన్నాయి. ఉజ్జయిని నుంచి కర్కాట రేఖ వెళ్తుందని, కర్కాటరేఖే కాలానికి సూచిక అని మొట్టమొదట కనిపెట్టింది వరాహమిహిర. సూర్యుడు ఉత్తరాయణంలో ఉన్నాడా? లేదా? దక్షిణాయనంలో ఉన్నాడా? అని చెప్పేది కర్కాట రేఖ. అయనమంటే ప్రయాణం. అలా సూర్యుని ప్రయాణాన్ని కూడా కచ్చితంగా లెక్క కట్టిన గొప్ప శాస్త్రవేత్త వరాహమిహిర. ఈ ప్రపంచంలో మొట్టమొదట అబ్జర్వేటరీని నిర్మించి, ఖగోళ పరిశోధనలు చేసిన తొలి శాస్త్రవేత్త కూడా వరాహ మిహిరే. ఆ అబ్జర్వేటరీనే ధ్రువస్తంభ. ఢిల్లీలో ఉన్న కుతుబ్మినారే ఒకప్పటి ధృవస్తంభ అని చెప్పడానికి ఇప్పుడిప్పుడే కొన్ని ఆధారాలు కూడా దొరుకుతున్నాయి. ఆ ధ్రువస్తంబాన్ని వరాహమిహిరుడు కోసం విక్రమాదిత్యుడు కట్టించాడని అంటారు.

ఉజ్జయిని నగరంలో ఆదిత్యదాస అనే పండితుడు ఉండేవాడు. అతని కుమారుడే వరాహమిహిర. తండ్రి దగ్గర గణితం, జ్యోతిష్యం నేర్చుకున్నాడు ఖగోళ శాస్త్రం పై దశాబ్దాలపాటు పరిశోధనలు చేశాడు. ఆ ఖగోళ పరిశోధన వివరాలనే బృహత్సంహితగా రచించారు, వరాహమిహిర. బృహత్ సంహితను గ్రీక్స్ ఆ కాలంలోనే అనువదించుకున్నారు. వరాహమిహిర అసలు పేరు మిహిర. మరి, వరాహ అనే పేరు ఎలా వచ్చింది?

ఆ కాలంలో ఉజ్జయినికి ప్రపంచం నలుమూలల నుంచి శాస్త్రవేత్తలు, రచయితలు, కవులు వచ్చేవారు. ఉజ్జయిని ఒక విద్యాకేంద్రంగా వర్థిల్లింది. అక్కడ శాస్త్రచర్చల్లో మిహిర ఎంతో ప్రతిభ చూపించాడు. ఆ ప్రతిభను చూసి విక్రమాదిత్య తన ప్రధాన ఆస్థానానికి ఆహ్వానించాడు. అప్పుడే విక్రమార్కుడి కుమారుడి జాతకం చూశాడు, మిహిర. ఆయన కుమారుడు ఒక అడవి పందివల్ల మరణిస్తాడని సమయంతో సహా విక్రమాదిత్యకు జాతకం చెప్పాడు. విక్రమాదిత్య కొడుకును కాపాడుకోవడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు, కానీ, విధిరాతను తప్పించలేకపోయాడు. అడవి పంది వల్లే అతని కుమారుడు మరణించాడు. అడవిపందిని సంస్కృతంలో వరాహం అంటారు. ఆ తర్వాతే, మిహిరుడు పేరు వరాహ మిహిరుడుగా మారిందని ఒక కథ చెప్తుంది. వరాహమిహిర ఎప్పుడు శాస్త్రాన్ని మాత్రమే నమ్మేవాడు ఏనాడూ మూఢ విశ్వాసాలను ప్రోత్సహించలేదు వాటిని వ్యతిరేకించాడు గ్రహాల గురుత్వాకర్షణ శక్తులలోని మార్పులే మనిషి ప్రవర్తనపై ప్రభావం

చూపి, వారి ఆలోచనలు మార్చి, భవిష్యత్తు మార్పులకు కారణం అవుతాయని జ్యోతిష్యాన్ని ఒక సైన్స్ గా చెప్పిన గొప్ప వ్యక్తి వరాహమిహిర. మన ఖగోళ పరిశోధనలకు మూలం సూర్యసిద్ధాంతం. ఆ గ్రంథం ప్రాచీనమైనది. ఆ సూర్య సిద్ధాంతాన్ని మరింత సరళంగా ప్రపంచానికి అందించి కృషి చేసినవారిలో వరాహమిహిర ముఖ్యుడు.

వరాహమిహిర గొప్ప గ్రంథాల్లో ఒకటి బృహజ్జాతకము. ఆ గ్రంధంలో జ్యోతిష్య శాస్త్రానికి సంబంధించిన పూర్తి సమాచారం ఉంటుంది. ఇక ప్రపంచ ప్రసిద్ధ గ్రంథం బృహత్సంహిత ఈ గ్రంథాన్ని జర్మన్ యూనివర్సిటీ లో కూడా పాఠాలుగా బోధిస్తారు. బృహత్ సంహితలో గ్రహాల గమనం, వాటి వలన భూమి మీద ప్రాణులకు కలుగు ఫలితాలు, నక్షత్ర మండలాలు, మేఘాలు, గర్భధారణ, భూకంప శాస్త్రం, ఇంకా ఎన్నో ఖగోళ విషయాల గురించి అద్భుత పరిశోధనలు ఉన్నాయి. భూమి మీద నీడ పడడం వల్లే చంద్రగ్రహణం, చంద్రుని నీడ పడటంచేత సూర్యగ్రహణం కలుగుతున్నాయని వేదాల్లో ఉంది. రాహు కేతువులు అంటే పాములు అని ఎక్కడా లేదు. రాహు కేతువులను ఛాయాగ్రహాలు అంటారు. ఛాయా అంటే నీడ. సూర్యచంద్ర గ్రహణాల్లో పడే నీడలే రాహు కేతువులు. ఈ విషయాన్ని అందరికీ అర్థమయ్యేలా చెప్పిన మొట్టమొదటి శాస్త్రవేత్త వరాహ మిహిర గ్రహణాల గురించి వరాహమిహిర చెప్పిన విషయాలనే విదేశీ శాస్త్రవేత్తలు తిరిగి మనకే చెప్పారు. అన్ని సాక్ష్యాలు ఆధారాలు ఉన్నా, హిస్టోరియన్స్ కూడా ఈ విషయాన్ని గుర్తించకపోవడం బాధాకరం. వరాహమిహిర రచించిన మరో అద్భుత గ్రంథం డకార్గాళాధ్యాయం ఈ

అధ్యాయం భూమి మీద నీరు ఎంత లోతులో పడుతుందో, చెప్పే అరుదైన శాస్త్రం. మనిషి శరీరంలో రక్తనాడులు ఎలాగో భూమీలో జలనాడులు అలాగే ఉంటాయని చెప్పే శాస్త్రం. భూమి మీద పెరిగే చెట్లు, నీడను చూసి అక్కడ నీరు ఎంత లోతులో ఉందో చెప్పవచ్చు. అలా, ఎంతో అద్భుతమైన మన పరిశోధనతో రచించిన గ్రంథమే డకార్గాళాధ్యాయం. అంతేకాదు, ఈ గ్రంథంలో వరాహ మిహిరుడు భూమిలో ఎక్కడ ఏ లోహాలు దొరుకుతాయో గుప్పెడు మట్టిని అక్కడ పెరిగే చెట్టు ఆధారంగా ఎలా చెప్పొచ్చో వివరించాడు ఇంత అద్భుతమైన పరిశోధన గ్రంథాన్ని మనవాళ్ళు ఎవరు పట్టించుకున్న దాఖలాలే లేవు.

వరాహ మిహిరుడే తొలిసారిగా త్రికోణమితి సూత్రాలను కనిపెట్టాడు. ఆర్యభట్ట కనిపెట్టిన సైన్ టేబుల్ విలువలపై మరింత పరిశోధన చేశాడు. మిహిరుడు.

ఇంకా ఖగోళ శాస్త్రం పరిశోధన కోసం విక్రమాదిత్యుడు నిర్మించాలని చెప్పే ధ్రువస్తంభం గురించి ఇప్పుడు కొంచెం తెలుసుకుందాం. కుతుబ్మినార్ ఇటుకలతో నిర్మించిన 237 అడుగుల ప్రాచీన కట్టడం. ఇంత పెద్ద మీనార్ ప్రపంచంలో ఇదొక్కటే అందుకే ఈ నిర్మాణాన్ని యూనిస్కో ప్రపంచ వారసత్వ సంపదగా గుర్తించింది. ఈ అద్భుత నిర్మాణం ప్రాచీన భారతీయచరిత్రకు సాక్ష్యం. ఢిల్లీలో మెహరోలి అనే ప్రాంతంలో ఉన్న కుతుబ్మినార్ పై ఎప్పటినుంచో చర్చ ఉంది ఆ ప్రాంగణంలో ఉన్న 27 హిందూ దేవాలయాలను పునరుద్ధరించాలని ఎప్పటినుంచో ఫైట్ నడుస్తోంది. కుతుబుద్దీన్ మీద ఇష్టంతో ఘోరి ఈ

మీనార్ ను నిర్మించాడని మనం చరిత్రలో చదువుతూ ఉంటాం. కానీ కుతుబ్మీనార్. కాని, క్రీస్తుపూర్వం 200 సంవత్సరాల సమయంలో, అంటే, వరాహమిహిర ఉన్నప్పటి సమయంలో విక్రమాదిత్యుడు కట్టించిన ప్లానెటోరియం అని చర్చ జరుగుతోంది. కుతుబ్మినార్ అసలు పేరు విష్ణు ధ్వజం లేదా ధ్రువ ధ్వజం. అని ఢిల్లీ ప్రజలే చాలా మంది చెప్తుంటారు. పరిశోధనల కోసం విక్రమాదిత్యుడు నిర్మించిన అబ్జర్వేటరీనే నేటి మీనర్ అని ఎందరో పరిశోధకులు చెప్తుంటారు. పైనుంచి చూస్తే ఈ మీనార్ భారతీయ సంస్కృతికి చిహ్నమైన కలవపూవు ఆకారంలో కనిపిస్తుంది. అది కూడా ఖచ్చితమైన 24 రేకులు ఉన్న కలువ నిర్మాణం. అంటే ఒక్కో రేకు ఒక్కో గంటను సూచించేలా కట్టారు. రోజుకు 24 గంటలు అని అర్థం వచ్చేలా ఈ ధ్రువస్తంభాన్ని నిర్మించారు. భారతీయ సాంప్రదాయంలో కమలానికి ఎంత ప్రాముఖ్యత ప్రపంచమంతటికి తెలుసు. అంతేగాదు, ఈ మీనార్ పైకి ఎక్కాలంటే 360 మెట్లు ఎక్కాలి భారతీయ పంచాంగాల ప్రకారం సంవత్సరానికి 360 రోజులు. ఈ మీనార్ చుట్టూ 27 నక్షత్రాలకు గుర్తుగా 27 ఆలయాలు ఉండేవి. ప్రతి ఏడాది జూన్ 21న ఈ మీనార్ నీడ భూమ్మీద పడదు. అలా నీడ పడకుండా ఉండేందుకు భూమికి ఐదు డిగ్రీల పంపుతో ఈ ధ్వజాన్ని నిర్మించారు. జూన్ 21న లాంగెస్ట్ డే అనేందుకు ఎందుకు సంకేతంగా నిర్మించాలని చెబుతారు. ఎలా చూసినా, ఈ మీనార్ గణితం, ఖగోళం పరిశోధనల స్థలంగానే కనిపిస్తుంది ప్రస్తుతం ఢిల్లీలో కుతుబ్మినార్ ఉన్న ప్రాంతం పేరు మెహరూలి. మిహిరావళి అనే సంస్కృత పదమే కాలక్రమేణ మెహరోలిగా మారింది. మిహిర అంటే

వరాహమిహిరుడు. ఈ శిఖరం చుట్టూ 27 నక్షత్రాలకు సంబంధించిన ఆలయాలు నిర్మించారు. భూమి మీద ప్రభావం చూపించే నక్షత్రాలు 27 అని ప్రజలకు తెలిసేందుకే అలా కట్టారు. ఇప్పటికీ జ్యోతిష్యంలో చూసేటప్పుడు మనకు 27 నక్షత్రాలను బట్టి చూస్తారు. ఇక్కడికి దగ్గరలోనే ఎప్పటికీ తుప్పు పట్టని ఇనుప స్తంభం స్థలం ఉంది ఎలాంటి వాతావరణం నైనా తట్టుకునే ఆయన ప్రస్తుతం ఇప్పటికీ ఒక వండరే. లోహశాస్త్రంలో భారతీయుల ప్రతిభకు అది సజీవ సాక్ష్యం. ఆ ఇనుప స్తంభాన్ని గరుడ ధ్వజం అనేవారట. అంటే, కుతుబ్మినార్ ప్రాంతంలో ఉండే విష్ణు ఆలయానికి అది ధ్వజస్తంభం. ఇదంతా చూస్తే, వరాహ మిహిరుడు ఋూఎంత గొప్ప శాస్త్రవేత్తో, అర్థమవుతుంది. సుమారు 75 ఏళ్లు బతికిన వరాహ మిహిరుడు తాను తన మేధస్సుతో కనిపెట్టిన ఎన్నో ఖగోళ విషయాల్నే ఇప్పుడు టెలిస్కోపులు నిరూపిస్తున్నాయి. అలాంటి గొప్ప శాస్త్రవేత్త చరిత్ర గురించి మన పిల్లలకు పుస్తకాల్లో సరైన పాఠం లేకపోవడమే విచారకరం.

# అష్టోత్తర శతం

108 ఏమిటి ఈ సంఖ్య? ఏదైనా మంత్రం చదివితే, 108 సార్లు అంటారు. ప్రదక్షిణాలు చేసినా, 108 సార్లు చేస్తే మంచిదంటారు. ఇది చాదస్తమా? సాంప్రదాయమా? లేక, ఈ అంకె వెనక ఏదైనా మిస్టరీ ఉందా? భారతీయుల అద్భుత గణిత పరిజ్ఞానానికి బ్రాండ్ నెంబర్ 108. అవును. దిమ్మతిరిగే పరిశోధనలను భారతీయులు వేల ఏళ్ళ క్రితమే ఎలా చేశారు? అని చెప్పడానికి ప్రపంచానికి ఇచ్చిన ఎన్క్రిప్టెడ్ కోడ్ 108. ఆలయంలో ప్రదక్షిణలు ఎన్ని చేయాలి? అంటే, చదువు రానివారు కూడా 108 చేస్తే మంచిది అంటారు. రుద్రాక్ష తులసి, ఇలా ఏ మాల తీసుకున్నా, 108 పూసలు ఉన్నాయా? అని గుచ్చి గుచ్చి మరీ అడుగుతాం. "ఈ మంత్రాన్ని 108 సార్లు జపించండి, మంచిది" అంటాడు పురోహితుడు. ఏమిటి ఈ 108? కొందరు దేవుడిని నమ్ముతారు. కొందరు నమ్మరు కూడా. కానీ, అందరూ నమ్మేది సైన్స్. కనుకే, అందరూ నమ్మే పరిశోధనలు చేశారు, భారతీయు ఋషులు. అవి అలాంటి ఇలాంటి పరిశోధనలు కాదు, అందుకు సరైన ఉదాహరణ ఈ 108. ఈ 108 వెనుక అంతరిక్ష శాస్త్రమే దాగుంది. ఈ భూమి ఎక్కడిది? ఎక్కడి నుంచి వచ్చింది? ఖగోళం అనే వృత్తంలో సూర్యుడు, సూర్యుడు చుట్టూ ఎంత దూరంలో తిరుగుతున్నాడు? వీటన్నిటికీ సమాధానం 108.

వేదకాలంలో ఎన్నో అద్భుత పరిశోధనలు జరిగాయి వాటిలో అంతరిక్ష శాస్త్రం కూడా ఒకటి. సూర్యుడికి భూమికి, చంద్రుడికి భూమికి మధ్య దూరాలు ఓ రెండు మూడు వందల ఏళ్ళ క్రితమే కనుక్కున్నారని

పుస్తకాల్లో చదివాం. కానీ, వేదాల్లో ఈ డిస్టెన్స్ లు ఎప్పుడో చెప్పేసారు. ఎలా అంటే, 108 తో. భూమికి, చంద్రుడికి మధ్య దూరం చంద్రుని వ్యాసానికి 108 రెట్లు. భూమికి సూర్యునికి మధ్య దూరం సూర్యుని వ్యాసానికి 108 రెట్లు. సూర్యుడి వ్యాసం భూమి వ్యాసానికి 108 రెట్లు. ఏంటి? ఆశ్చర్యంగా ఉందా? అవును. మనం నివసించే భూమి, మన భూమికి ప్రాణాన్నిచ్చే సూర్యుడు, భూమి ఆకర్షణను బ్యాలెన్స్ చేసే చంద్రుడు, అన్నిటి లెక్కలు, అన్నిటి దూరాలు ఈ 108తో లింక్ ప్ అయి ఉన్నాయి. ప్యూర్ ఎస్ట్రర్నామికల్ సైన్స్. ఊహించారా? 108 వెనక ఇంతకథ ఉందని. ఇవన్నీ కాకి లెక్కలు కావు. ఆధునిక సైన్స్ పెద్దపెద్ద కంప్యూటర్లతో, మిషన్లతో, సాటిలైట్లతో కనిపెట్టిన గ్రహాల దూరాలకి వేద కాలంలో భారతీయ ఋషులు 108 కోడ్ తో చెప్పిన ఈ డిస్టెన్స్ కి కరెక్ట్ గా సరిపోయాయి. మరి ఎవరు గొప్ప? ఇక్కడితో ఆగిపోతే మనం భారతీయులం ఎలా అవుతాం? మన జీన్స్ లోనే ఫిలాసఫీ ఉంది సైన్స్ ఉంది.

ఆయుర్వేదం అందరికీ తెలిసిన వైద్యగ్రంథం. ఆయుర్వేదం ప్రకారం మనిషి శరీరంలో 108 మర్మ స్థానాలు ఉంటాయి. ఈ మర్మస్థానాలే మన శరీరంలో అన్ని భాగాలకు ప్రాణాన్ని సరఫరా చేస్తే శక్తి ఉత్పత్తి కేంద్రాలు.

మర్మకళ అని ప్రాచీన కేరళ వద్ద కళ ఒకటి ఉంది. వాళ్లు మన మర్మాల మీద దాడి చేసి ఆ పార్టులు పనిచేయకుండా చేయగలరు.

శ్రీ చక్రం వినడం వినడమే కానీ, శ్రీ చక్రం అంతరార్థం ఏంటో చాలామందికి తెలియదు. సృష్టి రహస్యానికి బ్లూ ప్రింట్ అది. , శ్రీ చక్రంలో

54 స్త్రీ, 54 పురుష అంతర్భాగాలు ఉంటాయి. మొత్తం 108. పాజిటివ్ నెగిటివ్ కలిస్తే ఎనర్జీ. శక్తిని ఉత్పత్తి చేసే ప్రాచీన యంత్రం, అది. శ్రీ చక్రం ఇంట్లో ఉంటే నెగిటివ్ ఎనర్జీలను పాజిటివ్ ఎనర్జీగా మారుస్తుందని విశ్వాసం.

జ్యోతిష్య శాస్త్రం కొంతమందివల్ల అది మూఢనమ్మకమనే మచ్చ పడింది. కానీ, జ్యోతిష్యం అంటే కంప్లీట్ సైన్స్. కంప్లీట్ మ్యాథమెటికల్ ఈక్వేషన్స్. దీనికి 108కి సంబంధమేంటి? అంటే, మనిషిలోని బిహేవియర్లకు సూచికలు. ప్రతి మనిషిలోనూ వారి వారి ప్రవర్తనలకు సూచికలు 27 నక్షత్రాలు. మనం పుట్టినప్పుడు ఏ నక్షత్రం, ఏ గ్రహం, ఈ భూమి మీద ప్రభావం చూపిస్తాయో, వాటి ప్రవర్తనలే మన జాతకాల మీద, మన జీవితం మీద ప్రభావం చూపిస్తాయి. అశ్విని, భరణి 27 నక్షత్రాలు. ఒక్కో నక్షత్రానికి నాలుగు పాదాలు 27 నక్షత్రాన్ని ఈ నాలుగు పాదాలతో గుణిస్తే, అక్కడ 108 వస్తుంది.

ఆధునిక మానసిక తత్వశాస్త్రం కూడా మనిషిలో ముఖ్యమైన బిహేవియర్లు 108 ఉంటాయని చెబుతోంది.

మన ఆలోచనల వల్ల తీసుకున్న నిర్ణయాలు మన జాతకం, మన భవిష్యత్తు. ఆ జాతకాన్ని చెప్పే శాస్త్రమే జ్యోతిష్యం. భారతీయ జ్యోతిష్యంలో 12 రాశులు, 9 గ్రహాలు ఉంటాయి. 12న 9 తో గుణిస్తే మళ్లీ 108.

మన ప్రాచీన ఆయుర్వేద శాస్త్రం ప్రకారం మనిషి సగటున ప్రతి రోజు 21600 సార్లు శ్వాస తీస్తాడు. అందులో పదివేల ఎనిమిది వందల

సూర్యాంశ, అంటే ప్రాణశక్తి. పదివేల ఎనిమిది వందల సార్లు చంద్రాంశ. అంటే, మనం వదిలే కార్బన్డయాక్సైడ్ అనుకోవచ్చు. ఆక్సిజన్ పీల్చుకొని, కార్బన్డయాక్సైడ్ ని వదలడం అన్నమాట. పదివేల ఎనిమిది వందలని వందతో భాగిస్తే 108.

భరతుని నాట్య శాస్త్రంలో చేతులు, కాళ్లు కలిపి చేసే నాట్య భంగిమలు 108 ఉంటాయి. ఈ ఒక్కో భంగిమ ఒక్కో సంకేతాన్ని చెప్తూ ఉంటుంది. నటరాజస్వామి చేసే నాట్య భంగిమలు కూడా 108.

అష్టాదశ పురాణాలు అంటే 18 పురాణాలు. వాస్తవానికి మన మొత్తం పురాణాలు 108 మనం ఉపనిషత్తుల సంఖ్య 108. భగవద్గీతలో అధ్యాయాలు 18. భారతంలో పర్వాలు 18. మన ఇంట్లో ఆలయాల్లో అష్టోత్తర శతనామావళి అంటాం. అంటే, 108 సార్లు నామం జపించాలని.

భారతీయ కాలగణన ప్రకారం నాలుగు యుగాలు కలిపి 43 లక్షల 20వేల సంవత్సరాలు. ఇది 108 అనే సంఖ్యతో భాగించబడుతుంది. ఇలా, అంతరిక్ష శాస్త్రం మొత్తం 108తో ముడిపడి ఉంది. అందుకే, ఆ నెంబర్ కి మన ప్రాచీన ఋషులు అంత ప్రాధాన్యతనిచ్చారు.

మరి, ఈ సైన్సు సామాన్యులకు చేరేదెలా? విద్యార్థి లేని విద్యకు విలువలేదు. తాము కనుక్కున్న ఈ అంశాలు నిత్యం ప్రజల మధ్య నలగాలి. మనం ఉంటున్న భూమికి, అంతరిక్షానికి, సృష్టికి, సృష్టికర్తకు ఉన్న ఈ 108 సంబంధం తరతరాల విద్యగా మారాలి. అందుకే వైదిక విధానంలో 108 కి ప్రాధాన్యత ఇచ్చారు.

పూజ చేస్తే 108 పూలు, జపం చేస్తే 108 పూసల మాల, ప్రదక్షిణలు చేస్తే 108. ఇలా ప్రతి దైవికాంశలో 108 అనే సంఖ్య నలిగేలా చేశారు. అప్పట్లో ఈ 108 గురించి పెద్దలు చెప్పేవారు. ఇప్పుడు ఈ సైన్సు వండర్ను చెప్పేవారు కరువయ్యారు. ఈ 108 సంఖ్యను బౌద్ధులు, జైనులు, సిక్కులు, వీరు కూడా దైవికంగానే భావిస్తారు.

తపస్సులో 108 మానసిక స్థాయిలు ఉంటాయి మనలోనే ఉన్న దేవుడిని గుర్తించడానికి మనలో ఉన్న ఆత్మ 108 మెట్లు దాటాలని బౌద్ధుల నమ్మకం. అది మన 108 వెనుక ఉన్న రహస్యం.

## ప్రపంచానికి తెలియకుండా శాస్త్రవేత్తలు దాచిన నిజం

భూమికి గ్రావిటీ ఉందని మొట్టమొదట ఎవరు కనిపెట్టారు? అన్న ప్రశ్న వేస్తే, ప్రపంచం మొత్తం చెప్పే సమాధానం ఐజాక్ న్యూటన్. 1680లో న్యూటన్ గ్రావిటీ కనుక్కున్నాడని చెబుతారు. ఆయన రాసిన ప్రిన్సీయా అనే పుస్తకాన్ని చూపిస్తారు. కానీ, ఆ పుస్తకాన్ని జాగ్రత్తగా చదివితే, ఒక విషయం అర్ధమవుతుంది, ఏంటంటే, ఆ పుస్తకంలో కనిపించే అంతరిక్షశాస్త్ర విషయాలు, క్యాలిక్యులెస్, ప్లానిటరీ సబ్జెక్టుకి భాస్కరాచార్య అనే మన భారతీయ మేధావి రాసిన సిద్ధాంత శిరోమణికి చాలా పోలికలు కనిపిస్తాయి. న్యూటన్ కనిపెట్టాడు అని చెప్పే గ్రావిటీని అంతకు ఐదువందల ఏళ్ళ క్రితమే భాస్కరాచార్య కనిపెట్టాడు. ఇలాంటి ఎన్నో విషయాలు గొప్ప గొప్ప గణిత సిద్ధాంతాలతో ఆయన రాసిన సిద్ధాంత శిరోమణి గ్రంథాన్ని ప్రపంచంలో చాలా దేశాలవారు ఆయా భాషల్లోకి అనువదించుకున్నారు. వాటిలో ఒకటి భూ గురుత్వాకర్షణ సిద్ధాంతం.

భాస్కరాచార్య స్పష్టంగా గురుత్వాకర్షణ సిద్ధాంతాన్ని వివరించాడు. భాస్కరాచార్య రచించిన ఫేమస్ గ్రంథం సిద్ధాంత శిరోమణి. అందులో ఒక భాగం భువనకోశం. ఈ గ్రంథాన్ని భాస్కరాచార్య 1150లో రచించారు. అందులో భాస్కరాచార్య ఇలా వివరించారు భూమికి ఆకర్షణ శక్తి ఉంది. ఖగోళంలో గ్రహాలు అన్నిటికీ ఆకర్షణ శక్తి ఉంది. గ్రహాల మధ్య ఉన్న ఆకర్షణ శక్తుల వల్లే అవి అంతరిక్షంలో వాటి వాటి కక్షలో తిరుగుతున్నాయి. ఇది భాస్కరాచార్య సిద్ధాంత శిరోమణి గ్రంథంలో రాసిన విషయం. సరిగ్గా ఇదే విషయాన్ని పొల్లు పోకుండా 16వ శతాబ్దంలోని

న్యూటన్ ఎలా చెప్పాడో, సిద్ధాంత శిరోమణిలో ఉన్న శ్లోకం ఇప్పుడు చూద్దాం. "ఆకృష్టిశక్తిశ్చ మహితయా యత్ స్వస్థం గురుస్వాభిముఖం స్వశక్త్యా, ఆకృశష్యతే తత్పతతీవ భాతి సమే సమంతాత్ క్వ పతత్వియం ఖే", ఈ శ్లోకానికి అర్థం ఇలా ఉంటుంది—ఆకాశంలో ఉన్న వస్తువులను ఆకర్షించే లక్షణం భూమికి ఉంది. ఈ ఆకర్షణ శక్తి వల్లే అన్ని వస్తువులు భూమి మీద పడతాయి. మిగిలిన గ్రహాలపై ఉన్న ఆకర్షణ శక్తులనుబట్టి ఆ గ్రహాల మీద వస్తువుల చలనం ఉంటుంది. ఇది ఆ శ్లోకార్థం. ఇంత స్పష్టంగా చెప్పాక కూడా, మనం ఇంకా ఐజాక్ న్యూటన్ గారి యాపిల్ పండు సిద్ధాంతాన్ని గొప్పగా చెప్పుకుంటున్నాం.

నూటన్ కన్నా 500 ఏళ్ల క్రితమే గురుత్వాకర్షణ సిద్ధాంతాన్ని మన భారతీయ గణిత శాస్త్రవేత్త భాస్కరాచార్య కనిపెట్టారని చెప్పేందుకు ఈ శ్లోకాన్ని మించిన సాక్ష్యాలు కావాలా? ఇది ఒక్కటే కాదు ఇప్పుడు మనం ఉపయోగిస్తున్న కాలిక్యులస్, అంటే, కలన గణితానికి ఆద్యుడు భాస్కరాచార్య. ప్రపంచమంతా భాస్కరాచార్య సిద్ధాంతాలను అనువాదం చేసుకున్నారు. అసలు భాస్కరాచార్య ఎవరు? ఆయన చరిత్ర ఏమిటి? ఇప్పుడు చూద్దాం.

ఆర్యభట్ట, వరాహమిహిర, భాస్కర— ఇలా భారతదేశంలో ఎంతో మంది గొప్ప శాస్త్రవేత్తలు ఉన్నారు. ఎవరెవరో కనిపెట్టారని చదువుకుంటున్న ఎన్నో విషయాలను భారతీయులే మొదట కనిపెట్టారు. ముఖ్యంగా, గణితంలో భాస్కరాచార్య చేసిన పరిశోధనలు చాలా గొప్పవి. ఇప్పటికే లభిస్తున్న సిద్ధాంత శిరోమణి గ్రంథాన్ని చదివితే,

ఆ విషయం అర్థం అవుతుంది. క్రీస్తు శకం 500 నుంచి 1300 వరకు భారతీయులకు కనిపెట్టిన విషయాలే ప్రపంచమంతా తిరిగాయి. ఆ రోజుల్లో ప్రపంచమంతా భారతీయులు కనిపెట్టిన విషయాలే పాఠాలు అయ్యాయి. ఆ తర్వాత మన దేశం మీద విదేశీ రాక్షసుల దాడుల వల్ల అసలు విషయాలు భూస్థాపితం అయ్యాయి. 12వ శతాబ్దంలోనే బీజగణితాన్ని, డెసిమల్ సిస్టంని ఖచ్చితత్వంతో కనిపెట్టిన మొట్టమొదటి శాస్త్రవేత్త భాస్కరాచార్య. ఆయనే ఆ గణితాన్ని ప్రపంచానికి అందించారు. ఆయన ఇప్పటి కర్ణాటక ప్రాంతంలో జన్మించారని చారిత్రక ఆధారాలు చెబుతున్నాయి. అయితే ఆయన పరిశోధనలో ఎక్కువ భాగం మాత్రం ఉజ్జయినిని కేంద్రంగా సాగాయి. ఆ రోజుల్లో గొప్ప గొప్ప మేధావులకు ఉజ్జయిని కేంద్రంగా ఉండేది. ప్రపంచం మొత్తాన్ని ఆకర్షించిన గొప్ప పరిశోధన కేంద్రాలు ఉజ్జయినిలో ఉండేవి. ఉజ్జయినిలో అంతరిక్ష పరిశోధనల కోసం ఆ కాలంలోనే అబ్జర్వేటరీలు ఉండేవి. విక్రమాదిత్యుని కాలంలో వర్ధిల్లిన పరిశోధనలు ఆ తర్వాత కూడా విస్తరించాయి. అలా ఉజ్జయిని అబ్జర్వేటరీకి భాస్కరుడు ఆచార్యుడిగా ఉండేవారు. అప్పటినుంచే ఆయన పేరు భాస్కరాచార్యగా మారింది. అంతకు ముందు వరాహమిహిర, బ్రహ్మ గుప్త, వీరిద్దరూ ఉజ్జయినిలో అంతరిక్ష పరిశోధనలకు పునాదులు వేశారు. గణితం, అంతరిక్ష శాస్త్రం, ఈ రెండు భారతీయులు ప్రపంచానికి అందించిన వరాలు.

భాస్కరాచార్యకు లీలావతి అనే కుమార్తె ఉండేవారు. ఆమె వైవాహిక జీవితంలో ఏవో అడ్డంకులు ఎదురయ్యాయి. ఆ తర్వాత ఆమె

తండ్రి పరిశోధనలకు సహాయకురాలిగా ఉండేవారు. ఆమె కూడా గణిత శాస్త్రవేత్త. అలా ఆమె పేరుమీద భాస్కరాచార్య రచించిన ప్రపంచ ప్రసిద్ధ గణిత గ్రంథమే లీలావతీ గణితం. భాస్కరాచార్య అనగానే ప్రపంచ మేధావులు అందరికీ గుర్తొచ్చే గ్రంథం సిద్ధాంత శిరోమణి. ఈ సిద్ధాంత శిరోమణి 4 భాగాలుగా ఉంటుంది. అవి లీలావతీ గణితం. బీజగణితం. గ్రహగణితం. గోళాధ్యాయం. వీటిలో, గణితం, అంతరిక్ష శాస్త్రాలకు సంబంధించిన థీరీలు ఎన్నో ఉన్నాయి. వాటినే ప్రపంచమంతా అనువదించుకొని ఆ థీరీలను తామే కనిపెట్టినట్టు చెప్పుకున్నారు. ఈ గ్రంథంలో గ్రహాల గమనాలు, గ్రహణాలు, కాస్మోగ్రఫీ, జాగ్రఫీ, గణితం, ఇలా ఎన్నో శాస్త్రాలకు సంబంధించిన ఖచ్చితమైన సిలబస్ ఉంది. లీలావతీ గ్రంథం గణితానికి సంబంధించినది. బీజ గణితం అంటే ఆల్జీబ్రా. గణిత అధ్యాయంలో ఇప్పటికీ ఆశ్చర్యపరిచే లెక్కల సిద్ధాంతాలు ఎన్నో ఉన్నాయి. గోళాధ్యాయం పేరులోనే ఉన్నట్టు భూగోళం, గ్రహాలు వీటి గురించి ఉంటుంది. కలనకుతూహలం అనే గ్రంథంలో కాలిక్యులస్ ఉంటుంది. వీటిని బట్టి చూస్తే, గణితం, అంతరిక్ష శాస్త్రానికి సంబంధించిన థీసిస్ లు రాసిన మొట్టమొదటి వ్యక్తి భాస్కరాచార్యే. మైనస్ ని మైనస్ తో గుణిస్తే ప్లస్ అని, ప్లస్ ని మైనస్ తో గుణిస్తే మైనస్ అనే సిద్ధాంతం కూడా సిద్ధాంత శిరోమణిలో కనిపిస్తుంది అది కూడా భాస్కరాచార్యే కనిపెట్టారు. ఏ సంఖ్యనైనా సున్నాతో భాగిస్తే వచ్చేది అనంతం అన్న విషయాన్ని నిరూపించినది భాస్కరాచార్యే. ఇన్ ఫైనిటీ ని గురించి భాస్కర ఎన్నో పరిశోధనలు చేశారు. బ్రహ్మాపుత్రుడినీ తన గురువుగా భావించారు.

భాస్కరాచార్య సూర్యుడు చుట్టూ భూమి తిరిగేందుకు 365 పాయింట్ రెండు, ఐదు ఎనిమిది ఎనిమిది రోజులు పడుతుందని మొట్టమొదటి ప్రపంచానికి చెప్పింది బ్రహ్మగుప్తుడే. ఇప్పటి సైంటిఫిక్ లెక్కలతో లెక్కిస్తే బ్రహ్మగుప్తుడి లెక్కకు కేవలం మూడు నిమిషాలు తేడా వస్తున్నది. అంతటి గొప్ప మేధావి బ్రహ్మగుప్త.

భాస్కరాచార్య కనిపెట్టిన సిద్ధాంతాల్లో ముఖ్యమైనవి చూద్దాం. భూమి గోళాకారంగా ఉంటుందని, ఒక పెద్ద గోళం మీద మనం ఉంటే, ఆ గోలాన్ని మన కళ్ళతో చూసినప్పుడు బల్లపరుపుగానే కనిపిస్తుంది అని చెప్పాడు. ఉత్తర దక్షిణ ధ్రువాల్లో ఆరు నెలలు పగలు, ఆరు నెలలు రాత్రి ఉంటుందని ఆ కాలంలోనే చెప్పాడు. ఎన్నో గ్రహాల గమనాలను భాస్కరాచార్య కచ్చితమైన లెక్కలతో కొలిచాడు. ఇప్పటి సైంటిఫిక్ లెక్కలకు అవి సరిగ్గా సరిపోయాయి. శూన్యంలో భూమి వేలాడుతోందని, భూమి వాతావరణం బయట అంతా శూన్యమేనని అని చెప్పిన శాస్త్రవేత్త భాస్కరాచార్య. చారిత్రక లెక్కల ప్రకారం 1114 లో పుట్టిన భాస్కరాచార్య 1185 వరకు జీవించారు. ఆయన చేసిన పరిశోధనలే ప్రపంచ గణితానికి గట్టి పునాదులు. ఆర్యభట్ట, వరామిహిర, బ్రహ్మ గుప్తులు వేసిన శాస్త్రీయ పునాదుల మీద బలమైన పరిశోధనలు నిర్మించిన మేధావి భాస్కరాచార్య. ప్రపంచమంతా ఆయన పరిశోధనలను అనువదించుకుంది. గ్రీస్ తో సహా ఇంగ్లీష్ మేధావులంతా తామే కనిపెట్టామని చెప్పే ఎన్నో సిద్ధాంతాలు భాస్కరాచార్య కనిపెట్టినవే అని చెప్పేందుకు సిద్ధాంత శిరోమణిని మించిన ఆధారం లేదు. అలాంటి గొప్ప

మేధావి, మహర్షిని గురించి ఈ తరంవారికి చెప్పే పాఠాలు కనిపించవు. అదే మన దురదృష్టం.

# ఎప్పటికీ అంతుచిక్కని ఎనిమిది రహస్య శాస్త్రాలు

మన భారతదేశం ఎన్నో అద్భుతాలకు చిరునామా. ప్రపంచానికి వైద్యం అంటే ఏంటో తెలియని రోజుల్లోనే ప్లాస్టిక్ సర్జరీలు చేసిన ఘనత మన భారతీయ వైద్యులది. ఎన్నో అద్భుతమైన శాస్త్రాలను, సాంకేతిక పరిజ్ఞానాలను మనవాళ్లు కనిపెట్టారు. వాటిలో ఎన్నో మిస్టీరియస్ శాస్త్రాలు ఉన్నాయి. ఇప్పుడు వాటి గురించే మనం తెలుసుకోబోతున్నాం.

ముందుగా, మనం తెలుసుకోవాల్సింది అక్ష హృదయం గురించి. అక్ష హృదయం భారతీయులు కనిపెట్టిన ఒక అద్భుత శాస్త్రం. అక్ష హృదయం తెలిస్తే లెక్కలు మన వేళ్ళ మీద ఉంటాయి. సంఖ్యాశాస్త్రంలో టాప్ లెవెల్ అక్ష హృదయం. ఈ విద్య తెలిస్తే కంప్యూటర్లు కాలిక్యులేటర్లు అవసరం లేదు. పాచికల్లో ఎప్పుడు ఏ అంకె పడుతుందో, చెట్టుపై ఎన్ని ఆకులు ఉన్నాయో, క్షణాల్లో లెక్కించవచ్చు మహాభారతంలో ఈ విద్య గురించిన వివరాలు ఉన్నాయి. నల దమయంతుల కథలో భాగంగా ఈ విద్య గురించి వస్తుంది. కాలం కలిసి రాక నలదమయంతులు అడవుల పాలవుతారు. ఆ సమయంలో దమయంతి కూడా కనిపించకుండా పోతుంది. ఆమెను వెతికెందుకు అడవుల్లో తిరుగుతున్న నలుడుని కర్కోటకుడు అనే పెద్ద నాగు కాటేస్తుంది. ఆ తర్వాత అతను కురూపిగా మారిపోతాడు. ఋతుపర్ణుడు అనే రాజు దగ్గరికి వెళ్ళమని, అంతా మంచే జరుగుతుందని కర్కోటకుడు చెబుతాడు. ఋతుపర్ణుడు రాజు మాత్రమే కాదు, సంఖ్యా శాస్త్రవేత్త కూడా. అతనికి అక్షవిద్యలో మంచి ప్రావీణ్యం ఉంది. అలాగే, ఈ అక్ష హృదయంతో ఒక చెట్టుకి ఎన్ని ఆకులు పళ్ళు

ఉన్నాయో క్షణాల్లో చెప్పగలడు. అలా కర్కోటకుడి సలహాతో నలుడు బాహుకుడు అనే మారుపేరుతో ఋతుపర్ణుని దగ్గర చేరాడు. అదే సమయంలో విదర్భ రాజకుమారి దమయంతికి స్వయంవరం జరుగుతోందని సమాచారం వస్తుంది. అతిలోకసుందరి అయిన దమయంతి స్వయంవరానికి వెళ్లాలని ఋతుపర్ణుడు అనుకుంటాడు. కానీ మర్నాడే స్వయంవరం. అంత తక్కువ సమయంలో విదర్భకు చేరడం సాధ్యం కాదు. అయినా, ఋతుపర్ణుడు వెళ్లాలనుకుంటాడు. రథం నడపడంలో దిట్ట అయిన బాహుకుడి పేరుతో ఉన్న నలుడుని ఋతుపర్ణుడు తీసుకెళ్లాడు. గాలి కన్నా వేగంగా రథాన్ని నడిపాడు, నలుడ్ు ఒకచోట ఋతుపర్ణుడు వేసుకున్న ఉత్తరీయం పడిపోయింది. రథాన్ని ఆపి ఉత్తరీయాన్ని తీసుకురమ్మనీ నలుడికి చెప్పాడు, ఋతుపర్ణుడు. అప్పటికే 10 కిలోమీటర్ల దూరం వచ్చేసామని నలుడు చెప్పాడు. ఋతుపర్ణుడు ఆశ్చర్యపోయాడు.

ఒకచోట ఓ పెద్ద చెట్టు కనబడుతుంది. ఆ చెట్టుకి ఐదు కోట్ల ఆకులు, 2, 900 పళ్ళు ఉన్నాయని ఋతుపర్ణుడు చెప్తాడు అప్పుడు ఇద్దరికీ ఒక విషయం అర్థమైంది. నలుడికి రథాన్ని వేగంగా నడిపే అశ్వ హృదయం గురించి తెలుసు. ఋతుపర్ణుడికి కంప్యూటర్లను మించిన అక్షహృదయం గురించి తెలుసు. నలుడు ఋతుపర్ణుకి తన విద్యను నేర్పాడు. బదులుగా ఋతుపర్ణుడు అక్ష హృదయాన్ని నలుడికి నేర్పాడు. ఏ జూదంతో నలుడు రాజ్యాన్ని పోగొట్టుకున్నాడో, ఆ జూదంలోనే నలుడు అక్ష విద్య సహాయంతో మళ్లీ రాజ్యాన్ని గెలుచుకున్నాడు.

ఈ విద్య ఋతుపర్ణుడు, నలుడి తర్వాత ఆ స్థాయిలో తెలిసినవాడు శకుని. అప్పటికి ధర్మరాజుకి అక్ష హృదయం తెలియదు. ఈ విద్యతోనే శకుని ధర్మరాజును పాచికల్లో ఓడించి అడవుల పాలు చేశాడు. ఆ తర్వాత అడవుల్లో ధర్మరాజు కూడా ఈ అక్ష హృదయాన్ని ఓ ఋషి దగ్గర నేర్చుకున్నాడు. ఇలా కనపడని అంకెలను కూడా మనసుతో చూసే విద్యే అక్ష హృదయం. పాచికలు వేశాక ఏ అంకెలు పడతాయో ముందే కనిపెట్టే విద్య అక్ష హృదయం ఇలాంటి విద్యలు ఎన్నో మన భారతీయులు కనిపెట్టారు.

ఇక నలుగురికి తెలిసిన అశ్వహృదయం గురించి చెప్పుకుందాం. ఈ విద్య మరో అద్భుతం. గుర్రాల గురించి పూర్తిగా చెప్పే విద్య అశ్వ హృదయం. ఈ విద్య నలుడికి తెలుసు మహాభారతంలో శ్రీకృష్ణుడికి, నకులుడికి ఈ అశ్వ హృదయం తెలుసు. పాండవుల అజ్ఞాతవాసం సమయంలో నకులుడు ఈ విద్యతోనే విరాటరాజు కొలువులో చేరి, అక్కడ గుర్రాలను అద్భుతంగా తీర్చిదిద్దాడు. వీరితోపాటు కురుక్షేత్ర యుద్ధంలో కర్ణుడి రథసారథిగా ఉన్న శల్యుడికి కూడా అశ్వహృదయం తెలుసు. గుర్రం ఎంత వేగంగానైనా పరిగెత్తగలదు. ఆ జాతికి ఉన్న లక్షణం అది. అందుకే ఇప్పటికీ ఇంజన్ పవర్ ని హార్స్ పవర్స్ తో కొలుస్తారు. వాటిని పరిగెత్తించగలిగే టెక్నిక్ తెలియాలి. అదే అశ్వ హృదయం. ఇలాంటి విద్యలు భారతీయులకు వేల ఏళ్ళ క్రితమే తెలుసు. ఈ అశ్వహృదయంలో ఎలాంటి గుర్రాలని ఎంచుకోవాలి, ఎలాంటి గుర్రాలు బాగా పరిగెత్తగలవు,

ఇలాంటి విషయాలు తెలుస్తాయి. గుర్రాలను హిప్నొటైజ్ చేసి, మనకు తగ్గట్టుగా మార్చుకునే విద్య కూడా అశ్వ హృదయంలో భాగమే. ఒకప్పుడు యుద్ధాల్లో ఇలాంటి విద్యలతోనే శత్రువుల్ని ఎదుర్కొనేవారు.

ఇక, మరో అద్భుతమైన విద్య శిలాహృదయం. తంజావూర్ లో బృహదీశ్వరాలయం ఉంది. వేల ఏళ్ళ క్రితం భారీ రాళ్లతో నిర్మించిన ఆ ఆలయం ఇప్పటికీ చెక్కుచెదరలేదు. ఆ ఆలయ శిఖరం మీద ఉన్న 80 టన్నుల రాయిని ఎలా పెట్టారు? అన్నది ఇప్పటికీ మిస్టరీయే. కోణార్క్ ఆలయం కూడా ఇలాంటిదే. 13వ శతాబ్దంలో కోణార్క్ ఆలయాన్ని మహాశిల్పి విసుమహారాణ నిర్మించాడు. ఆలయ నిర్మాణంలో 1200 మంది శిల్పులు పాల్గొన్నారు. అయితే, ఆలయ శిఖరాన్ని మాత్రం ఎక్కించలేకపోయారు. అదే సమయంలో వచ్చిన విసుమహారాణా కుమారుడు ధర్మపధ రాత్రికి రాత్రే అంత బరువున్న రాయిని శిఖరం మీదకు ఒక్కడే ఎక్కించాడని ఇప్పటికీ అక్కడ కథలు వినిపిస్తాయి. 100 ఏనుగులు కూడా కదిలించలేని రాళ్ళను అప్పట్లో అంత ఎత్తున ఎలా పెట్టారు? దీని వెనుక ఉన్న మిస్టీరియల్ సైన్సును శిలాహృదయమని అంటారు. ఆలయ నిర్మాణ శాస్త్రంలో ఉన్న ఈ టెక్నిక్ ఎలా మాయమైందో తెలియదు. శిలా హృదయం టెక్నిక్ తో ఒక రాయి గ్రావిటీని సున్నా చేయొచ్చు అని అంటారు. అంటే, స్పేస్ లో గ్రావిటీ ఉండదు గనుక, ఎంత బరువున్న వస్తువునైనా చిటికెన వెళుతూ లేపవచ్చు. అలాగే శిలా హృదయంతో ఎంత పెద్ద రాయిని అయినా గ్రావిటీ సున్నా చేసి రెండు చేతులతో పట్టుకొని సులువుగా లేపవచ్చు. ఈజిప్ట్ పిరమిడ్ల మీద,

మనదేశంలో చాలా ఆలయాల మీద రెండు చేతులతో పెద్ద బండరాలను సులువుగా మోస్తున్న శిల్పాలు చెక్కి ఉన్నాయి. అంత పెద్ద రాళ్ళను అట్ట పెట్టిని పట్టుకున్నట్టుగా పట్టుకోవడం ఎలా సాధ్యమైంది? దాని వెనుక ఉన్న టెక్నిక్ శిలా హృదయం.

ఈ శిలా హృదయం టెక్నిక్ తోనే కోణార్క్ ఆలయ శిఖరాన్ని ధర్మపాదుడు పెట్టాడని అనుకోవచ్చు ఆ తర్వాత కాలంలో ఈ అద్భుత నిర్మాణ సాంకేతికత కూడా మాయమైంది. ఈ విద్య మొదట విశ్వకర్మకి, ఆ తర్వాత అతని కొడుకు మయుడికి తెలుసు. మయసభలో ఇలాంటి మాయలు ఎన్నో ఉంటాయి. మయుడు మూలాలే ఉన్నాయని చెప్పే మయన్స్ కల్చర్ లో పెద్ద పెద్ద భవనాలు శిలాహృదయం సహాయంతోనే నిర్మించారేమో!.

ఇక, మహాభారతంలో శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని చిటికెన వేలుతో లేపి తన వారిని కాపాడుకుంటాడు. దీని వెనక కూడా ఇలాంటి టెక్నిక్ ఏదో శ్రీకృష్ణుడికి తెలిసి ఉండాలి.

పరకాయ ప్రవేశం. మన పాత సినిమాల్లో పరకాయ ప్రవేశాలు చూస్తూ ఉంటాం. నిజంగా ఇది ఉందా? ఎవరో అయితే కథ అని కొట్టి పారేయవచ్చు. కానీ, సాక్షాత్తు ఆదిశంకరాచార్యులే పరకాయ ప్రవేశం చేశారని అంటారు. కాబట్టి పరకాయ ప్రవేశం నిజమేనని నమ్మాలి. పరకాయ ప్రవేశం అనే గ్రంథాన్ని రచించినది వాలఖిల్యుడు అనే ఋషి. ఈ గ్రంథంలోనే 32 రకాల యోగ విద్యలు అష్టసిద్ధుల గురించి ఉంది. దీనికి మన శరీరంలో ప్రతి భాగం మీద నియంత్రణ అవసరం అంటే ప్రాణం మనం

చెప్పినట్టు వినాలి ఒక రాజు, ఒక రాణితో ఆదిశంకరాచార్యులు ఆధ్యాత్మిక వాదం చేశారు. అందులో, రాణి కామశాస్త్రం గురించి అడిగింది. అది కూడా అనుభవ పూర్వకంగా తెలిసిందే చెప్పాలని కోరింది. ఆదిశంకరులు ఆజన్మ బ్రహ్మచారి. తనకు ఒక నెల సమయం ఇస్తే, వాదం మళ్లీ కొనసాగిద్దాం అని చెప్పారు. అప్పుడు ఆదిశంకరులు తన శరీరాన్ని వదిలి ఒక రాజు శరీరంలోకి వెళ్లారని అంటారు.

మనం పంచప్రాణాలు అంటాము. అవి ప్రాణ, సమాన, అపాన, ఉదాన, వ్యాన వాయువులుగా ఉంటాయి. ఈ విషయాన్ని వేదాలు ఉపనిషత్తులు చెబుతున్నాయి. ప్రాణం శ్వాసని, ఆలోచనని, స్పర్శని కంట్రోల్ చేస్తుంది. అందుకే ఊపిరి ఆగిపోగానే మనిషి మరణించాడని అంటారు. మనిషి చనిపోయినా, ప్రాణం పూర్తిగా శరీరం నుంచి బయటకు వెళ్లడానికి కనీసం రెండు గంటల సమయం పడుతుంది. అందుకే చనిపోయిన వెంటనే దహనం చేయరు. కనీసం రెండు మూడు గంటలు ఆగిన తర్వాతే దహనం చేయాలని శాస్త్రమే చెబుతోంది. అయితే, పంచప్రాణాల్లో ఒకటి మాత్రం ఎక్కువ కాలం పనిచేస్తుంది. అది వ్యానం. ఈ వ్యానం ద్వారానే ప్రాణం బయటకు వెళ్తుంది. బయటకు వెళ్లినా 12 రోజులపాటు ప్రాణం అక్కడే తిరుగుతుంది అని మన కర్మకాండ సిద్ధాంతం కూడా చెబుతుంది. అందుకే 12 రోజులపాటు కర్మకాండ చేస్తాము. పరకాయ ప్రవేశం చేయాలంటే, ఈ వ్యానాన్ని కంట్రోల్ చేయాలి. అలా వ్యానాన్ని కంట్రోల్ చేయగలిగినప్పుడు, మనకు కావలసినప్పుడు ప్రాణాన్ని బయటకు తీసుకురావచ్చు. మళ్లీ కావలసినప్పుడు అదే

మార్గం నుంచి ప్రాణాన్ని లోపలికి తీసుకెళ్ళవచ్చు. వ్యానం ఉన్నంతవరకు మన శరీరంలో ఏ భాగము పాడవదు. ఆదిశంకరులు ఈ పద్ధతి ద్వారానే పరకాయ ప్రవేశం చేశారు.

అదే సమయంలో పాము కాటుతో ఓ రాజు చనిపోయాడు. మన లెక్క ప్రకారం ఊపిరి ఆగిపోయిన రెండు గంటల వరకు ప్రాణం అనేది శరీరంలోనే ఉంటుంది కాబట్టి, ఆ సమయంలోనే పరకాయ ప్రవేశం చేయాలి. అలా రాజు శరీరంలోకి ఆదిశంకరులు ప్రవేశించి, అన్నీ స్వానుభావంతో తెలుసుకొని, రాణి ప్రశ్నలకు జవాబులు చెప్పి, వాదనలో ఆమెను ఓడించారు అని ఆదిశంకరులు జీవితంలో ఉన్న కథ అలా మన ప్రాణ శక్తి మీద పూర్తి నియంత్రణ సాధించే యోగమే పరకాయ ప్రవేశం.

ఇంకా మన దేశంలో అద్భుత శాస్త్రాలు ఎన్నో ఉన్నాయి. ఇప్పటికీ సైన్స్ కి అందని వింతలెన్నో ఉన్నాయి. అలాంటి శాస్త్రాల గురించి ఇప్పుడు తెలుసుకుందాం.

శకున శాస్త్రం. ఈ శాస్త్రాన్ని గర్గముని రచించాడు. పక్షుల అరుపులు, మనుషుల మాటలను బట్టి శుభాలు, అశుభాలను చెప్పే శాస్త్ర మిది. ఎవరైనా కొత్తవారు వస్తే వీధిలో కుక్కలు అరుస్తాయి. అలాగే, కొన్ని ప్రకృతి విపత్తులను సీతాకోకచిలుకలు ముందే పసిగడతాయి. మనం కోపం వచ్చినప్పుడు ఒకలా ఆనందంగా ఉన్నప్పుడు మరొకల ప్రవర్తిస్తాం. అలా బర్డ్స్ సైకాలజీ, హ్యూమన్ సైకాలజీ కలిపి ఉన్న శాస్త్రం

శకున శాస్త్రం. ప్రపంచంలో మొట్టమొదటి సైకాలజీ కంటెంట్ శకున శాస్త్రము.

విషశాస్త్రం. ఈ శాస్త్రాన్ని అశ్వినీకుమారుడు రచించాడు. ఇందులో 32 రకాల విషాల గురించి ఉంది. ఆ విషాల గుణాలను చెప్పింది. అంతేకాదు, ఆ విషాలను ఎలా తయారు చేయొచ్చు కూడా ఉంది. ఆ పాయిజన్ కు విరుగుడు, అంటే, యాంటీవేనం తయారీ గురించి కూడా ఆ శాస్త్రం చెప్తుంది. ఇది ఒక మిరాకిల్.

గజశాస్త్రం. ఈ శాస్త్రాన్ని కుమారస్వామే సాక్షాత్తు రచించారని అంటారు. ఇందులో ఏనుగుల శరీర లక్షణాన్ని పరీక్షించడానికి 16 పద్ధతులు ఉన్నాయి.

మరో అద్భుతమైన శాస్త్రం మహేంద్రజాలం. ఇప్పుడు మ్యాజిక్ అంటున్నాం. ఈ గ్రంథాన్ని వీరబాహు అనే ఋషి రచించాడు. ఇందులో అన్ని గారడీ విద్యల గురించి ఉంటాయి. నీటిపై నడవడం, గాలిలో తేలడం ఇలాంటి భ్రమలు కల్పించే విద్యలు ఎలా ప్రదర్శించాలో ఈ మహేంద్రజాల గ్రంథంలో ఉన్నాయి.

ఇలాంటి ఎన్నో అద్భుత గ్రంథాలను మన భారతీయులు సృష్టించారు ఎన్నో దండయాత్రలో ఈ గ్రంథాల మూలాలు చాలా వరకు నాశనం అయ్యాయి. అయినా, ఇప్పటికీ సైన్స్ కి అందని ఎన్నో విషయాలు మన ప్రాచీన ఋషులు రచించిన గ్రంథాల్లో కనిపిస్తూనే ఉంటాయి.

## శాస్త్రవేత్తలకి అంతుచిక్కని మహాభారతం టెక్నాలజీ

మహాభారత ఇతిహాసం వ్యాసుడు రచించి 5000 ఏళ్ళు అయిందని కొందరు చరిత్రకారులు చెప్తుంటారు. 5000 ఏళ్ళ క్రితం ప్రపంచంలో చాలాచోట్ల అసలు భాష లేదు, లిపి లేదు. అలాంటి సమయంలో ఇప్పటికీ సాధ్యం కాని విధంగా అంత గొప్ప గ్రంథాన్ని రచించడం దైవ సంకల్పం తప్ప ఇంకోటి కాదు. మహాభారతాన్ని మించిన ఇతిహాసం, అంత గొప్ప సాహిత్యం మరొకటి రాలేదు. ఇంత ఆధునిక ప్రపంచంలో కూడా 5వేల ఏళ్ళ క్రితం రచించిన సాహిత్యాన్ని మించినది రాకపోవడం ఆశ్చర్యం. విచిత్రం ఏంటంటే, ప్రపంచంలోనే ఇలాంటి గొప్ప సాహిత్యం ఇప్పుడు వరకు రాలేదు. భారతం అప్పటి చరిత్రను చెప్పే సాహిత్యం మాత్రమే కాదు, ఇప్పటికీ అంతు చిక్కని ఎన్నో సైన్సు సంగతులను చెప్పింది. ఇప్పటికీ మహాభారతం గురించే చర్చ జరుగుతోంది. భారతంలో ఉన్నవి నిజమా? కల్పనా? అన్నది పక్కన పెట్టండి. ఒకవేళ ఆ టెక్నాలజీ ఊహ అయినా గాని, అద్భుతమే కదా ఏ ఇన్వెన్షన్ అయినా ఊహల నుంచి ఆలోచనల నుంచే పుడుతుంది. మహాభారతం కల్పన అని చెప్పేయడం కాదు. అందుకు ఆధారాలు కూడా చూపించగలగాలి. మనకు తెలియని ప్రతి విషయాన్ని కల్పన అనేయడం చాలా ఈజీ. మహాభారతంలో ఎన్నో అద్భుతాలు ఉన్నాయి. విదేశీయులు వాటి మీద రీసెర్చ్ చేసి, కొన్ని అద్భుతమైన అంశాలను మనకు అందించారు. అవేమిటో చూద్దాం.

భారతంలో ఆదిపర్వంలోనే ఎన్నో అద్భుతాలు ఉన్నాయి. ముఖ్యంగా ధృతరాష్ట్రుడు, పాండురాజుల పుట్టుక. వ్యాసుడు నియోగ ధర్మం ద్వారా అంబికా అంబాలికలకు కనడం. వ్యాసుడిని చూసి భయపడి కళ్ళు మూసుకున్న అంబికకు అంధుడైన దృతరాష్ట్రుడు పుట్టాడు. అంబాలిక పాలిపోవడం వల్ల ఆ రంగుతోనే పాండురాజు పుట్టాడు. అంబాలిక దాసిని పంపిస్తే ఆ దాసికి ధర్మపరుడైన విదురుడు పుట్టాడు. ఇందులో సైన్సు ఏముంది? అనిపించవచ్చు. ముగ్గురికి మగ పిల్లలే పుట్టారు. వ్యాసుడు అదెలా నిర్ణయం చేయగలిగాడు? 1974లో అమెరికా అయోవా యూనివర్సిటీలో డోనాల్డ్, లాకే అనే ఇద్దరు సైంటిస్టులు ఇదే విషయంపై పరిశోధన చేశారు. స్త్రీ పురుష సంభోగ సమయంలో వారి మానసిక ఆవేశాలే బిడ్డ లింగ నిర్ణయంలో ముఖ్యమైన పాత్ర పోషిస్తాయని వారు చెప్పారు. అంబికా అంబాలిక మానసిక స్థితులు వల్లే వారికి మగ బిడ్డలు పుట్టారు. మానసిక సంక్షోభం ఎక్కువగా ఉన్నప్పుడు, సంభోగ సమయంలో స్పెర్మ్ కణాల్లో వైక్రోమోజం ఉన్న వీర్యకణాన్ని అండం ఆకర్షిస్తుందని సైన్స్ చెప్తోంది. కురువంశానికి అప్పటికి రాజు అవసరం కాబట్టి, వ్యాసుడు అలాంటి పరిస్థితిని అంబికా అంబాలికలకు సృష్టించాడని అనుకోవచ్చు. అంతేకాదు, ఈనాటి స్పెర్మ్ డొనేషన్, ఆనాటి నియోగ పద్ధతి ఒకేలా కనిపిస్తాయి.

ఆ తర్వాత కౌరవుల జననం మహాభారతానికే హైలెట్. కుంతి కన్నా ముందే తనకు బిడ్డ పుట్టాలని గాంధారి అనుకుంది. అది జరగలేదు. ఆవేశంతో గాంధారి గర్భం మీద కొట్టుకుంటే, గర్భంలో ఉన్న

పిండం కింద పడింది. వ్యాసుడు వచ్చి, కింద పడిన మాంస ఖండాన్ని నూటొక్క భాగాలు చేసి, ఘృతబాండాల్లో సంరక్షించాడు. ఆ కుండల్లో ఆవు నెయ్యి నింపి మాంస ఖండాలను ఓ పద్ధతి ప్రకారం దాచి, వాటిని పెంచాడు. ప్రతిరోజు ఓ నిర్ణీత సమయంలో గాంధారిని ఆ నూటొక్క కుండలను తాకమని చెప్పాడు. మాతృత్వ వాత్సల్య స్పర్శ వల్లే ఆ కుండల్లో అండాలు మాతృగర్భం బయట కూడా పెరిగాయి. నెలలు నిండాక దుర్యోధనుడు మిగిలినవారు పుట్టారు.

ఈ విధానాన్ని కొందరు సైంటిస్టులు మూడు రకాలుగా విభజించారు. ఒకటి, పిండాలని ముక్కలు చేయడం. మెడికల్ భాషలో స్లైసింగ్ ఎంబ్రియో. రెండోది, తల్లి గర్భాన్ని పోలిన కొత్త వాతావరణాన్ని సృష్టించి పిండాలను పెంచడం. ఆర్టిఫిషియల్ యూటర్న్ స్. మాతృ స్పర్శ కల్పించడం. మదర్ టచ్. వ్యాసుడు 100 ఖండాలుగా ఎందుకు చేశాడంటే, కనీసం ఒక్క ఖండంలోనైనా జీవకణం ఉంటే, ఒక కొడుకైన పుడతాడని. కానీ, వ్యాసుడు దైవ మహిమ వల్ల 100 మంది కొడుకులు పుట్టారు. ఇప్పటికీ చేతిచలవ అంటుంటాం కదా. అలాంటిదే అనుకోవచ్చు. అయితే, ఇప్పటివరకు గర్భాశయాన్ని పోలిన ఆర్టిఫిషియల్ గర్భాశయాన్ని వైద్యశాస్త్రం కూడా నిర్మించలేకపోయింది. కానీ, ఆనాడే వ్యాసుడికి అలాంటి ఊహ రావడం, సైంటిఫిక్ గా రూపొందించడం ఆశ్చర్యం, అద్భుతం. ఆ టెక్నాలజీ ద్వాపరం దాటి కలియుగానికి రాలేదన్నది వాస్తవం.

మాతృ స్పర్శ లేని సంతానంలో ఎన్నో సమస్యలు వస్తాయి ఇప్పటి సైన్సు చెబుతోంది. అందువల్లే ఘృతభాండాలలో ఉన్న తన బిడ్డలను రోజు గాంధారి తాకాలని చెప్పాడు, వ్యాసుడు. ఆ రకంగా కుండల్లో ఉన్న పిండాలు తల్లి గర్భంలో ఉన్నట్టే పెరిగారు. ఇంత సైన్స్ కనిపిస్తూ ఉంటే, మహాభారతంనాటికి సైన్స్ లేదని ఎలా చెప్పగలం?

ఇక, ట్రాన్స్జెండర్, ట్రాన్ సెక్సువల్. లింగమార్పిడి మహాభారతంకాలం నాటికే ఇది ఉంది. భీష్ముడిని చంపేందుకు అంబ శిఖండిగా పుట్టింది. మొదట ఆడపిల్లగా పుట్టి, ఆ తర్వాత మగవాడిగా మారిన క్యారెక్టర్ శిఖండి. ఆడపిల్లగా పుట్టినా, మగవాడి లక్షణాలే ఉన్న పాత్ర శిఖండి. దీన్నే ఇప్పటి భాషలో ట్రాన్ సెక్సువలిజమ్ అంటున్నారు. దానికి అనుగుణంగా ఇప్పుడు సర్జరీలు కూడా చేస్తున్నారు. చాలామంది లింగ మార్పిడి చేసుకోవడం చూస్తూనే ఉన్నాం. ఒక యక్షుడు ఆమెకి సైక్రియాటిక్ ట్రీట్మెంట్తో మగతనాన్ని ఇచ్చాడు. దాంతో అంతవరకు మగలక్షణాలతో ఉన్న ఆడపిల్లగా పెరిగిన శిఖండి, పూర్తిగా మగవాడిగా మారాడు.

ఇక, బృహన్నల పాత్ర మరో అద్భుతం. ఇది టెంపరరీ ట్రాన్ సెక్సువలిజమ్. ఇది సాధ్యమా? సాధ్యమే అని మోడరన్ సైన్స్ చెప్తుంది ఇటువంటి స్థితిని హెర్మా ఫ్రోడైటిజమ్ అంటారు. కొంతకాలం స్త్రీగా ఉండి మళ్లీ పురుషుడిగా మారే లక్షణం, ఇది. కొన్ని జంతువుల్లో ఈ లక్షణం ఉంటుంది. ఊర్వశి శాపం వల్ల అర్జునుడు ఏడాది పాటు ట్రాన్ స్ జెండర్ గా ఉన్నాడు. అజ్ఞాతవాసంలో ఆ శాపమే ఆయనకు వరంగా మారింది.

ఇది పూర్తిగా సైకలజికల్ యాస్పెక్ట్ గా వైద్యులు చెప్తారు. కనుక, మహాభారత కాలంలోనే హెర్మా ఫ్రోడైటిజమ్ గురించి అవగాహన ఉందని అనుకుందామా! కోరుకున్నప్పుడు పురుషుడు స్త్రీగా మారే ట్రీట్మెంట్లు ఆ రోజుల్లోనే ఉన్నాయని చెప్పేందుకు బృహన్నలను మించిన ఎగ్జాంపుల్ ఉందా?

ఇక, టెస్ట్ ట్యూబ్ బేబీస్ గురించి మహాభారతంలో ఎన్నోసార్లు కనిపిస్తుంది. అసలీ టెక్నాలజీని మహాభారతంలో వాడుకున్నట్టు ప్రపంచ సాహిత్యం, లేదా, చరిత్రలో ఇంకెవరు వాడలేదు. భారతంలో టెస్ట్ ట్యూబ్ తరహాలో పుట్టినవారు చాలామంది ఉన్నారు. కౌరవులు కృత్రిమ గర్భంలో పెరిగారు. పురాణాల్లో వశిష్ఠుడు, అగస్త్యుడు టెస్ట్ ట్యూబ్ తరహాలో పుట్టినవారే. భారతంలో ద్రోణుడు, కృపాచార్యుడు, కృపి భాండాలలో పుట్టినవారే. స్త్రీబీజం నుంచి అండకణాన్ని సేకరించి, గర్భాశయం వెలుపల పోషకాలలో ఉంచి, చుట్టూ వీర్య కణాలను వదిలి, ఆ వీర్య కణాలతో అండాన్ని కలపడం అనే టెక్నాలజీ వేల క్రితమే తెలుసు అంటే ఆశ్చర్యంగానే ఉంటుంది. ద్రోణుడిని కుంభసంభవుడు అంటారు, అంటే, ప్రత్యేకమైన కుండలో పెరిగాడు. ద్రోణుడు తండ్రి భరద్వాజుడు. ఆ కాలంలోనే యంత్ర శాస్త్రాన్ని పరిశోధించిన శాస్త్రజ్ఞుడు. అతనికి ఇలాంటి టెస్టు ట్యూబ్ టెక్నాలజీ తెలియడంలో వింత ఏమీ లేదు.

ఇప్పటి ఫిజిక్స్ సూత్రాలు ఎన్నో మనకు మహాభారతంలో కనిపిస్తాయి, "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః". అంటే, అర్థం, ఉన్నదానిని పూర్తిగా నాశనం చేయలేం. లేని దాని నుంచి ఉన్నదానిని

సృష్టించలేం—అని. పదార్థం శక్తిగా మారుతుంది, శక్తి పదార్థంగా మారుతుంది అని మరో అర్థం. అంటే, శక్తిని నాశనం చేయలేము అనే కదా అర్థం. ఐన్ స్టీన్ "ఇ ఈజ్ ఈక్వల్ టు ఎంసీ స్క్వేర్" శక్తి సూత్రం ఇలాంటి అర్థాన్ని చెప్తుంది కదా. ఇలాంటి ఎనర్జీ థియరీస్ ఎన్నో మనకు మహాభారతంలో కనిపిస్తాయి.

1945 జూలైలో అమెరికన్ సైంటిస్ట్ రాబర్ట్ ఓపెన్ హైమర్ తొలి అణుబాంబును పరీక్షించాడు. అప్పుడు జరిగిన మహావిస్ఫోటనం గురించి ప్రపంచం అంతా చర్చించుకుంది. ఒక ఆంధురాలికి కూడా ఆ కాంతి అనుభవం కలిగి, తన తాతను "ఏం జరిగింది? " అని అడిగిందట. అంటే, అంధులకు కూడా కనిపించేంత డీప్ ప్లైట్ ని న్యూక్లియర్ బాంబ్ కల్పించగలరు. ప్రెస్ మీట్లో ఆ బాంబు గురించి హైమర్ ని అడిగారు. అప్పుడు ఆయన చెప్పిన సమాధానం భగవద్గీత గురించి. భగవద్గీతలో విశ్వరూప దర్శనం ఉంటుంది. అందులో, "దివి సూర్యసహస్రస్య" అనే శ్లోకం అర్థాన్ని ఒక విదేశీయుడైన ఓపెన్ హైమర్ వివరించాడు. 5000 సంవత్సరాల క్రితం కురుక్షేత్ర యుద్ధం సమయంలో అర్జునుడికి శ్రీకృష్ణుడు చూపించిన విశ్వరూపం ఒక ఆటంబాంబు విస్ఫోటనంతో సమానంగా వివరించాడు, హైమర్. అంధుడైన ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని విశ్వరూపాన్ని చూసినట్లు మహాభారతం చెప్తోంది. అంటే, ఒక అణుబాంబులాంటి కాంతిని అంధులు కూడా చూడగలరని ఋజువైనట్టే.

విశ్వరూపం అంటే శరీరం పెరగడం. ఈ విశ్వరూపం గురించి వరల్డ్ ఫేమస్ సైన్స్ ఫిక్షన్ రచయిత అసిమోవ్ కూడా వివరించారు. ఈ

విశ్వరూపాన్ని ఫిజిక్స్ లోకి మారిస్తే, మాక్రో పైజేషన్, మైక్రోపైజేషన్ అంటారని ఆసిమావ్ చెప్పారు. మాక్రో పైజేషన్ అంటే, స్థూల శరీరం. అంటే పెద్ద శరీరం. మైక్రో అంటే, సూక్ష్మ శరీరం. యోగసాధన ద్వారా శరీరాన్ని పెద్దది చేసుకోవడం, సూక్ష్మంగా మార్చుకోవడం సాధ్యమే అని అసిమోవ్ అన్నారు. ఈ విశ్వరూపం ఆధారంగానే అసిమవ్ రాసిన నవల "ఫెంటాస్టిక్ ఓయేజ్ టు డెస్టినేషన్ బ్రెయిన్". విశ్వరూప విద్య వస్తే అంతా నీలోనే ఉన్నట్టు సామాన్యులకు అనిపిస్తుంది. దైవం అంటే అదే కదా. అందువల్ల విదేశీయులు గుర్తించిన విషయాలను కూడా మనం మహాభారతంలో గుర్తించలేకపోయాం.

ఎందరో విదేశీయులు మహాభారతంపై రీసెర్చ్ చేసారు. వారు చెప్పినదానిని బట్టి మహాభారతం సమయంలో ఇప్పటి ఊహలకు కూడా అందనంత సైన్స్ ఉంది. ఆ టెక్నాలజీ ద్వాపరయుగం దాటి కలియుగంలోకి రాలేదు. కలియుగంలో మళ్లీ సైన్స్ ఓనమాల దగ్గర నుంచి ప్రారంభమైంది. ప్రతి యుగానికి, యుగానికి మధ్య సంధి కాలం ఉంటుంది. ఆ సంధికాలమే ప్రళయం. పూర్తిగా తుడిచిపెట్టుకుపోయి మళ్లీ కొత్తగా కాలం చిగురిస్తుంది. కానీ, ఏం జరిగిందో కూడా ఆ కాలమే కొన్ని హింట్స్ ఇస్తుంది. అలా గత చరిత్రను గుర్తు చేసేందుకు కాలం ఇచ్చిన గ్రేట్ హింట్ మహాభారతం.

## ఓంకారం —ఆధునిక విజ్ఞానం

మన పక్కనుంచి ఎన్నో కార్లు బస్సులు వెళ్తుంటాయి. వాటి శబ్దం మనకు వినిపిస్తుంది. ఏ వెహికల్ మన పక్కనుంచి వెళ్లినా, ఆ సౌండ్ మనకు వినిపిస్తుంది. మరి, ఆకాశంలో అన్ని నక్షత్రాలు, గ్రహాలు తిరుగుతూ ఉంటాయి. వాటి శబ్దం మనకి ఎందుకు వినిపించదు? పెద్ద పెద్ద నక్షత్రాలు లక్షల అనుబాంబులతో సమానం. అవి నిత్యం పేలుతూనే ఉంటాయి. వాటి శబ్దం మనకెందుకు వినిపించదు? ఒక వస్తువు కదులుతున్నప్పుడు వచ్చే శబ్దం అనే ఫిజిక్స్ థీరి వాటికి లేదా? ఉంది. వాటి నుంచి కూడా శబ్దాలు వస్తుంటాయి. కానీ, మనమే వినలేకపోతున్నాం. ఈ సృష్టి మొత్తానికి మూలం కూడా ఒక అణు విస్ఫోటనం. దాన్నే బిగ్ బ్యాంగ్ అని ఫిజిక్స్ అంటుంది. ఈ బిగ్ బ్యాంగ్ నుంచి కూడా ఒక శబ్దం వచ్చింది. అదే ఓంకారం.

సృష్టి నిరంతరం విస్తరిస్తూనే ఉంటుంది. అంటే, ఈ సృష్టి అంతమయ్యేవరకు ఓంకారం కూడా అణువణువు వినిపిస్తూనే ఉంటుంది. సృష్టి నుంచి ఏర్పడిన శబ్దమే ఓంకారమని మనవాళ్ళు చెబితే, కొందరు కొట్టి పారేస్తారు. కానీ, ఈ విషయాన్ని చెప్పింది ప్రఖ్యాతి చెందిన విదేశీ సైంటిస్ట్ అయితే, ఆ సైంటిస్ట్ నికోలాస్ టెస్లా. ఫిజిక్స్ తెలిసినవారికి పరిచయం అవసరం లేని పేరు. ఈరోజు మన ఇంట్లో స్విచ్ వేస్తే లైట్ వెలుగుతోంది అంటే, కారణం నికోలాస్ టెస్లా. ఆల్టర్నేటివ్ కరెంట్ ను కనిపెట్టిన అపర మేధావి నికోలా టెస్లా. ముందు ఆయన గురించి తెలుసుకొని, ఓంకారానికి సంబంధం ఏంటో చూద్దాం.

ప్రముఖ అమెరికన్ శాస్త్రవేత్త నికోలాస్ టెస్లా. జూలై, 10, 1856లో ఆయన పుట్టారు. మోడరన్ లైఫ్ ను అందించిన గొప్ప సైంటిస్ట్. కరెంట్ లేకుండా ఒక గంటకూడా ఈరోజుల్లో ఉండలేం. అలాంటి కరెంటును కనిపెట్టిన సైంటిస్ట్ టెస్లా. ఆయన గొప్ప మెకానికల్ ఇంజనీర్, ఎలక్ట్రికల్ ఇంజనీర్. 1500 పైగా ఇన్వెన్షన్ చేశారు. ఏసీ మోటర్లు, ట్యూబ్ లైట్లు, స్టీమ్ టర్బైన్లు, మ్యాగ్నెటిక్ ఫీల్డ్, వైర్లెస్ ఎనర్జీ ట్రాన్స్ఫర్, రిమోట్ కంట్రోల్ పరిజ్ఞానం, రోబోటిక్స్, న్యూక్లియర్ ఫిజిక్స్, కంప్యూటర్ సైన్స్, ఇలా అన్ని రంగాల్లో టెస్లా చేసిన పరిశోధనలు ఇప్పటికే క్లాస్ రూమ్ లో పాఠాలే.

టెస్లా యుగోస్లావియాలో పుట్టాడు. జర్మనీ, ఫ్రాన్స్ దేశాలలో పనిచేశాడు. 1884లో ఫేమస్ సైంటిస్ట్ థామస్ అల్వా ఎడిసన్ తో కలిసి పని చేశారు. ఇద్దరూ మేధావులే. అందుకే కలిసి ఎక్కువకాలం పనిచేయలేకపోయారు. విడివిడిగా ప్రయోగాలు మొదలుపెట్టారు. ఆ టైంలోనే ఎడిసన్ డైరెక్ట్ కరెంట్ కనుక్కున్నారు. దానికి పోటీగా టెస్లా ఆల్టర్నేటివ్ కరెంటును కనుగొన్నారు. ఏసీ కరెంట్ వచ్చాక ప్రపంచమే మారిపోయింది. ఈరోజు కరెంటు లేని ప్రపంచాన్ని ఒక్క క్షణం కూడా ఊహించలేం. ఆ దెబ్బతో టెస్లా వరల్డ్ ఫేమస్ అయిపోయారు.

టెస్లా ఎన్నో ప్రయోగాలు చేశారు. కానీ వాటన్నిటిలో ఒక గొప్ప ప్రయోగం రహస్యంగా మిగిలిపోయింది. ఆ ప్రయోగమే ఓంకారం గురించి చెప్పింది.

1898లో నికోలా టెస్లా రేడియో టెక్నాలజీపై ప్రయోగాలు చేస్తున్నారు. అమెరికాలో కొలరాడ స్ప్రింగ్ అనే ఒక ప్రాంతం ఉంది. అక్కడ

ఒక వైర్లెస్ టవర్ ని టెస్లా నిర్మించారు. ఆ టవర్ నుంచి రేడియో సిగ్నల్స్ పై ప్రయోగాలు చేశారు. మన భూమితో పాటు, ఇతర గ్రహాల్లోను జీవం ఉందా? ఉంటే, ఆ గ్రహాంతర జీవులు భూమిని కమ్యూనికేట్ చేస్తారా? ఈ ప్రశ్నలే టెస్లా పరిశోధనలు. అందుకే స్పేస్ నుంచి వచ్చే రేడియో వేవ్స్ ని ఎనాల్సిస్ చేశాడు. టెస్లా భూమ్మీద నుంచి రేడియో వేవ్స్ ని పంపించేవాడు. కానీ, వేరే గ్రహాల నుంచి టెస్లాకు ఎలాంటి సిగ్నల్స్ అందలేదు. అయితే, ఒక వండర్ సౌండ్ మాత్రం రెగ్యులర్గా వచ్చేదట. ఆ సౌండ్ ఒక రేడియో డిస్టర్బెన్స్ లా ఉండేది. మొదట్లో ఆ సౌండ్ ని టెక్నికల్ ప్రాబ్లం అనుకున్నాడు. కానీ, ఆ తర్వాత ఆ సౌండ్ స్పేస్ నుంచే వస్తుందని కనిపెట్టాడు. ఇంకా ఎనాలసిస్ చేస్తే, ఆ సౌండ్ భూమి బయటకించే వస్తుందని తేలింది. అలా వస్తున్న సౌండ్ ఓకే ఫ్రీక్వెన్సీ లో ఒకే స్వరంతో వచ్చింది, ఒక సంగీత స్వరంలా. అది కూడా ఆగకుండా వస్తూనే ఉంది. అంటే, ఒక హమ్మింగ్ లా వస్తోంది. ఈ విశ్వంలో భూమి తిరగడం వల్ల భూమి నుంచి వచ్చే సౌండ్ గా ఈ హమ్మింగ్ గురించి టెస్లా రాసుకున్నారు. అయితే, భూమి నుంచి వచ్చే శబ్దం గురించి టెస్లా చెబితే ఎవరూ నమ్మలేదు. ఆ తర్వాత, కూడా వేరే గ్రహాల మీద పరిశోధన చేస్తూ, టెస్లా తన 88 ఏట మరణించారు.

టెస్లా కనిపెట్టిన హమ్మింగ్ సౌండ్ ఏంటి? సృష్టి నుంచి నిర్విరామంగా ఒక శబ్దం వస్తోందని, అదే ఓంకారమని మన ఋషులు, వేదాలు ఉపనిషత్తులలో చెప్పారు. ఆ శబ్దానికి, టెస్లా ప్రయోగాల్లో

ఇంటర్వ్యూలు లేకుండా ఒకే ఫ్రీక్వెన్సీతో వచ్చే ఓంకారానికి చాలా పోలికలు ఉన్నాయి.

"స్పేస్ నుంచి శబ్దం వస్తోంది" అన్న టెస్లా మాటలను నమ్మిన మరో సైంటిస్ట్, కార్లు జెన్ స్కీ. 1935లో టెస్లా సౌండ్ పై ఆయన పరిశోధనలు చేశారు. టెస్లా చెప్పిన హమ్మింగ్ సౌండ్ నిజమేనని, అయితే, అది భూమి శబ్దం మాత్రమే కాదని, విశ్వమంతా ఉందని ఒక అద్భుతమైన విషయం చెప్పారు. ఈ హమ్మింగ్ విశ్వం మధ్య భాగం, అంటే, కోర్స్ పేస్ నుంచి ఎక్కువ వస్తుందని జెన్స్ స్కీ చెప్పారు. విశ్వం మధ్య భాగం అంటే బిగ్ బాంగ్ పుట్టిన చోటు. కార్ల్ జెన్ స్కీ చెప్పిన వివరాల ప్రకారం, విశ్వం పుట్టినప్పుడు ఏర్పడిన ఆ శబ్దమే టెస్లా కనిపెట్టిన హమ్మింగ్. ఆ శబ్దం యూనివర్స్ అంతా వ్యాపించి ఉంది. మన చుట్టూ కూడా ఉంది. గెలాక్సీలా రేడియో వేవ్స్ నుంచి హమ్మింగ్ శబ్దం వస్తోంది. దాన్నే కాస్మిక్ సౌండ్ అనుకోవచ్చు.

జెన్ స్కీ వివరణతో యూనివర్సిటీ ఒక శబ్దం ఉందని ఖచ్చితంగా తెలుస్తోంది. ఈ శబ్దం ఒక్క భూమి వల్లే కాదు. యూనివర్స్ లో గ్రహాలు, నక్షత్రాలు అన్నీ కదులుతూ ఉండటం వల్ల వచ్చే శబ్దమే. , మరి ఆ శబ్దాన్ని మనం ఎందుకు వినలేకపోతున్నాం. చిన్నప్పుడు చదువుకున్న ఫిజిక్స్ లెసన్ అందరికీ గుర్తుండే ఉంటుంది మన చెవి 20 నుంచి హెజ్ ల 20, 000 ఫ్రీక్వెన్సీ మధ్య ఉండే సౌండ్ వస్తుంది మాత్రమే వినగలదు. 20 హెజ్ ల కన్నా తక్కువ ఉన్న సౌండ్ లను ఇన్ఫ్రా సౌండ్లు అంటారు. వాటిని మనం వినలేం. ఇక, 20, 000 హెజ్ ల కన్నా ఎక్కువ ఉన్న సౌండ్ లు

అల్ట్రా సౌండ్లు. వాటిని కూడా మనం వినలేం. వీటిపైన రేడియో వేవ్స్, వాటిని దాటి మైక్రోవేవ్స్, ఆపైన ఇన్ ఫ్రా రెడ్ అల్ట్రావైలెట్స్, ఎక్స్రే, గామాలు, ఇంకా ఎన్నో వేవ్ స్ ను ప్రకృతి మనకి ఇచ్చింది. ఇందులో ప్రతి వేవ్ ఇప్పుడు మనకు ఉపయోగపడుతున్నవే.

శబ్దం వినబడాలంటే మధ్యలో ఒక మీడియా అంటూ ఒకటి ఉండాలి. కానీ మన స్పేస్ అంతా ఒక వాక్యం. అంటే శూన్యం. శూన్యంలో మీడియం ఏమీ ఉండదు. కాబట్టి, ఆ కాస్మిక్ సౌండ్ ని మనం వెళ్ళలేకపోతున్నాం. రేడియో వెడ్స్ కి రేడియో వేవ్స్ కి నక్షత్రాలు, సూర్యుడు వీటి నుంచి వచ్చే ఛార్జ్ ఉంటుంది కాబట్టి, వాటికి ఏమీడియం అవసరం లేదు. కనుక రేడియో యూనివర్స్ అంతా ఎక్స్పాండ్ అయ్యాయి. బిగ్ బ్యాంక్ నుంచి, అంటే, బ్రహ్మాండం బద్దలై విశ్వం ఏర్పడినప్పుడు ఈ రేడియో వేవ్స్ ఏర్పడ్డాయి. అవి ఈ యూనివర్స్ ఉన్నంతవరకు ఉంటాయి. హమ్మింగ్ సౌండ్, యూనివర్స్ నుంచి వచ్చిన ఈ రేడియో వేవ్ స్ సౌండే. అందుకే, 20 వేల హెజ్ లల పైన ఉండే ఈ రేడియో డిస్టబెన్స్, లేదా ఓంకారాన్ని మనం నేరుగా వినలేకపోతున్నాం. ఒకవేళ వినిపించినా, మనం భరించలేం. ఏ రేడియో ఫ్రీక్వెన్సీ ని మనం డైరెక్ట్ గా వినలేం. విని తట్టుకోలేము కూడా. అంత శక్తి కలిగి ఉంటాయి. మరి, కాస్మిక్ సౌండ్స్ అన్నిటికీ తల్లి లాంటి ఓంకారంశక్తి ఎంత ఉంటుందో మీరే ఊహించుకోండి. రేడియోలో మనకు కావలసిన స్టేషన్ ఫ్రీక్వెన్సీ ని ఎంచుకొని పాటలు వింటాం. యోగులు, ఋషులు తపస్సుతో తమ శరీరంలో ఉన్న ప్రతి భాగాన్ని తమ కంట్రోల్ లోకి తెచ్చుకొని ఈ ఓంకార

నాదాన్ని వినగలిగారు. విని, సృష్టి ఏర్పడినప్పుడు వచ్చిన ఈషఆధ్యాత్మిక శబ్దం గురించి కొన్ని వేల ఏళ్ళ క్రితమే చెప్పారు. ఆ హమ్మింగ్ తోనే మంత్రాలు ఏర్పరచారు. ప్రతి ఒక్కరూ ఓంకారాన్ని జపిస్తే విశ్వశక్తిని పొందవచ్చు అని చెప్పారు. మంత్ర శక్తి శబ్దశక్తితో అనుసంధానమై ఉన్నదని, మంత్రం వెనక ఒక ఫిజిక్స్ ఉన్నదని ఆనాడే ఋషులు చెప్పారు.

టెస్లా ఇన్వెన్షన్ లో చెప్పిన కాస్మిక్ సౌండ్ థీరిని మన ఋషులు ఎలా చెప్పారో ఇప్పుడు చూద్దాం. "ప్రణవో హి పరబ్రహ్మ ప్రణవః పరమం పదమ్, ప్రణవం సర్వ వేదాద్యం సర్వదేవ మయమ్" అన్నారు అంటే, ప్రాణం ముక్తి ప్రణవం సర్వ వేదాలకు మూలం ప్రణవమే. సకల దేవతల మూలమని పైన మనం చెప్పిన శ్లోకానికి అర్థం. సింపుల్ గా చెప్పాలంటే అన్ని చోట్ల ప్రణవమే. అంటే, ఓంకారమే అని ఆనాడే మన ఋషులు చెప్పారు. నికోలా టెస్లా చెప్పింది కూడా ఇదే కదా.

ఓంకారం బ్రహ్మాండంనుంచి పుట్టింది అని మన ఉపనిషత్తులు చెబుతున్నాయి. అంటే, ఇప్పటి సైన్స్ ప్రకారం, బిగ్ బ్యాంగ్ గురించి పుట్టింది అని అర్థం. సృష్టి ఏర్పడినప్పుడు వచ్చిన శబ్దమే ఓంకారమని, మన ఋషులు వేలవేల క్రితం చెప్పారు. చెప్పడమే కాదు, ఈ విశ్వ శబ్దాన్ని మంత్రంగా, రోజు ధ్యానం, జలు వ్రతాల్లో భాగం చేశారు.

బ్రహ్మాండం బద్దలు అవడానికి ముందున్నది నిశ్శబ్దమే. బ్రహ్మాండం బద్దలయ్యాక ఓంకార శబ్దంతో విశ్వసృష్టి మొదలైంది. అంటే, యూనివర్స్ ఏర్పడింది. ఆ పేలుడికి ఈ యూనివర్స్ లో ప్రతి అణువు

కదిలింది. అలా కదిలి గ్రహాలు, నక్షత్రాలు ఏర్పడ్డాయి. ఆ పేలుడు వల్లే ఆ గ్రహాలకు, నక్షత్రాలకు కదలికి వచ్చింది. ఇప్పటికి ఆ గ్రహాలు ఆ కాస్మిక్ ఎనర్జీతోనే వేగంగా కదులుతున్నాయి. ప్రతి కదలికకి ఒక సౌండ్ ఉంటుంది. ఆ సౌండ్ కి అమ్మలాంటిది కాస్మిక్ సౌండ్. అదే ఓంకారం. ఆ ఓంకారం నుంచి శబ్దం పుట్టింది. ఆ శబ్దంనుంచే అక్షరాలు పుట్టాయి. అక్షరాల నుంచి మాటలు, మాటల నుంచి భాషలు, భాషల నుంచి మంత్రాలు, బీజాక్షరాలు, వేదాలు ఇవన్నీ పుట్టాయి. అందుకే "ఓంకారః సర్వ వేదానాం మూలమ్" అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. ఓంకారం నుంచే వేదాలు పుట్టాయని, అర్థం. నిత్యం విశ్వంనుంచి వచ్చే శబ్దం, శక్తి ఓంకారం మన చుట్టూనే మనతో పాటే ఎప్పటికీ ఉండే శక్తి ఓంకారం. అందుకే అంటారు, ఓంకారం యూనివర్సిటీలో ఉన్న ప్రతి పార్టికల్లోనూ ఉంటుందని. ఇది మన ఓంకారం గొప్పతనం.